

సి. వి. కె. రావు

జననం : 11-3-1912

# సి. వి. కె. రావు

## ఆత్మకథ



ప్రథమ భాగము

ప్రజా పురోగామి ఉద్యమ ప్రచురణ

**(People's Vanguard Movement Publication)**

# C. V. K. Rao - Autobiography

*

(In Telugu)

*



*

First Edition : 1994

*

వెల : రూ. 50/-

Printed at Kakinada Progressive Press Workers.
Co-operative Printing and Publishing Society Ltd.,
Kakinada - 533 007.
Published by People's Vanguard Movement,
Mundadugu, Kakinada - 533 003.

# విషయసూచిక

# నా జీవిత చరిత్రకు ముందు మాటలు

నాజీవిత చరిత్ర వ్రాయడం, ఆ సంఘటనల పునశ్చరణ మిగిలిన నా జీవితకాల మార్గదర్శానికి ఉపయుక్తమనుకొంటున్నాను. ఇతరులు కూడా తెలుసుకోడం అవసరమనుకొంటున్నాను. ఈ యిరవై శతాబ్దము ప్రారంభంనుంచి యిప్పటి వరకు 70 సంవత్సరాలపైగా నా అనుభవాలు పూర్తిగా నాకు సంబంధించినవి మాత్రమేకాదు, నేను జీవిస్తున్న సంఘ జీవితానికి సంబంధించినవి కూడాను. తరతరాలనుండి మన సాంఘిక జీవితము మారుతూ వస్తూంది. మనం జీవిస్తున్న కాలంలోకూడా మారుతూంది. దానంతటది మారడంలేదు. మానవుల కృషివలన మారుతూ వుంది. ఈకృషిలో నాబోటి కొందరు నిమగ్నమైపోక తప్పదు. అయితే యిది ఎవరో కోరితే జరిగేదికాదు. ఎవరో వ్యతిరేకిస్తే ఆగేదికాదు. ప్రతిబంధకాలువస్తే లక్ష్యాన్ని విడిచేదికాదు. విజయాన్ని సాధిస్తే అంతటితో పని పూర్తిఅయినట్లు కాదు. నా జీవిత పోరాటములో సుమారు 70 సంవత్సరాలు తక్కువ కాలముకాదు. ఇక ఎంతకాలము యీ పోరాటముంటుందో చెప్పలేను కాని తక్కువకాలమయినా ఎక్కువకాలమయినా ఉన్నత మానవ సాంఘిక లక్ష్యానికై పోరాటము సాగక తప్పదు.

నా చిన్నతనంలో నాభావాలు ఎక్కడికి దారితీస్తాయో నేను చెప్పలేకపవచ్చు. యువదశలో నాభావాలయెడల పట్టు

దలతో వ్యవహరించవచ్చు. మధ్యవయస్సులో నాఅనుభవము గట్టిపడవచ్చు. ఇప్పటిదశలో సంకోచించవలసిన అవసరం లేదనుకొంటున్నాను. జీవితము ఒక పరిశోధన కేంద్రమువంటిది సత్యాసత్యాల అన్వేషణ నిరంతరం జరుగుతూంది. ఈ అన్వేషణలో ఆంతరంగిక బాహ్యాసంఘర్షణలు బయులుదేరుతాయి ఈ సంఘర్షణనుండి నిజానికి స్థిరత్వమేర్పడుతూంది.

మనిషియొక్క ఆలోచనలు తన సాంఘిక పరిస్థితుల నుండి ఉద్భవిస్తాయి_ మనిషి ఆలోచనలు తన సాంఘిక పరిస్థితులకు అతీతంకావడానికి వీలులేదు_ ఒకవేళ అతీతంగానూ అపురూపంగానూ కనపడినా సాంఘిక పరిస్థితుల ప్రభావము నుండి మనిషి ఆలోచనలు స్వరూపాన్ని పొందుతాయి_ ఈ ధర్మాన్ని అవగాహనచేసుకోడం సులువుగా జరిగేదికాదు_ ఈ ధర్మాన్ని ప్రబోధించడమూకూడా చిక్కులులేని విషయం కాదు. నా జీవిత పోరాటమూ సాంఘిక పరిస్థితి అవగాహన చేసుకొన్న దశనుండి యీ సత్యాన్ని, సామాజిక మార్పుకు వినియోగిస్తున్న దశలో వున్నదని చెప్పాలి

ప్రాణంతో వున్నంతకాలమూ మనిషి పొట్టపోషించుకోడమూ గొప్పకాదు_ కుటుంబ బరువు కలగడం అసలే గొప్పకాదు. చిన్నప్రాణి మొదలుకొని మానవప్రాణివరకు యివి తప్పనివి. లేకపోతే అవి ప్రాణులుగా వుండవు_ అయితే మానవునికున్న ప్రత్యేక స్థానము తననుతాను అర్థమూ చేసుకోడమూ తన పరిసరాన్ని అర్థంచేసుకోడమూ, ప్రాణి సముదాయాన్ని

తన జాతిని అర్థము చేసుకోడమేకాకుండా, మానవజాతిని సాంఘిక, ఆర్థిక, నైతిక ప్రవృత్తిని ముందుదశకు తీసుకుపోయే సాంఘిక శక్తిని పెంపొందించడము అందుకై పోరాడే శక్తి సంపదను పెంపొందించుకొన్నవాడై వుండాలి.

వ్యక్తిగా మనిషి భూమిమీద స్థిరంగా జీవించేవాడు కాడు- ఒకతరం తరువాత యింకోతరం జీవిస్తూ మానవజాతి పెంపొందుతూవుంది- యిప్పటి శాస్త్రీయ పరిశోధన రీత్యా భూమిమీద ఒక్కటే మానవజాతి మనుగడ సాగిస్తున్నట్లు తెలుస్తూంది- ప్రస్తుతానికి ప్రాణికోటి భూగోళముపైన మాత్రమే వున్నట్లు తెలుసుకొన్నాము. ఇతర గోళాలలో ఏ ప్రాణి అయినా వున్నదా లేదా యిప్పటికి చెప్పడం సాధ్యంకాదు- ఎవరు చెబుతారు ? మనిషి తనకున్న అపార శాస్త్రీయ సాంకేతిక విజ్ఞాన సంపదనుండి తెలుసుకోవాలి- శాస్త్రరీత్యా రుజువు చేసుకోవాలి- అయితే ఊహాజనితములైన దేవలోకాలు, నాగలోకాలలోకి వాస్తవంగా పోలేము. ఊహాలో దేనినైనా సృష్టించుకోవచ్చు కాని అందుకు ఆధారాలుండవు- ఈ విశ్వంలో యితర గోళాలలో భూమికి సమీప ప్రాంతములోనున్న చంద్రగోళములో ఏమివున్నది మానవుడు స్వయంగా వెళ్ళి యితర పరిశోధక పరికరాలద్వారా పరీక్షలు చేస్తున్న విషయం నేటి తరంవారికి తెలుసున్నదే. బహుశా మరో రెండు దశాబ్దాల కాలములో యితర గోళాల పరిస్థితి మానవుడు యింకా ఎక్కువగా తెలుసుకొంటాడు.

మనము నివసిస్తున్న భూమి సుమారు 50 కోట్ల సంవత్సరాలనీ శాస్త్రజ్ఞులు అంచనా వేశారు. శాస్త్రరీత్యా యీ భూమి జీవితము సగంకూడా కాలేదని అంచనా. అయితే భూమి పుట్టినప్పటినుంచి ప్రాణి దానిమీద పుట్టలేదు. మొదటి ప్రాణులు భూమిమీద పుట్టడానికి భౌతిక పరిస్థితులు సుమారు 9 కోట్ల సంవత్సరాలక్రితమే ప్రారంభమయిందని శాస్త్రరీత్యా అంచనా కాని ప్రాణి పుట్టినతోడనే మనిషి ఉద్భవించ లేదు

ప్రాణి భూమిమీద ప్రారంభించినతర్వాత మానవ ప్రాణి అభివృద్ధి చెందింది. మానవజాతి భూమిమీద పుట్టి సుమారు 70 వేల సంవత్సరాలలో కొన్నివేల తరాలు మానవులు పుట్టుతూ, గిట్టుతూ, పుట్టుతూ వచ్చారన్నమాట. ప్రాథమిక దశలో మానవుడు అడవుల్లో, కొండల్లో, నదుల ప్రాంతాల్లో జీవించి సృష్టివైపరీత్యాలకు గురవుతూ తనసంతతిని కాపాడుకొంటూ అభివృద్ధి అవుతూ మానవజాతి రాణించిందన్నమాట

ఈ 70 వేల సంవత్సరాలలో ప్రస్తుత నాగరికత మానవ సమాజములో ఏదేశములోనైనా గత 100_150 సంవత్సరాలకాలానిదే అని చెప్పాలి. అంటే 4 నుంచి 6 తరాల కాలానిదే అని చెప్పాలి_ యిది తలచుకొంటే విడ్డూరంగా వుంటుంది. కొన్నివేల సంవత్సరాలు మానవుడు పోరాడుతూ ఆధునిక స్థితికి వచ్చాడన్నమాట.

# 1. నా పుట్టుక - అప్పటి ప్రపంచం

ఈ శతాబ్దపు ప్రారంభపు దశలో నేను పుట్టాను. అది 1912 వ సంవత్సరము. సామాజికంగా మన ప్రజలు వెనుకబడిన రోజులు, బ్రిటీషు పాలకులు బాగా పెత్తనం సాగిస్తున్న రోజులవి. ప్రపంచంలో సామ్రాజ్యవాదము బాగా బలం పొందిన రోజులు. ఆశియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు బ్రిటీషు, ఫ్రెంచి, జర్మను, డచ్ మొదలగు యూరపు సామ్రాజ్యవాదుల చేతుల్లో ఆ కాలంలో మ్రగ్గుతున్నాయి. యూరపు దేశాల్లో పెట్టుబడిదారీ విధానము బాగా అభివృద్ధి చెందింది. యూరపులో పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు బయలుదేరడంతో కార్మిక ఉద్యమం కూడ బలపడుతూ వచ్చింది. క్యాపిటలిజం అభివృద్ధితో భూస్వామిక విధానము (ఫ్యూడలిజం) అస్తమయ దశలో పడింది.

నా తండ్రి సి. రాజు 1909 లో నా తల్లి వెంకట రామ రత్నమ్మను వివాహమాడారు. ఆయనకు 21 సంవత్సరాలు, నా తల్లికి 14 సంవత్సరాలు. వారికి నేను ప్రథమ పుత్రుడను. నా తండ్రి చిన్నవయసులోనే వారి తలిదండ్రులు చనిపోవుటచే, మధ్యతరగతి కుటుంబానికి చెంది ఆస్తిపాస్తులు పోవుటచే జీవిత పోషణకై ఉద్యోగములో ప్రవేశించారు. ఆయన అక్కౌంటెంటు పరీక్షలో అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ప్రథమ స్థానములో కృతార్థులైనారు. బ్రిటీషు పాలకుల రాజ్యాధికారము స్థిరంగా నిల

ద్రొక్కుకొన్న కాలమది. ఇంగ్లీషు వ్రాతలో బహు సమర్థ వంతమయిన చెయ్యి ఆయనిది. మొదట ఏలూరులో ఉద్యోగం చేసి తన 20 వ యేట కాకినాడ యింగ్లీషు వ్యాపార సంస్థ సింప్సన్ కంపెనీలో అక్కౌంటెంటుగా చేరారు. 1912 లో వాణిజ్య గణితము ఇంగ్లీషులో అచ్చువేసి ఇంగ్లీషు వ్యాపార అధికారుల ప్రశంస నందుకొన్నారు. తాను పనిచేస్తున్న బ్రిటీష్ మేనేజిమెంటుతో కూడిన సింప్సన్ కంపెనీలో అప్పుడే యింగ్లాండునుండి వచ్చిన ఒక యింగ్లీషు ఉద్యోగికి వాణిజ్య గణితాన్ని నేర్పించమని కంపెనీ మేనేజిమెంటు కోరింది. బ్రిటీషు కంపెనీలో ఇంగ్లీషు ఉద్యోగులకు పెద్ద జీతాలు, మన ఉద్యోగులకు స్వల్ప జీతాలు, అధిక జీతాలు పొందుతున్న ఇంగ్లీషు ఉద్యోగికి తనక్రింద తర్ఫీదు యిచ్చేటప్పుడు నా తండ్రి బ్రిటీషు కంపెనీ మేనేజిమెంటును తన జీతం పెంచమని కోరారు. కంపెనీ అంగీకరించలేదు. వెంటనే మరు చటి దినాన్ని కంపెనీకి తన రాజీనామా అందచేసి, మేనేజి మెంటు యెంత నచ్చచెప్పినా ఆయన కంపెనీలో చేరలేదు. వెంటనే కొందరు మిత్రులతో కలసి స్వంత వ్యాపారాన్ని ప్రాశ్చాత్య దేశాలకు ఎగుమతులు దిగుమతులు ప్రారంభిం చారు. అప్పట్లో ప్రాశ్చాత్య దేశాలతో వ్యాపారాన్ని సాగించిన ప్రథమ ఆంధ్రులలో ఒకరని చెప్పాలి. నా తండ్రి తన స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించి తన ఆత్మగౌరవాన్ని పరిరక్షించుకొన్న వ్యక్తి.

నా జీవితములో బ్రిటీషు పాలకులతోనూ, కాంగ్రెసు పాలకులతోనూ, కష్టాల్లో వున్న ప్రజల తరఫున పోరాటము సాగించేటప్పుడు నన్ను అవగాహన చేసుకొని నాయెడల సానుభూతి, దయను చూపించేవారు. నా విద్యా దశలో అన్ని అవకాశాలు సౌకర్యాలు కల్పించి, ప్రజా హక్కుల రక్షణకై, సామ్యవాదానికై జైళ్ళు రహస్యం జీవితం గడిపే టప్పుడు, కష్టాలు పడేటప్పుడు నన్ను యెన్నడూ ప్రశ్నించ లేదు. నాయెడల దయ దాక్షిణ్యాం చూపేవారు. నా జీవిత పోరాటములో యిదో ప్రోత్సాహకరమయిన పునాది అని చెప్పాలి

1912_1917 ప్రపంచ చరిత్రలో మార్పులు సంభ విస్తున్న కాలమది. పెట్టుబడిదారీ విధానము సామ్రాజ్య వాదము 20 వ శతాబ్దము ప్రథమ భాగములో బాగా పరి పక్వతకు వచ్చింది. 1912 లో చైనాలో మాంఛూ రాజ్యాధి పత్యము శిథిలమైపోయి అప్పటి చైనా రిపబ్లిక్ అవతరించింది. జపాన్ 1904_1905 లో జారిస్టు రష్యాను ఓడించి ఫ్యూడలు వ్యవస్థనుండి బయటపడి పెట్టుబడిదారీ విధానమువైపు పయనమించింది. 1914 లో యూరపులో సామ్రాజ్యవాద శక్తులమధ్య మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమయి నాలుగు సంవత్సరాలు సాగింది. ఇండియావంటి దేశాలను సామ్రాజ్యవాదులు దోపిడీ చేయడం మూలంగా, యీ వలస దేశాలనూ, వాట్ల లాభాలను పంచుకోడానికి యూరపు

సామ్రాజ్యవాద శక్తులమధ్య యుద్ధపోరాటము ప్ర
1917 లో రష్యాలోని కార్మికవర్గము జార్ చ
పాలన కూలద్రోసి కార్మికుల సైనికుల ప్రాతినిధ్య స
నిర్మించింది. మానవ సాంఘిక చరిత్రలో పె
విధానానికి, సామ్రాజ్యవాదానికి రష్యాలో ?
ప్రప్రథమంగా సోషలిస్టు సమాజ నిర్మాణా
ఏర్పడింది

1917 లోనే నాకు అక్షరాభ్యాసమయింది.
భ్యాసము ఒక పండుగగానే చేసారని మా అమ్మ
ఆ స్కూలు మా యింటికి దగ్గరగానే వుంది. ప్ర
స్కూలు. మొదట్లో మా బడిపంతులు నా వే
యిసుకలో అక్షరాలు దిద్దించేవారు. పిల్లలకు
సెలవు యివ్వడానికి ప్రతిపిల్లవానివద్దనుండి ఒక
వారము తీసుకొనేవారు. దీనిని "ఆటీ డబ్బు" ఉ
ప్రతిపిల్లవానినుండి బడిపంతులుకు ఒక డబ్బు
ముట్టేది. (డబ్బు అంటే సుమారు ప్రస్తుత
1½ పైసలు) వారానికి ఒక ఆటీ "డబ్బు" ఇ
ఆ పిల్లవానికి సెలవు వుండదన్నమాట. మాస్టరు
శెలవు వుండదు.

నాకు చాల చిన్నవయస్సులో ఆకర్షించి
పుస్తకం మా తండ్రి వ్రాసిన వాణిజ్య గణితవ
బైండులో ప్రింటింగులో అచ్చయి కొన్ని వ

మా యింట్లో వుండేవి. అది యింగ్లీషు గ్రంథము. చిన్నతనములో నన్ను ఆకర్షించిన ఆటవస్తువైంది. ఏమయినా మొదట నా తండ్రి పుస్తక పరిచయం ముందుముందు పుస్తకాల యెడల ఆసక్తికి పునాది కలుగచేసిందేమో!

నేను మూడవ తరగతి చదివేటప్పటికి నాచేతిలో పడ్డ పుస్తకము భక్తవిజయము. అది భక్తుల చరిత్ర. కబీరు మొదలుకొని జయదేవునివరకు భక్తులు ఆధ్యాత్మిక చింతనలోనూ, వేదాంతములోనూ ఎలా జీవిత కృషిచేసారో వివరిస్తూంది. చిన్నతనములో నా ఆలోచనకు ఆ పుస్తకము ఉపయోగపడి వుండవచ్చును కాని తదుపరి నాకు జీవిత వాస్తవాన్ని తెలుసుకోవాలనే కుతూహలంత అపరూప కల్పితాలకు తావుయివ్వలేదు. విద్యకు సంబంధించి ఒకటి మాత్రము నాకు పూర్తిగా జ్ఞాపక మున్నది. నా తల్లి ఉదయాన్నే నాతలదువ్వి నాకుబొట్టుపెట్టి స్కూలుకు పలకా, పుస్తకాలూ యిచ్చి పంపించేది. దీని ఆధ్యాత్మిక విలువ యిప్పటికీ నా హృదయంలో నాటుకొని యిప్పుడు జీవితమే ఒక పాఠశాలగా గమనిస్తున్నాను.

---

# 2. నా చదువు - మొదటి పాఠము

నా తలిదండ్రులకు నేను ప్రథమ సంతానమగుటచే నాకు ప్రత్యేక శ్రద్ధ లభ్యమయ్యేది. నా తల్లికి నా తండ్రికి వలె చిన్నతనంలోనే తలిదండ్రులు గతించడము, ఆమెకు చిన్నవయస్సులోనే పెండ్లి కావడము, ఆమెకు మొత్తం సంతానం 12 గురు కలగడం, మా తలిదండ్రుల భారం తక్కువేమీ కాదు. ప్రతి రెండు సంవత్సరములకు నాకు ఒక తమ్ముడుకాని చెల్లికాని తోడుగా పుట్టారు. నాకు మొత్తం 7 గురు తమ్ములు 5 గురు సోదరీలు.

మాది మధ్యతరగతి కుటుంబము. మా తండ్రి ఉద్యోగం రీత్యా, వ్యాపారం రీత్యా కుటుంబ పోషణకు సంపాదనే ఆధారం. వారసత్వపు ఆస్తిపాస్తులు ఏమీ లేవు. అయితే మా తల్లికి తన తల్లియిల్లు వారసత్వంగా వచ్చింది. దానిలో ఆమె పినతల్లికి వాటా వుండగా మొదట్లో మా నాన్న వ్యాపారం నిమిత్తం ఆ యిల్లు ఆమెకు అమ్మివేసారు. తనుపరి తిరిగి ఆమె అనంతరం కొన్నారు.

మా తండ్రి సంపాదనపరుడైనా డబ్బుయెడల మక్కువ వున్న మనిషి కారు. మా తల్లి తనకు యిచ్చిన డబ్బుతో సంసారము బహు పొందికగా నిర్వహించేది.

నా బాల్యదశలో యింట్లో ఆర్థిక యిబ్బందులు లేవు. నాకు తల్లియెడల పరిచయం, తండ్రియెడల భయముండేది.

చిన్నతనములోనే నాకు తలిదండ్రులయెడల గౌరవము, భక్తి ఉండేది.

నా తల్లికి సంతానము వరుసగా కలుగడం మూలంగా పిల్లలను చూడడానికి ఆమెతల్లి మేనత్త కాంతమ్మ సహాయ పడేది. తల్లి మేనత్తను మాఅమ్మ "అత్త"అనేది, మేముకూడా "అత్త" అనేవారము. తల్లి తరువాత ఆమె నా బాల్యంలో నాకు తల్లికంటే ఎక్కువ పరిచయ ముండేది. నన్ను నా తరువాత తమ్ముణ్ని ప్రత్యేకంగా పెంచింది. నా చిన్న వయస్సులోనే ప్రపంచము మొదటి యుద్ధంలో యిరుక్కొన్న సమయంలో నాకు 4 వ సంవత్సరమున రెండు వ్రణాలు, ఒకటి మెడ వెనుకభాగాన్ని, యింకొకటి కుడికాలుమీద బయలుదేరాయి. రెండు నెలలు నేను మంచముమీంద ఉండగా మా "అత్త" నాకుఎక్కువ శుశ్రూష చేసినట్లు జ్ఞాపకము. అవి ప్రాణాపాయము కాలేదు. నా వ్రణాలు మానాయి, వాట్లమచ్చల లోతు నా శరీరంపై, మొదటి ప్రపంచ యుద్ధ కాలపు ఆనవాలుగా యిప్పటికీ వున్నాయి.

మా "అత్త" కాంతమ్మ, నాకు 10 సంవత్సరములు దాటకుండా మరణించింది. ఆమె మరణానికి చాల విచార గ్రస్తుడైనాను. నాకు మొదట తెలిసిన విచారము అదే అను కొంటాను.

నేను చేరిన మొదటి పాఠశాలపేరు కాపుపంతులు స్కూలు అనేవారము. తదుపరి మద్దాపంతులు స్కూలు.

మూడవది జగన్నాధపురంలోని పిఠాపురం రాజా మిడిలు స్కూలు. ఆ రోజుల్లో అవన్నీ ప్రైవేటు స్కూళ్ళు. ఇలా స్కూళ్ళు మారడానికి కారణము కాకినాడలోనే ఒక ప్రాంతంనుండి మరో ప్రాంతానికి నా తలిదండ్రులు మకామూ మార్చడం కారణం. చదువు విషయంలో నాకు అవాంతరా లేమీ రాలేదు.

నా బడిమాస్టర్లు నాయెడల చాల దయతో వుండే వారు. ఒక్కొక్క మాస్టరు నాకు ఒక మిఠాయి పొట్లమిచ్చి స్కూలు అయినతోడనే యింటివద్ద చేర్చేవారు. అప్పుడు నే నంత ఆకర్షణగా వున్నానేమో!

నేను మూడవ తరగతి కాకినాడ పిఠాపురం రాజా స్కూలు, జగన్నాధపురం బ్రాంచి మిడిల్ స్కూలులో 1919 లో చదువుతున్నప్పుడు మొదటి ప్రపంచ యుద్ధం సమాప్తం కావడం, నా దేశంలో రాజకీయ స్వాతంత్ర్య ఉద్యమ ఆందోళనకు కీలక కాలము. నేను మూడవ క్లాసులో ప్రవేశించడము, గాంధీజీ భారత రాజకీయ రంగంలో ప్రవే శించడమూ ఒకటే కాలము.

బ్రిటీషు పాలకులు ఒకమూల సంస్కరణాలతో వేరొక మూల రౌలట్ చట్ట నిర్బంధాలతో ప్రజలను లొంగదీయ పూనుకొన్నారు. జాతీయ కాంగ్రెసులో మితవాదులు, తీవ్ర వాదులు బయలుదేరారు. మితవాదులు బ్రిటీషు పాలకుల

సంస్కరణాలతో సంతృప్తిపడాలని, తీవ్రవాదులు వత్తిడిచేసి యింకా రాజకీయ హక్కులు పొందాలనేది వారి రాజకీయ కార్యక్రమమైంది. ప్రపంచ యుద్ధ పరిణామం కూడా భారత ప్రజానీకాన్ని చైతన్యవంతం చేసింది. సామ్రాజ్య వాదులకోట నిర్భేద్యమూ కాదనే సత్యాన్ని తెలుసుకొన్నారు.

నేను నాలుగవ తరగతి క్లాసులో వచ్చేటప్పటికి నా వయస్సు 8 సంవత్సరాలు; కాకినాడలో పిఠాపుర రాజా స్కూలులో చేరాను. గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమం బయలుదేరిన కాలం.

యుద్ధానికి పూర్వమూ గాంధీజీ దక్షిణ ఆఫ్రికాలో భారతీయ సంతతి ప్రజల హక్కుల గురించి అక్కడి ప్రభుత్వంతో జరిపిన సత్యాగ్రహ పోరాట అనుభవం తరువాత ఇండియాలో బీహారు, గుజరాత్‌లలో రైతాంగ హక్కులకై ఆందోళన కార్యక్రమం గాంధీజీకి 1919 లో భారత ప్రజలమధ్య నూతన నాయకత్వాన్ని చేకూర్చింది.

నా తండ్రితో కలసి వ్యాపారంచేసే ఆయన స్నేహితుడు శ్రీ బెల్లంకొండ సీతాపతికి నేనంటే ఆప్యాయత. పాశ్చాత్య పాలన పోవాలన్నీ, గాంధీజీ సహాయ నిరాకరణోద్యమంద్వారా దేశానికి స్వరాజ్యం వస్తుందని నాకు బోధించారు. ఈ బోధనను అప్పటి రాజకీయపాఠమూగా నా బాల్య హృదయంలో నాటుకొన్నది.

పాఠశాలల బహిష్కరణపు విద్యార్థులు ఆందోళన ప్రారంభించిన రోజులవి. నేను స్కూలుకు వెళ్ళి క్లాసులో వుండగా పిఠాపుర రాజా కాలేజీ పెద్దక్లాసుల విద్యార్థులు ఊరేగింపుగా బయలుదేరి నినాదాలు ప్రారంభించారు. నేను నా క్లాసునుండి బయటకువచ్చి విద్యార్థుల ఊరేగింపులో చేరిపోయాను. నేనుకూడా పెద్దపిల్లలతో కలసి స్వరాజ్యం కావాలని, స్కూళ్ళు, కోర్టులు, టైటిల్సు బహిష్కరించాలని నినాదాలు యిచ్చాము. పెద్దపిల్లలు చిన్నపిల్లల నందరినీ క్లాసులకు వెళ్ళకుండా అటకాయించి ఊరేగింపులో చేర్చుకొన్నారు. నా క్లాసులోని రామమోహనరావు అనే నాతోటి విద్యార్థి ఊరేగింపులో చేరడానికి నిరాకరిస్తే అతన్ని పెద్దపిల్లలు ఎత్తుకొని తీసుకొనిపోయి ఒక యిసుక గుట్టపై పారవేసారు. మేము ఉదయం క్లాసులు మానివేసి ఊరేగింపులో పాల్గొని మధ్యాహ్నం క్లాసుకు వెళ్ళగా, క్లాసుటీచరు ఉదయం క్లాసులో లేనివారు నిలబడమని అడిగారు. నేను నిలబడ్డాను, నాతో కొందరు పిల్లలు నిలబడ్డారు. మమ్మల్నను వెంటనే స్కూలునుండి బహిష్కరించామని క్లాసుమాష్టరు ఆర్డరు వేసారు, వెళ్ళిపొమ్మన్నారు. గాంధీజీ ప్రేమ ఉద్యమాన్ని ఎదుర్కొనడానికి 1920 లో ఒక్కపూట స్కూలుమానినా విద్యార్థులను స్కూలునుండి బహిష్కరించుటకు ప్రిన్సిపాలు ఆదేశాలు. అయితే రామమోహన్ మాత్రం తాను ఊరేగింపులో వెళ్ళడం యిష్టంలేదని పెద్దవిద్యార్థులు బలవంతపెట్టారని

తాను అంగీకరించకపోయినా ఎక్కువపోయారని తిరిగి క్లాసుకు వచ్చానని అప్పటికి స్కూలు మూసివేసినట్లు చెప్పుకొన్నాడు. అతన్ని మాత్రము మాస్టారు సస్పెండు చేయలేదు. నేను మారు మాట్లాడకుండా యింటికి వచ్చేసాను

నా 4 వ క్లాసు చదువుతో రాజకీయ ఆందోళన ప్రథమ పాఠము.

గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమం ఫలితంగా నేను యింగ్లీషు స్కూలు మానివేస్తే, నాతండ్రి నన్ను నిరుత్సాహ పర్చలేదు. ఆయన దేశభక్తిగల వ్యక్తి. ఇందులో బహిరంగంగా పాల్గొనడానికి ఆయనకు సంసారభారం మూలంగా అసాధ్యమయిందేమో! తన పెద్దపిల్లవాడ నను నన్ను దేశసేవకు అంకితం చేస్తానని సంతృప్తిపడ్డారేమో!

అయితే మా తండ్రి స్నేహితుడు సీతాపతి బహిరంగంగా రాజకీయాలు చర్చించేవారు. కాకినాడలో అప్పుడు ప్రముఖ న్యాయవాది శ్రీ బులుసు సాంబమూర్తి గాంధీజీ పిలుపు నందుకొని తన న్యాయవాద వృత్తికి రాజీనామా చేసి తెలుగుప్రజల మధ్య జాతీయ స్వాతంత్ర్య ఉద్యమంలో ఒక ప్రముఖుడుగా బాధ్యత వహించారు.

కాకినాడలో మా యింటికి దగ్గరగానే బంగారు శోభనాద్రి సత్రంలో ఒక జాతీయ స్కూలు నిర్వాహణ ప్రారంభించారు. దేశస్వాతంత్ర్యము ఆకాంక్షించే వ్యక్తులే ఈ స్కూలు నిర్వహణకు పూనుకొన్నారు; దేశభక్తి

ప్రభోదానికి విద్యను నేర్పడానికి పిల్లలకు ఉద్దేశింపబడింది. గాంధీజీ సూత్రాల ప్రకారం రాట్నం వడకడం, ఖద్దరు కట్టడం, తెలుగు హిందీ నేర్చుకోవడమూ మొదలగునవి కార్యక్రమాలు. ఇంగ్లీషు స్కూళ్ళు బహిష్కరించినవారికి యీ జాతీయ స్కూళ్ళు వుపయోగమయినాయి. అయితే యిందులో చిన్నక్లాసులలో వున్నవారే యెక్కువ.

ఇంగ్లీషు స్కూలు మానివేసినతోడనే 4 వ తరగతి పుస్తకాలన్నీ నేను ఒక మూల పడవేసాను. మా అమ్మకు రాజకీయాలే లేవు కాని నేనుచేసేది మంచిదే అనుకొనేది. అయితే నేను ఖద్దరు దుస్తులు ధరించాలి, కాబట్టి మా అమ్మతో చెప్పి ఖద్దరు కొనుక్కొన్నాను. ఖద్దరు ప్రోత్సాహంతోపాటు విదేశీ దుస్తులు మిల్లుబట్టల దహనం సహాయనిరాకరణ ఉద్యమ ఆందోళనలో ఒక కార్యక్రమంగా ఉండేది. మా వీధిలో యింటికి యెదురుగా ఒకరోజు మిల్లు బట్టల దహనం ప్రారంభించినప్పుడు దాంట్లో నా విదేశీ దుస్తులు పడవేసి అగ్నికి ఆహుతి చేసాను. ఆ ఉద్యమ బాల్యదశకు నా బాల్యానికి సరిపోయిందన్నమాట.

ఇక శోభనాద్రి సత్రంలో జాతీయ స్కూలులో 4 వ తరగతిలో చేరాను. అక్కడికి కావలసిన హిందీ పుస్తకాలు, తెలుగు పుస్తకాలు కొన్నాను. ఆ స్కూలులో మాకు రాట్నం వడకడం కూడా నేర్పారు. పిఠాపుర రాజా యింగ్లీషు స్కూలులోకంటే యీ స్కూలులో చురుకు

కార్యక్రమాలు నన్ను ఆకర్షించాయి. నా మనస్సులో పాత కాలపు చదువుకాక కొత్తరకపు చదువులో పడ్డట్లు దేశభక్తి సూత్రాలకు అనుగుణ్యంగా నా చిన్నవయస్సులో యీ కార్యక్రమం నాకు మంచిదైంది.

ఇంటివద్ద నూలు వడకడానికి ఒక రాట్నం మా అమ్మ చేత కొనిపించాను. నూలు వడకడానికి దూదిఏకులుకూడా కొని రాట్నంతో వడికేవాడిని. 6 నెలల్లో బాగానే నూలు వడికాను. ఆ నూలుతో బట్ట నేయించి నాకు దుస్తులు కుట్టమని మా "అత్త" తో చెప్పాను కాని ఏమి జరిగిందో జ్ఞాపకం లేదు. స్వాతంత్ర్య పోరాటంలో ఆ నూలు కట్టలు గాంధీజీ ప్రధమ ఉద్యమానికి నా కానుక అనాలి.

నేను జాతీయ స్కూలులోచేరటం, గాంధీజీ ఉద్యమ కార్యక్రమంలో పాల్గొనడం అప్పటి నా ఉడుతాభక్తిగానే అంచనా వేసుకోవాలి.

జాతీయ కాంగ్రెసు పుట్టుకకు రిటైరైన యింగ్లీషు ఉద్యోగి **A. O.** హ్యూమ్ ప్రధాన కారకులు. జపాన్ రష్యా యుద్ధం తదుపరి 1906 లో కాంగ్రెస్ మహాసభ అధ్యక్షుడుగా దాదాభాయి నౌరోజీ దేశానికి స్వరాజ్యం గమ్యస్థానమని తన అధ్యక్ష ఉపన్యాసంలో వివరించారు. 1907 లో కాంగ్రెసులో చీలికలు ఏర్పడ్డాయి. 1919 లో మితవాదులు కాంగ్రెసునుండి విడిపోయారు. 1920 లో

మహాత్మా గాంధీజీ కాంగ్రెసు సంస్థ నాయకత్వాం వహించచ డము సహాయ నిరాకరణ ఉద్యమ అంకురార్పణ జరిగింది.

నా బాల్యంలో గాంధీజీ జాతీయ ఉద్యమ ఆకర్షణ నన్ను యువక దశలో కమ్యూనిస్టు సిద్ధాంతం వైపు ఆకర్షింపబడడానికి వుపయోగపడింది.

నా బాల్యకాలంలో పరిస్థితులబట్టి మధ్యతరగతినుండే జాతీయ నాయకత్వాం బయలుదేరింది. నాకు చిన్నవయస్సులో సిద్ధాంతాల ప్రభోదం జరిగే అవకాశాలు లేవు. ఇక చూచింది, ఆకర్షించింది, మనస్సును కదిపిన పరిస్థితులు మాత్రమే వున్నాయి. నన్ను యింగ్లీషు స్కూలునుండి బహిష్కరించకపోతే జాతీయ స్కూలు అనుభవానికి అవకాశము వుండేది కాదేమో!

అది మామూలు స్కూలుకాదు, దేశభక్తులు నిర్వహిస్తున్న పాఠశాల. అది బ్రిటీషు పాలకులకు ఒక ఛాలెంజి. 1920 నుండి జాతీయవాదులపై నిర్బంధాలు ప్రారంభమయినాయి. పాలకులు తమ ఆధిపత్యానికి వ్యతిరేకమయిన ఉద్యమాన్ని అణగద్రొక్కడం వాళ్ళకు సహజం. గాంధీజీ నాయకత్వంక్రిందఅహింసాపూరితమయిన సహాయనిరాకరణోద్యమం ఒక నిరసన ఉద్యమంగాను, బ్రిటీషు పాలక విధానానికి వ్యతిరేక ఉద్యమంగాను ప్రజానీకాన్ని తర్ఫీదు చేయుటకు వినియోగించబడిన ఉద్యమమయినప్పటికి, సాంఘిక

రాజకీయ శక్తుల సంఘర్షణ ఒక గిరిలో వుండదు, బ్రిటీషు సామ్రాజ్యవాదము, కాంగ్రెసు జాతీయవాదం మధ్య సంఘర్షణ ప్రారంభ దశ.

ప్రభుత్వం దేశమంతటా జాతీయవాదులను జైళ్ళలో బంధించడము మొదలుపెట్టింది. బొంబాయి. మద్రాసు లలో అల్లకల్లోలాలు బయలుదేరాయి. ఉత్తర భారత దేశంలో చౌరీచౌరాలో ప్రజలు పోలీసులపై తిరుగుబాటు చేసి ఆ సంఘర్షణలో పోలీసులు హత్య చేయబడ్డారు.

గాంధీజీ అహింసా ఉద్యమము పాలకులకు గిట్టని వెల్లువ, ప్రజలలో సామ్రాజ్యవాదంపై తిరుగుబాటు బయలు దేరడం పాలకుల ప్రతీకార చర్యలు చెప్పనక్కర్లేదు.

అయితే గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమం యీ పంథాలో వస్తుందని అనుకోలేదు. ఈ పంథా హింసా పూరితమయిన పంథా తన సిద్ధాంతానికి వ్యతిరేకమని, సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ఆయన ఆపివేసారు. జాతీయ నాయకులందరికీ ఉద్యమాన్ని ఆపివేయడం యిష్టమున్నా లేకపోయినా అప్పటికే గాంధీజీ పలుకుబడి ముందు తమ పలుకుబడి తక్కువ.

నిర్బంధం మూలంగా నేను చేరిన జాతీయ స్కూలు మూసివేయబడింది. నాకు ఒక సంవత్సరం చదువు ఆగి పోయింది. నాకు ప్రైవేటు మాష్టరును నియమించి నేను

ఖాళీగా తిరగకుండ మా తండ్రి చదువు పురమాయించారు
ఆ మాస్టరు చొక్కా తొడుక్కొనేవారుకారు. పంచె
కట్టుకొని పైన కండువా వేసుకొని మా యింటికివచ్చి నాక
నా తరువాత తమ్ముడు సూర్యనారాయణమూర్తికి పాఠాల
నేర్పేవారు. ఆయనే నాకు మొదటి ప్రైవేటు మాస్టరు
ప్రతి పాఠము క్షుణ్ణంగా నేర్పేవారు. అర్థం చేసుకొనేవరక
విడిచిపెట్టేవారుకారు.

---

# 3. హైస్కూలు చదువు కాలము

నాకు 10 వ సంవత్సరం వచ్చేటప్పటికి నాతలిదండ్రులకు ఆరుగురు పిల్లలు పుట్టాము. ఆస్తిపాస్తులు లేకపోయినా సంతతికి లోటులేదు. అప్పటి కాలములో మధ్యతరగతి సంసారాలు అటువంటివి.

మాతండ్రి వ్యాపారములో సరుకుల ఎగుమతి దిగుమతిలో లాభాలు వున్నా ఆయన పెట్టుబడిదారులు మాత్రము లాభాలలో ఎక్కువ భాగము కాచేసేవారు అయితే మా తండ్రి వ్యాపార విధాన నిర్వహణలో నేర్పరి కాని ధనాన్ని ప్రోగుచేసుకోవడంలో నేర్పరి కాలేదు. ఇక మొదటి యుద్ధం సమాప్తమయిన కాలానికి ప్రపంచ ఆర్థికమాంద్యము మూలంగా ఎగుమతి దిగుమతుల వ్యాపారం సహజంగా దెబ్బతిన్నది. ఆ దశలో మా తండ్రి వ్యాపారం మందగించింది.

కాకినాడకు 16 కిలోమీటర్ల దూరంలో సామర్లకోట గ్రామంలో బ్రిటీషువాళ్ళ ప్యారీ కంపెనీ నిర్వహిస్తున్న పంచదార ఫ్యాక్టర్సీ, డెక్కన్ షుగర్ ఆబ్కారీ కంపెనీ వుంది. దానిలో ఆఫీసు మేనేజరు పని ఖాళీ ఏర్పడింది. దానికి జీతం బాగుంటుందని సమర్థుడగు ఉద్యోగి వాళ్ళకు కావాలని మా తండ్రికి తెలుసున్న కాకినాడలో యింగ్లీషు వ్యాపార ఉద్యోగి యీయనను ఆ ఉద్యోగానికి ప్రోత్సహించారు. 1922 లో ఆ ఉద్యోగంలో మాతండ్రి చేరారు.

నా చదువు రాజకీయ ఒడుదుడుకులలో ఒక సంవత్స రము పోయినా, వేసవి స్కూలులో 5 వ తరగతిలో చేరి, కొద్ది నెలలలో పరీక్షకు కూర్చొని ఫస్టు ఫారమూ (6 వ తరగతి) లోకి స్కూళ్ళు తెరిచే కాలానికి పాసై చేరాను.

నేను ఫస్టు ఫారములో చేరిన 6 నెలలకు 1923 లో కాకినాడలో జాతీయ కాంగ్రెసు మహాసభ జరిగింది. మహమ్మదాలీ ఆ మహాసభకు అధ్యక్షులు, గాంధీజీ నిర్బంధ ములో వున్నారు. తెలుగు దేశంలో అప్పటి సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ కాంగ్రెసు మహాసభ జరగడం కాకినాడదే ప్రత్యేకత. దేశభక్తుడు బులుసు సాంబమూర్తి ఆహ్వాన సంఘ కార్యదర్శి. ఆ జాతీయ మహాసభ నన్ను ఆకర్షించింది. జాతీయ నాయకులను చూచాను, ఉపన్యాసాలు విన్నాను. ఆ నా వయస్సుకు సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమ నాయకులను చూడడం ప్రథమం. అప్పటి నా చదువును యీ అనుభవం తోడైంది అనుకోవాలి.

1922_24 సంవత్సరములలో నేను కాకినాడ పి. ఆర్. హైస్కూలులో చదివాను. సెకండు ఫారమునకు కాకి నాడలో చదివి, మూడవ ఫారమునకు సామర్లకోట బోర్డు హైస్కూలుకు వెళ్ళాను. మా తలిదండ్రులు సామర్లకోటలో వుండుటచే నన్ను నా తమ్ముడు సూర్యనారాయణమూర్తిని కాకినాడనుంచి సామర్లకోట తీసుకువెళ్ళారు. ఆ రెండు సంవత్స రాలు కాకినాడలో చదువు కొనసాగించడమూ ఒక అనుభవం.

కాకినాడ ఒక పట్టణం, సామర్లకోట ఒక పల్లెటూరు. తూర్పు గోదావరి జిల్లాకు కాకినాడ ప్రధాన పట్టణము, పిఠాపుర రాజా కాలేజీ బ్రహ్మసమాజ సంస్కరణ కల పట్టణం. ప్రముఖ సంస్కర్త, విద్యావేత్త రఘుపతి వెంకటరత్నము కాలేజీకి ప్రథమ ప్రిన్సిపాలు. తదుపరి నేను చేరిన బోర్డు హైస్కూలు వున్న సామర్లకోట రైతాంగముతోను, వ్యవసాయ కూలీలు, ఫ్యాక్టరీ కార్మికులతో వున్న పల్లెటూరు. అప్పట్లో పట్టణ జీవన, పల్లెటూరి జీవన వ్యత్యాసాలు నాకు గోచరించాయి.

ఇంకో విధంగా సామర్లకోటలో యింగ్లీషువాళ్ళ ఆధీనంలోవున్న డెక్కన్ షుగర్ అండ్ అబ్కారీ కంపెనీ పంచదార ఫ్యాక్టరీ వుండడము, దానిలో సామర్లకోట కార్మికులు పనిచేయడంవల్ల అనేక ప్రత్యేక పారిశ్రామిక పల్లెటూరు. మాతండ్రి ఆ ఫ్యాక్టరీలో ఆఫీసు మేనేజరుగా పనిచేయడం, గ్రామీణ రైతులు, ఫ్యాక్టరీ కూలీలతో నా 13 వ ఏట సామర్లకోట చదువుతో పరిచయం ఏర్పడింది.

నేను కాకినాడ స్కూల్స్‌లో చదువుతున్న కాలములో (1919_1923) లలో మొదటి ప్రపంచ యుద్ధం మూలంగా సంభవించిన పరిణామాలు యూరప్, అమెరికా, ఆసియా, ఆఫ్రికా దేశాల్లో తీవ్ర సంచలనాన్ని కలుగచేసాయి. యుద్ధంనుండి విప్లవాలు, జాతీయ విముక్తి పోరాటాలు, వర్గ పోరాటాలు సాగుతున్న కాలము.

మొదటి ప్రపంచ యుద్ధంతోనే సామ్రాజ్యవాద శక్తులకు విజయ ఫలితాలేమీ కలుగలేదు. జార్ చక్రవర్తి రష్యాను సామ్రాజ్యాధిపత్రం శిథిలమయి కార్మికవర్గ విప్లవం విజయవంతమయి జర్మన్ సామ్రాజ్యమూ, ఆస్ట్రో హాంగేరియన్ సామ్రాజ్యములు చితికిపోయాయి. జర్మనీలో ఆస్ట్రియాలో, బుడాపెస్టులో విప్లవాలు విజయవంతమయి అక్కడ సోషలిస్టు విప్లవంద్వారా నూతన జీవితం ప్రజలకు అందుబాటు అవుతుందనే ఆశలు బయలుదేరాయి.

కాని ఒక్క రష్యాలో మాత్రమే విప్లవం పూర్తిగా విజయవంతమయింది. శ్రామికుల, సైనికుల ఐక్యతతో లెనిన్ మహత్తర నాయకత్వం క్రింద బోల్షివిక్కులు విప్లవ పరిపాలన పూనుకొన్నారు.

యూరపులోని సామ్రాజ్యవాదశక్తులు పూర్వపు ఆధిపత్యాన్ని కొనసాగించడానికి శక్తిహీనులై పోయారు ఇక బ్రిటనులో యుద్ధం సమాప్తమయిన నాలుగు సంవత్సరాల్లో ఆర్థికమాంద్యము బయలుదేరింది. జపాను పోటీ ఎక్కువైంది. తూర్పుదేశాల్లోనూ, దూర ప్రాచ్యంలోనూ బ్రిటనుకు సరకులు ఎగుమతులలో పోటీ తీవ్రమయింది. వెనుకబడిన దేశాలలో తీవ్రఆందోళన జాతీయతా విజృంభన బయలుదేరాయి. అరేబియానుండి ఇండియాకు, ఈస్టు యిండీస్‌నుండి ఆఫ్రికాకు తిరుగుబాటు ఎక్కువయింది.

పాత సామ్రాజ్యవాద దేశాలకు చిక్కులు సంభవించడముతో అమెరికా కాపిటలిజాన్ని బలపర్చుకోడం యుద్ధం మూలంగా తక్కువ నష్టాన్ని పొందనందున ప్రపంచములో తన ఆధిపత్యాన్ని పెంచుకోడానికి అవకాశాలు పొంద సాగింది.

యుద్ధం తదుపరి ఇటలీలో ముసోలినీ ఫాసిజం తల ఎత్తింది. యుద్ధంలో ఇటలీ ఓటమితో, కమ్యూనిస్టులు, సోషలిస్టులు చీలికలతో ఫాసిస్టు ముసోలినీ అధికారాన్ని బలవంతంగా స్వాధీనం జేసుకొన్నాడు.

నేను హైస్కూలులో చరిత్ర, జాగ్రఫీ, ఫస్టు, సెకండు ఫారములలో (6, 7 వ తరగతులు) చదువుతున్న కాలమది తదుపరి నేను III వ ఫారము (8 వ తరగతి) లోకి వచ్చేటప్పటికి సైన్సు సబ్జక్టులగు ఫిజిక్సు కెమిస్ట్రీలు తీసుకొన్నాను.

చరిత్ర జాగ్రఫీలు ఎప్పుడైనా నేర్చుకోవచ్చుననే ధోరణితో, సైన్సుకు ప్రత్యేకంగా క్లాసులో పాఠాలద్వారా నేర్చుకోవడమే మార్గమని నా కప్పుడు తోచింది.

అయితే నాకు ముందు ముందు చారిత్రక పరిజ్ఞానము నా ప్రజాకార్యక్రమాలలో అత్యావశ్యకమయిన వస్తువైంది.

1923_1928 లలో సామర్లకోట హైస్కూలులో మూడవ ఫారమునుండి ఆరవ ఫారమువరకు నా విద్యా కృషి ఫలప్రదంగానే సాగిందనాలి. ఇప్పటి కాలంతో పోలిస్తే అప్పుడు తక్కువమంది విద్యార్థులు, విద్యార్థులకు భయభక్తు

ఎక్కువ. ఉపాధ్యాయుల ప్రత్యేక శ్రద్ధ, ఉపాధ్యాయుల కొక హోదా, చదువుకు ఒక గొప్ప వున్న రోజులు. మన సమాజం ఫ్యూడలు వ్యవస్థనుండి, రాచరికాలనుండి, ఇంగ్లీషు వ్యాపార కంపెనీ పాలననుండి, బ్రిటీషు ప్రభువుల పాలనలో పడి సాంఘిక, ఆర్థిక, రాజకీయ దాస్యంనుండి బయటపడే ప్రసవ వేదనకాలము.

## బుద్ధుని పాఠము

నా స్కూలులోని పాఠాలలో బుద్ధుని జీవితము ఆయన ప్రబోధము నన్ను ఉత్తేజపరచిన మహాత్ముల చరిత్రలలో ప్రధానమయినది. కాకినాడలోని స్కూలు ప్రవేశములో మహాత్మా గాంధీ ఉద్యమం ఎలా ఆకర్షించిందో, సామర్లకోట హైస్కూలు ప్రవేశంలో బుద్ధుని జీవితము ఉపదేశాలు నన్ను ప్రభావితుని చేసాయి.

నా ఉపాధ్యాయులు సత్యనారాయణమూర్తి బుద్ధుని, పాఠాన్ని బహుచక్కగా బోధించారు. బుద్ధుడు అప్పటి కాలపు రాచరికంలో పుట్టాడు. ఆయన క్రీస్తుపూర్వము 6 వ శతాబ్దము (2500 సంవత్సరాల క్రితము) జన్మించాడన్నమాట. ఆ రోజులలో ఈ దేశ సాంఘిక వ్యవస్థ ఆదిమ కమ్యూనలు సమిష్టి వ్యవస్థ శిథిల దశలో పడింది. వర్గాధిపత్యంతో కూడిన ప్రాథమిక రాజ్యాలు బయలుదేరు తున్న కాలము. వేదాల నాగరికత బ్రాహ్మణిజం, కులాలు దేవుళ్లు, బలిదేవతలు బయలుదేరుతున్న కాలము.

బుద్ధుడు (సిద్ధార్థుడు) రాజరిక ఆధిపత్యములో సుఖాలు, ఐశ్వర్యము అనుభవిస్తున్నప్పటికీ, పదునైన ఆలోచన కలవాడగుటచే, కొందరు మానవులు సుఖాలలో ఎందుకు తులతూగుతున్నారు ? కొందరు ఎందుకు కష్టాలలో అనగారుతున్నారు ? అనే ప్రశ్నలు వేసుకోవడం, అప్పటి వేదాంత నాగరికత తన రాచరిక సమాజము సమాధానము చెప్పే దశలో లేవు. ఈ విషయమయి సత్యాన్వేషనకై తాను సుఖాలు త్యజించి, గురువులను ఆశ్రయించి కాని, తపస్సు ఉపవాసాలు చేసి కాని, తాను సమాధాన్ని వెతక డానికి ప్రూనుకొన్నాడు; ఫలితం దొరకలేదు. తన శిష్యు లతో చర్చలు సాగించాడు, ఫలితం దొరకలేదు. ఒంటరి మనిషి అయిపోయి ఆలోచనలు సాగించాడు, ఫలితం దొరకలేదు, కాని బుద్ధుడు తన కృషి మానలేదు. మాన వునికి విజ్ఞానం మానవులనుండే ఉద్భవించాలి, దేవతలనుండి ఉద్భవించదు అనే సూత్రాన్ని గ్రహించాడు. మనిషి తన మోక్షం సాధించాలంటే తన నైతికవిలువ కృషిలోనే వుంటుందనే సూత్రాన్ని నిర్ధారణ చేసుకొన్నాడు.

బుద్ధుడు మానవ ధర్మాలను నిర్వచించడములో నిర్మల మగు ఆలోచన, నిర్మలమగు కార్యాచరణకు ప్రాముఖ్యత నిచ్చి తద్వారా మనిషి నిర్వాణాన్ని, మోక్షాన్ని సాధించా లని ప్రబోధించాడు. బుద్ధుని ప్రబోధములో మనిషికి నైతిక ప్రమాణాల ఆవశ్యకత నన్ను బాగా ఆకర్షించింది.

జీవహింసను బుద్ధుడు నిరసించాడని నా ఉపాధ్యాయుడు ప్రత్యేకంగా నాకు బోధించారు. అహింసా వ్రతాన్ని అవలంభించాలని అందుకై మాంసాహారము విసర్జించి, శాఖాహారము తీసుకోవాలని నా ఉపాధ్యాయుని బోధనపై బుద్ధమహనీయునియెడల భక్తిని ప్రదర్శించడానికి నేను నా 13 వ ఏటనుండి శాఖాహారిగా మారాను.

చాల పట్టుదలతో శాఖాహార వ్రతాన్ని అవలంభించడముతో యింటిలో మాంసాహారం తీసుకొనేవారు, నాతో కలసి పంక్తిలో భోజనం చేయడాన్ని వ్యతిరేకించేవాడను. బుద్ధుని నైతిక ప్రమాణాల ప్రబోధాన్ని పవిత్రమయిన ధర్మంగా అనుసరించేవాడిని, అయితే శాఖాహారమునకు కట్టుబడి వుండడములో అర్థంలేని మొండిపట్టుదలతో వుండే వాడిని. నేను జీవశాస్త్రాన్ని అభ్యసించడములో జీవమనేది చెట్లకు కూడా వున్నది కనుక శాఖాహారము కూడా జీవహింసను చేయడమే అని నా పెద్దవాళ్ళు నన్ను నిలదీసినప్పుడు నిజానికి ఆ దశలో హేతుదృక్పదం, శాస్త్రీయ దృక్పదంతో సమాధానం యివ్వలేకపోయినా, నా శాఖాహార వ్రతము మాత్రం విడనాడతలచలేదు. బుద్ధుని జీవిత ప్రబోధము నేను శాఖాహారము అలవాట్లు చేసుకోడానికి మాత్రమే ఆ దశలో ప్రయోగమయింది. ముందుముందు నాకు శాస్త్రీయ పరిజ్ఞానము అభివృద్ధికావడంతో, మార్క్సిస్టు శాస్త్రాన్ని అధ్యయనం చేయడంతో, ఇంగ్లాండులో వుండగా

నా 22 వ ఏట శాఖాహారముయెడల నాగురి పోయింది. భారత దేశంలో పుట్టి క్రీస్తుపూర్వము 6 వ శతాబ్దం ఆ కాలానికే బుద్ధుని మహోపదేశాల బుద్ధిజాన్ని యీ దేశంనుండి తరిమివేసి, బుద్ధున్ని మాత్రం ఒక దేవున్నిచేసి చాందస్త కులవర్గాధిపతులు బుద్ధిజంపైన ఆధిపత్యం నిలబెట్టుకొన్నారు. బుద్ధిజం ఆసియా ఖండంలో యితరచోట్ల వ్యాప్తి చెందింది.

## పుస్తక పరిచయం

విజ్ఞానముయెడల ఆసక్తికల మనిషికి పుస్తకాలతో స్నేహము అత్యవసరము. చిన్నతనములోనే నాకు యీ స్నేహం అలవడింది. నా జీవిత వ్యాపకానికి ముందు ముందు యీ అలవాటు సహాయపడిందనే చెప్పాలి

నా స్కూలుకు సంబంధించిన పుస్తకాలు నేను నిర్లక్ష్యం చేయలేదు. ఒక క్లాసునుండి మరో పైక్లాసుకు వెళ్ళినా, పాత పుస్తకాలన్నీ జాగ్రత్తగా వుంచేవాడిని. వాట్లను ముందు ముందు పరిశీలించడములో పాతకాలపు రోజులు జ్ఞాపకం తెచ్చుకొనేవాడిని కాని రానురాను ఆ పుస్తకాలన్నీ పోయాయి.

ఒక క్లాసు పుస్తకాలే కాకుండా చిన్నవయస్సులో తెలుగు నవలలు, జీవిత చరిత్రలు కూడా చదివేవాడిని. నేను హైస్కూలులో చదివేటప్పుడు తిరుపతి వెంకటేశ్వర కవుల

గ్రంథమండలినుండి ప్రతి రెండు నెలలకు ఒక తెలుగు నవలకు చందాకట్టి పోస్టులో రప్పించుకొనేవాడిని. ఆ నవలలు బెంగాలీ నవల తర్జుమాలని జ్ఞాపకం. రానురాను నవలల యెడల, కల్పిత గాథలయెడల నాకు మోజుపోయింది కాని ఉన్నతభావాలు గల సాహిత్య ఆకర్షణ మెండుగానే వుంది.

రామాయణం, భారతం, భాగవత పుస్తకాలు చదివాను కాని వాట్లను సంక్షిప్త రూపంలోనే చదివాను. రాముని కథ సంబంధించినంతవరకు అతనికి తలిదండ్రుల యెడల భక్తి నన్ను ఆకర్షించింది.

ఇక భారతంలో ధర్మరాజు నన్ను ఆకర్షించాడు, కృష్ణుడు, దుర్యోధనాదులు నన్ను ఆకర్షించలేదు. భగవద్గీతను నేను చిన్నతనంలో పఠనం చేసాను.

ఇక భాగవతంలో నాకు కంఠస్తమయిన పద్యాలు ముఖ్యంగా రెండు. ఒకటి "ఇమ్మను జేశ్వరాధముల కిచ్చి సొమ్ములు కొన్ని పుచ్చుకొని" రెండవ పద్యము "బాలరసాల సాల నవపల్లవ కోమలకావ్య కన్యకన్ కూళలకిచ్చి", ఈ పద్యాల లోతైన తాత్పర్యము, అభ్యుదయకర దృక్పథం నుండి యీ కాలానికి అనుగుణ్యంగా ఇలా వివరిస్తున్నాను. "నీ ఉన్నత శ్రమశక్తిని దోపిడీదార్ల చేతుల్లో పెట్టి బానిస కావద్దు. ఎన్ని కష్టాలువచ్చినా మానవుని ఉత్తమ జీవితానికై కృషి సాగించు."

ఇక భర్తృహరి సుభాషితాలు కూడా నాకు ప్రీతి. అంతేకాక నీతిపద్యాలు కూడా నాకు కంఠస్థమయినాయి. "నీతిప్రాఘ విహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ" అనే పద్యం నాకు కంఠస్థం. భర్తృహరి సుభాషితాల్లో విద్యకు సంబంధించిన పద్యాలు కూడా నేను కంఠస్థం చేసుకొన్నాను.

హైస్కూలులో (1923_28) చదివేటప్పుడు ఒక చిన్న గ్రంథాలయాన్ని నా మిత్రులతో కలసి స్థాపించాను. అప్పుడు సామర్లకోటలో రైలుస్టేషనుకు దగ్గరగా మా యిల్లు వుండేది. మా యింటికి సమీపంలో ఒక చిన్న గ్రంథాలయాన్ని ఒక గది అద్దెకు తీసుకొని ఆనాడు ఏర్పాటు చేసాను.

1925 సంవత్సరములో నాకు శరీర వ్యాయామము గురించి ఆసక్తి బయలుదేరింది. అప్పటి పత్రికల్లో వ్యాయామము గురించి ప్రకటనలు చూచాను. జెంగులూరులో వ్యాయామ అధ్యాపకుడు తనకు డబ్బు పంపితే, వ్యాయామానికి సంబంధించిన పాఠాలు పంపుతానని తద్వారా శరీర బలాన్ని పెంపొందించుకోవచ్చునని చేసిన ప్రకటనలయడల నాకు ఆసక్తికలిగి ఆ పాఠాలు సంపాదించ డానికి మా తండ్రికి చెప్పాను. దానికంటే మంచిది జె. పి. ముల్లరు యింగ్లీషు వ్యాయామ పుస్తకం, పురుషు లకు నా పద్ధతి (**My System for men**) ను, తారాపోరవాలా అండ్ సన్స్ బొంబాయినుండి, తెప్పించారు. ఆ పుస్తకం

చదివి దానిప్రకారం వ్యాయామ కోర్సును నేర్చుకోమని మా తండ్రి సలహా యిచ్చారు. రోజుకు 15 నిమిషాలు మాత్రమే ఆ వ్యాయామ కార్యక్రమము, అప్పటినుండి యిప్పటివరకు ఆ వ్యాయామాన్ని ప్రతిరోజు ఉదయాన్ని కొనసాగిస్తున్నాను. దానివలన నా శారీరక ఆరోగ్యానికి కొంత వుపయోగ మున్నదనే నా అనుభవము.

1926 లో మా తండ్రి పుస్తకాలనుంచి పెస్మనిజము అనే పుస్తకాన్ని చదివాను. దాని పాఠాలు 12. మానసిక తర్ఫీదుకు మంచి సలహాలను యిచ్చే పుస్తకంగానే నాకు తోచింది. దానిని పూర్తిగా చదివాను. దానిలోని ప్రత్యేకంగా ఆసక్తిదాయకమయిన సూచనలు కాలాన్ని వినియోగించడానికి ఒక క్రమాన్ని యిప్పటికి అవలంబిస్తాను. ముందు ముందు మానసిక శాస్త్రం గురించి, శారీరక శాస్త్రం గురించి పుస్తకాలు నాకు లభ్యమయ్యాయి.

ఏ అలవాటులలోనూ, పద్ధతిలోనూ నేను పరిపక్వత పొందానని చెప్పడానికి వీలులేదు, మంచి అలవాటులు జీవితంలో భాగం చేసుకోవాలనే కుతూహలం మాత్రం నాకు ఎక్కువ. కుతూహలానికి అనుగుణ్యంగా ఆచరణలో శ్రమ పడ్డానని చెప్పడానికి సాహసించను, మంచి పని అనుకొన్నదానిని జీవితంలో మరచిపోకుండా కొనసాగిస్తున్నాను. నిరుపయోగమయినది, అర్ధరహితమయినది

విడిచిపెట్టడంలో నాకు సంకోచము లేదు. నాకు పట్టుదల లున్నాయికాని, మూఢనమ్మకాలు లేవు.

1928 లో నేను హైస్కూలులో 6 వ ఫారములోకి వచ్చాను. 6 వ ఫారము స్కూలు ఫైనలు (School Final సామర్లకోటలో మా మకాం మూడవ యింట్లోకి మారాము. అది ఊరుకు చివర భాగము (పెన్సను లైను( మా స్కూలుకు దగ్గరగా నే ఆ యిల్లు వున్నది.

మా తండ్రి ఆఫీసు మేనేజరుగా పనిచేసే డెక్కన్ షుగర్ అబ్కారీ కంపెనీలో ఆయనపైన ఉద్యోగి జనరలు మేనేజరు బ్రిటీషు వ్యక్తి, పేరు మెకాస్లిన్. మెకాస్లిన్‌కు బ్రిటఃనుండి ఐరిస్ స్వీప్‌స్టేకు (St. లీజర్సు లాటరీ) టిక్కెట్లు వస్తే ఒకటి మా తండ్రికి యిచ్చాడు. అది గుర్రపు పందెపు లాటరీ. మాతండ్రి యీలాటరీయెడల ఆసక్తి వున్నవారుకాదు తనపై యజమాని యిచ్చినమీదట కాదనలేక తీసుకొన్నారట. అంతకు ముందెన్నడూ మా తండ్రి లాటరీ టిక్కెట్లు కొనలేదు, ఆ జనరలు మేనేజరు కూడా అంతకుముందు మా తండ్రికి లాటరీ టిక్కెట్లు అమ్మలేదు.

1928 లో మా తండ్రికొన్న ఐరిష్ దేశపు లాటరీ టిక్కెట్టుకు "అవకాశము" (Chance) అనే నామకరణం దానిమీద రాసారట. ఆ రోజుల్లో లాటరీ టిక్కెట్టుకు ప్రతి కొనుగోలు వ్యక్తి ఒక పేరు పెట్టాలి. ఆ పేరుకు అను

గుణ్యాంగా మా తండ్రికి మంచి అవకాశమే కలిగింది అనాలి, ఆ టిక్కెట్టు కొన్న కొద్దిరోజులకే మా తండ్రి పనిచేసే ఫ్యాక్టరీ జనరలు మేనేజరు మెకాస్లిన్ మా యింటికి రాత్రి వచ్చి, టిక్కెట్టుకు చెందిన "బుక్ లా" (Book - law) అనే గుర్రము పందెములో మొదటిగా వచ్చే అవకాశమున్నదని లేకపోయినా ఆ టిక్కెట్టు అమ్మివేస్తే మా తండ్రికి ఒకలక్ష రూపాయలు యివ్వబడుతుందని తన నిర్ణయాన్ని తెలియ చేయుమని కోరాడు. ఐర్లండులో డబ్లిన్ ముఖ్యపట్టణం నుండి మెకాస్లిన్ దొరకు కేబిలు (పాశ్చాత్య టెలిగ్రాం) వచ్చినమీదట యీ సంతోషవార్త సరాసరి మా తండ్రికి తెలుపడానికి సామర్లకోటలో తన బంగ్లానుండి మా యింటికి వచ్చి చెప్పడం జరిగింది.

ఎటువంటి జాగు చేయకుండా మా తండ్రి తన నిర్ణయాన్ని మెకాస్లిన్‌కు తెలియచేసారు. మా తండ్రి టిక్కెట్టు గుర్రం బుక్‌లా పైన చాలమంది పైపందాలు వేసుకొంటున్నారన్నమాట.

అది పందెములో ఆరితేరిన గుర్రమన్నమాట. ఏమయినా మా తండ్రి టిక్కెట్టు ఆ గుర్రముమీద లక్ష ముప్పైవేల రూపాయలు వచ్చాయి. మధ్యను కొన్నవానికి 30 వేలు లాభం పొందారు. అది మొదటి స్థానంలో గెలిచింది. ఆ రోజుల్లో యిన్ని పత్రికల లాటరీ ప్రచారాలు

లేవు కాని మా తండ్రికి లక్ష రూపాయలు లాటరీ ద్వారా కలగడంతో ఆయన డెక్కన్ షుగర్ అబ్కారీ కంపెనీ ఆఫీసు మేనేజరు పనికి రాజీనామా చేసారు. ధనం సంప్రాప్తించిన మీదట ఆయన ఒకరిక్రింద తన శ్రమను వెచ్చించి పనిచేసే స్థితినుండి విముక్తి పొంది, తన స్వంత వ్యాపారం ప్రారంభించారు. మా తండ్రి తన ఉద్యోగం విడవద్దని, మొకాస్లిన్ కోరినా అంగీకరించక తాను స్వేచ్ఛగా వ్యాపారంపెట్టి తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకొంటానని చెప్పారు.

సామర్లకోటలో ఒక రైసుమిల్లు, గానుమిల్లు స్థాపించి, ఎగుమతి వ్యాపారం పూనుకొన్నారు. బాగా స్టాఫ్నుకూడా నియమించి తన ఆఫీసు విస్తారంగా ప్రారంభించారు.

తనకు వచ్చిన డబ్బునుండి సుమారు 10 వేలు తన బంధువులకు, స్నేహితులకు మా తండ్రి పంచివేసి మిగతా డబ్బు వ్యాపారం నిమిత్తం నిర్ణయించుకొన్నారు.

1928 నాటికి మా తలిదండ్రులకు మేము 10 మంది పిల్లలము. ఇంకో నాలుగు సంవత్సరములకు మా సంఖ్య 12 మందితో పూర్తయింది! మా తండ్రికి ఫ్యాక్టరీ మేనేజరుగా జీతంతో అధికంగా యిబ్బందులు లేవు, కాని లాటరీ ధనంతో మా పరిస్థితి బాగుపడిందని చెప్పలేను కాని నాకు మానసికంగా వైరాగ్యధోరణి ఆ కాలంలో బయలు దేరింది!

ఇదొక మానసిక సంఘర్షణకు కాలము, విద్య, విజ్ఞానము యెడల నాకు విరక్తి లేదు కాని ఐశ్వర్యము యెడల విరక్తి కలిగింది.

ఇక ఒకమాటలో చెప్పాలంటే, లాటరీ మూలంగా మా తండ్రికి స్వేచ్ఛ, నాకు విదేశాలయాత్ర కమ్యూనిస్టు సిద్ధాంత పరిశోధనకు వుపయుక్తమయింది.

నా 16 వ ఏట హైస్కూలు దశ పూర్తయింది. ఇక కాలేజీ చదువు ప్రారంభం కావాలి. హైస్కూలు దశ పూర్తయ్యేలోగా లక్ష రూపాయలు లాటరీ మా తండ్రికి రావడం జీవితం అనుభవంలో నాకు పాఠాలు నేర్చుకోడానికి ఒక సంఘటనగా జరిగిందని చెప్పాలి కాని, నాకుమాత్రం ఐశ్వర్యంతో సౌఖ్యం తాపత్ర్యం కాలేదనాలి. నాకు జీవితంయొక్క కాఠిన్యం తప్పి వుండవచ్చు కాని మానసికమయిన చైతన్యానికి లోపం రాలేదంటాను. జీవితంయొక్క కాఠిన్యం మనిషి అనుభవించాలి. అది లోపిస్తే జీవితం సౌమ్యమయినదిగాను, వ్యత్యాసాలు దోపిడీతో కూడిన సాంఘిక వ్యవస్థను మెత్తమెత్తగా అవగాహన చేసుకోవడమవుతూంది.

అయితే ప్రజారంగంలో పాల్గొనేముందు నా తండ్రికి కలిసిన సంపదమూలంగా నేను ప్రాశ్చాత్య దేశాలకు ఇంగ్లాండు వెళ్ళినప్పుడు, మార్క్స్, ఎంగెల్సు, లెనిన్ మహాపురుషుల జీవిత కాలము, చరిత్రను, సోషలిస్టు సిద్ధాంత పరిశోధన, ప్రబోధానికి అవకాశము లభించి, నా ధ్యేయానికి పునాదులు దొరికాయి.

నేను పుట్టకముందే మార్క్స్, ఎంగిల్సు గతించారు. నేను హైస్కూలులో చేరినప్పుడు లెనిన్ గతించారు. ఆయన రష్యాలో విప్లవానికి మూలపురుషు డయ్యాడు. నా హైస్కూలు చదువులో కాని బయట లభ్యమయ్యే పుస్త కాల్లో కాని నా 16 వ ఏటవరకు మార్క్స్, ఎంగిల్సు, లెనిన్‌ల గురించి వ్రాత లేమీ అందుబాటుకా లేదు.

మధ్య తరగతులను, వాళ్ళ పిల్లలను బ్రిటీషు పాలక ప్రభువులు వాళ్ళ కుపయోగమయ్యేవరకుగాను పెట్టుబడిదారీ వర్గాలకు సేవచేసే పనిముట్లుగాను తర్ఫీదు చేసుకోవా లనుకొన్న కాలము. అందులో చిక్కుకోకుండా వుండడానికి మా తండ్రి లాటరీ నాకు ఉపయోగపడిందనాలి.

ఆ లాటరీ రాకపోతే నా తండ్రికి స్వేచ్ఛ, నాకు ప్రాశ్చదేశ ప్రయాణం, కమ్యూనిస్టు సిద్ధాంత పరిశోధన లభ్యమయ్యేది కాదు. నా జీవితయాత్ర కొంత తాపీగా సాగిందేమో! మంచిదో చెడ్డదో యిప్పుడు చెప్పను. జరిగిన సంఘటనలను పోకళ్ళను వ్యాఖ్యానించవచ్చు కాని, అవి లేవన్నట్లు త్రోసివేయడానికి వీలులేదు.

## నా జాతకం

నేను హైస్కూలు ముందు తరగతులలో వుండగానే మా తండ్రివద్దకు ఒక ఓఢ్ర సిద్ధాంతి వచ్చాడు. అతనికి సంస్కృతం, తెలుగు బాగా వచ్చు. మా తండ్రికి జాతకం

వ్రాస్తానని ఆయన కోరాడు. నా కప్పుడు బహుశా 13 సంవత్సరా లుంటాయి. మా తండ్రికి జాతకాలయెడల నమ్మకం లేదు. ఎవరైనా తనను ఆశ్రయించి ఏదైనా కోరితే ఆయనది కాదనే స్వభావంకాదు. ఓఢ్ర సిద్ధాంతి ప్రోత్సాహంపైన జాతకం వ్రాయించుకోడానికి అంగీకరించారు కాని, తన పెద్దకుమారు నగు నా జాతకం వ్రాయుమని ఓఢ్ర సిద్ధాంతిని కోరారు. ఆ సిద్ధాంతి చక్కని దస్తూరీలో నా పుట్టుకనుండి దశలు దశలుగా విభాగించి సంస్కృతంలో ఒక శ్లోకం వ్రాసి దానికి తెలుగు తర్జుమాగా వివిధ దశలలో నాజ్యోతిష్య భవిష్యత్తు ఒక బైండు పుస్తకంలో వ్రాసాడు. మా తండ్రి ఆయనకు పారితోషకం యిచ్చి పంపివేసారు. ఆ జాతక పుస్తకం ఆయన భద్రంగానే వుంచారు. నేను ఆ పుస్తకం చదవడం జరిగింది కాని నా భవిష్యత్తు ప్రభావ మేమిటో నా తలిదండ్రులు చెప్పలేదు చర్చించలేదు. నా కొకటిమాత్రం గుర్తు వున్నది. ఆ రోజుల్లో మా తండ్రి స్నేహితు లొకరు మీ పెద్దబ్బాయిని ఏ ఉద్యోగంలో పెట్టిస్తారు అంటే అసలు ఏ ఉద్యోగంలో పెట్టించను యితనికి స్వతంత్ర జీవితాన్ని ఏర్పాటు చేస్తాను అన్నారు. నన్ను ఏ ఉద్యోగంలో పెట్టించను అన్న మా తండ్రి మాటలు నామనస్సులో బాగా నాటుకొన్నాయనుకొంటాను, యిప్పుడు పరిశీలించుకొంటే, ఏ ఉద్యోగంలోనూ లేను అనాలి, స్వంత ఉద్యోగం కూడా లేదనాలి, అయితే తీరుబడిమాత్రం వయస్సు మీదరినా వుండడమూ లేదు.

అయితే నా జాతకంలో నాకు ముద్రాధికారం వస్తుందని ఆ సిద్ధాంతి వ్రాసాడు. దానిని సమర్థించుకోవాలంటే నేను ఎం. ఎల్. ఎ., అయినప్పుడు ముద్ర వెయ్యడానికి రెజిస్టరు స్టాంపు కొన్నాను. నా లెక్క ప్రకారం అది ముద్రాధికారం కాదు, ఎం. ఎల్. ఎ., ఉద్యోగం కూడా కాదంటాను, అది ఉపన్యాసలకు వేదిక, ఉపన్యాసాలు యివ్వడం ఉద్యోగం కాదంటాను. ఈ విషయం తరువాత పరిశీలించుదాము.

అయితే నా జాతకంలో సిద్ధాంతి 1928 కాలములో "విశేష ధనం" సంప్రాప్తమవుతుందని వ్రాసాడు. జాతకం వ్రాసింది 1924 లో లాటరీ వచ్చింది 1928 లోనే. నాకు మాత్రం జాతకాలయందల నమ్మకం లేదు. సిద్ధాంతి ఆరితేరిన జ్యోతిష్కుడు కావాలి. జాతకదారులకు డబ్బు చేయడాల కోరిక వుంటుంది, ఆ కోరిక సంతృప్తిపర్చడానికి జాతక సృష్టి అనుకొంటాను. నా జాతక పుస్తకాన్ని చివరకు చెదలు తిని వేసాయి.

నా జాతక పుస్తకములో మా తండ్రి నాకు జరిగిన విషయాలు ముందుముందు కూడా నోటుచేస్తూ వచ్చారు.

నా జాతకంలో "విశేష ధనప్రాప్తి" అని సిద్ధాంతి వ్రాసినప్పటినుండి నాలుగు సంవత్సరాల తరువాత అది

వాస్తవంగా జోస్యం చెప్పడం జరిగిందని కనుక జాతకాల యెడల మా తండ్రికి నమ్మకం కుదిరింది. అయితే ఆ దశలో నే నంత పట్టించుకొన్నట్లు లేదు. నా జాతకం అప్పుడప్పుడు కుతూహలానికి చదువుకోడం సంభవించేది కాని నా వ్యాపకాలు వేరేవిధంగా వున్నాయి అనాలి.

జాతకంలో కొన్ని విషయాలు వివరించక తప్పదు. నా 13వ ఏట నా పెండ్లి గురించి ఆ జాతకములో వ్రాయడం జరిగింది. దాని ప్రకారం మా తల్లికి దగ్గర బంధువుల పిల్లనే నాకు పెండ్లి చేస్తారని సిద్ధాంతి వ్రాసాడు. అది వ్రాసిన 5 సంవత్సరాలకు నా పెండ్లి జరిగింది. అదికూడా ఒక విధంగా వాస్తవమే. నా భార్యతాలూకువారు కాకినాడవారే మా యింటికి దగ్గరవారే.

ఆ జాతకంలో మిగతా విషయాలన్ని నాకు జ్ఞప్తిలేవు పై రెండు విషయాలు జాతకం యొక్క శాస్త్రాన్ని సరియైనదని రుజువు చేస్తాయా అంటే నా దృక్పథం ప్రకారం జాతక శాస్త్రాలు సరియైనవి కావని అంటాను. మనిషి తనకు మంచి ఎప్పుడు వస్తుందనే ఆతురతను తీర్చడానికి, తనకు నష్టములు రావడం తెలుసుకోడానికి యీ జాతక శాస్త్రం మనుష్యులు సృష్టించుకొన్నారు. కొన్ని ఆకస్మిక వాస్తవ విషయాలు యిందులో కొంత సూచించబడవచ్చు. అంతమాత్రాన్న నిజాలు చెప్పబడ్డా యనడానికి వీలులేదు.

నా జాతక పుస్తకాన్ని మా తండ్రి తనవద్ద భద్రంగా వుంచారు. నేను ఇంగ్లాండు వెళ్ళడం గురించి బయలుదేరిన తేదీ టైము వగైరా తదుపరి ఇంగ్లాండునుండి రావడం, దానిముందు నా వివాహా వివరాలు, నేను సమ్మేలను నడిపిన విషయం, నా పిల్లలు పుట్టిన టైము వగైరాలన్నీ నా తండ్రి వాస్తవ ఘటనలను ఆ జాతకంలో నోటుచేసారు.

ముందుముందు ఆ జాతక పుస్తకాన్ని నేను చూచే టప్పుడు పై వివరాలు నాకు ఎక్కువగా వుపయోగపడేవి. సిద్ధాంతి వ్రాసిన ఊహాజనిత విషయములు, నా తండ్రివ్రాసిన వాస్తవ విషయాలు, ముఖ్యంగా ప్రభుత్వం నన్ను ఎప్పుడు అరెస్టు చేసింది, ఎప్పుడు విడుదలైంది వగైరా వివరాలు అందులో వున్నాయి.

ఈ వివరాలన్నీ ఎందుకు అలా వ్రాసారా అని నేను విమర్శించుకొంటే జీవితపు కష్టపురోజులు దాటి మంచిరోజులు ఎప్పుడువస్తాయా అని ఆతురతకొద్దీ తిరిగి జ్యోతిష్కులచే రాబోయే రోజుల మంచి కాలం గురించి తెలుసుకోడానికి నా జాతకాన్ని మా తండ్రి ప్రయోగం చేసుకొన్నారేమో!

అయితే నాతో ఆయన ఎప్పుడూ జాతకాలగురించి చర్చించలేదు. నాకు కూడా జాతకాలయడల నమ్మకంలేదు.

కాని మా తండ్రి తయారు చేయించిన జాతకపుస్తకం మా తండ్రి పరమపదించిన తర్వాత నేను వివరాల గురించి ఆ పుస్తకాన్ని తీసుకొన్నాను.

మిగతా వ్రాత పుస్తకాలతో నా బీరువాలో దానిని భద్రంగా వుంచాను. మా తండ్రి నోటుచేసిన వివరాలను కుతూహలంకొద్దీ అప్పుడప్పుడు అవసరమయినప్పుడు పరిశీలించేవాడిని.

కాని కొద్దికాలమయినతర్వాత ఒకసారి నా బీరువా తీసి ఆ పుస్తకాలు చూచేటప్పుడు దానిలో చెదపట్టి నా జాతకాన్ని చెదలు పూర్తిగా ఫలహారం చేసాయి. వాట్ల కాగితాలు కొన్నికూడా భద్రంగా పెట్టుకోడానికి వీలులేకుండా పోయింది.

నా జాతకం చివరకు చెదలకు ఎర అయింది, కాని నా జీవితాన్నిమాత్రం చెదలు ఎరకు తీసుకోలేకపోతున్నాయి.

— :o: —

# 4. కాలేజీ చదువు కాలం

సామర్లకోటలో నాకు హైస్కూలు చదువు పూర్తి కావడం, నా తండ్రి స్వంత వ్యాపారం తిరిగి ప్రారంభించడమూ జరిగింది. ఆయన ఉద్యోగం 1910లో మొదలుపెట్టి, దానినుండి స్వేచ్ఛను పొంది స్వంత ఎగుమతుల వ్యాపారం యితరుల పెట్టుబడితో నిర్వహించి, తన పెట్టుబడిదారులనుండి విడిపోయి 1922లో సామర్లకోటలో ఉద్యోగం, తనకే డబ్బు రావడంతో తిరిగి 1928లో ఫ్యాక్టరీ నిర్మాణమూ, ఎగుమతుల వ్యాపారం వరుసలో బయలుదేరాయి.

ఈ దశలో ఆయన కేంద్రం కాకినాడకు మార్చారు. జోనప ఫ్యాక్టరీ సామర్లకోటలోనూ, ఎగుమతులు కాకినాడ నుండి పాశ్చాత్య దేశాలకు ఫ్రాన్సు, ఇంగ్లాండులకు 1929 లో ప్రారంభించారు.

ఇక నా చదువు వ్యాపకం సాగుతూంది. సామర్లకోట నుండి కాకినాడలో కాలేజీ చదువుకు మారాను. ఆ రోజుల్లో పిఠాపుర రాజా కాలేజీ పలుకుబడి గలిగిన విద్యా సంస్థలలో ఒక్కటి. హైస్కూలు విద్యార్థులను కాలేజీలో చేర్చుకొనే అప్పుడు దాని ప్రిన్సిపాలు వేమూరి రామకృష్ణారావు తన యింటిగుమ్మంవద్ద కూర్చొని ప్రతి విద్యార్థి రికార్డు పరిశీలించి ప్రశ్నలు వేసి మరీ చేర్చుకొనేవారు. నా వంతు వచ్చేటప్పటికి నా పుస్తకాలు చూచి నాకిచ్చిన సర్టిఫికెట్లు చూచి

హైస్కూలు హెడ్ మాస్టరు నాకు యిచ్చిన ప్రవర్తన సర్టిఫికెట్టులో "ప్రవర్తన: చాల మంచిది" అన్నది చూచి నా మొగమువంక పరికించి ప్రిన్సిపాలు రామకృష్ణారావు "అంత మంచివాడవా" అన్నారు. "నన్నేమి చెప్పమంటారండీ హెడ్మాష్టరుగారు వ్రాసింది అది" అని వూరుకొన్నాను. ప్రిన్సిపాలు రామకృష్ణారావుకు కొంత హాస్యమున్న మనిషి కూడాను. దానికితోడు దండన మనిషి కూడాను. నేను పైకి మెత్తని మనిషినే కాని లోపల చాల గట్టిమనిషిని అని చెప్పాలి. అందుచే పిఠాపుర రాజా కాలేజీ మా యిద్దరికీ కుదరింది.

ఇక్కడే తరువాత జరిగిన విషయం చెప్పాలి. కాలేజీలో చదువుకొనేటప్పుడు ఒక సంవత్సరానంతరం డిపోజిట్టు డబ్బు తీసుకొనే సమయంలో, ఆఫీసులో ఒక ట్యూటరుచే నా కాగితముమీద సంతకం కోరగా నన్ను తెలుసుండే నీవు "ఎవరో నాకేమి తెలుసు" అని నిరాకరించారు. నాకు సహజంగా కోపం వచ్చి "అందుకే యీ కాలేజీ పరిస్థితి యిలా వున్నది" అన్నాను. ఆ ట్యూటరు శ్రీరామశాస్త్రి ప్రిన్సిపాలుకు నామీద కంప్లైంటు చేసారు. ప్రిన్సిపాలు రామకృష్ణారావు నన్ను పిలిపించి "సస్పెండు" చేస్తానని బెదిరించి బందరులో మా తండ్రి చదువుకొన్నప్పుడు యీయన బందరు స్కూలులో వుండగా తెలుసుండి "ఆయన బుద్ధిమంతుడే నీవేమిటి యిలా తయారైనావు" అన్నారు.

ప్రిన్సిపాలు రామకృష్ణారావు గురువు కాలేజీ పూర్వపు ప్రిన్సిపాలు సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడు తదుపరి నేను కాలేజీ చదువు పూర్తిచేసినప్పుడు యిచ్చిన సర్టిఫికెట్టు నేను బుద్ధిమంతుడనని వ్రాసి యిచ్చారు.

కాలేజీలో 1929_1932 వరకు 4 సంవత్సరాలు డిగ్రీ కోర్సు చదువుతో నూతన దశలో ప్రవేశిస్తున్నాను.

మా తండ్రి వ్యాపార పరిస్థితి అనుకూలంగా వుండటము నాకు కావలసిన సదుపాయాలు ఆయన కలుగచేసేవారు. అయితే వాట్లను దుర్వినియోగం చేయడం కాని, సౌఖ్యానికి తాపత్రయపడడం, నాకు సంప్రాప్తం కాలేదనే నా అభిప్రాయం. నా తండ్రికి బోనుమిల్లు వ్యాపారం మద్రాసు రాష్ట్రంలో ప్రత్యేక స్థానం పొందింది.

నేను కాకినాడ కాలేజీలో 1929 నుండి 1932 వరకు ఇంటర్ మీడియేటు, బి. యస్. సి. చదివి బి. యస్. సి. డిగ్రీ పొందాను. డిగ్రీ కోర్సులో నా గ్రూపు వృక్షశాస్త్రము, జంతు శాస్త్రము, రసాయన శాస్త్రము.

వృక్ష శాస్త్రము, జంతు శాస్త్రము చదువు జీవ శాస్త్రము గురించి నేర్చుకోడమన్న మాట. ఇక రసాయన శాస్త్రము పదార్థాల గుణాలు, మార్పులు వాట్ల పరిశోధనకు ఉపయుక్తమయినదే. చదువునందు ఆసక్తి చూపినవాడనే. ముఖ్యంగా జీవ శాస్త్రము, రసాయన శాస్త్రము నాకు ముందుముందు మానవ సాంఘిక వ్యవస్థను

అవగాహన చేసుకోడానికి తోడ్పడ్డం దనాలి. ఒక మొక్క లేక జంతువు ఏ స్వరూపము కలిగినది, యితర మొక్కలు జంతువులనుండి వాట్ల ప్రత్యేకత, వాట్ల పుట్టుపూర్వోత్తరములు, ఏ తరగతికి చెందినది మొదలగు హంశాలను శాస్త్రరీత్యా నేర్చుకోడంలో ప్రాణియొక్క అభివృద్ధి తెలుసుకోడం సాధ్యమయింది.

దానికితోడు రసాయన శాస్త్రము కాలేజీలో నాలుగు సంవత్సరాలు నేర్చుకోడంలో ముందుముందు నాకు అలవడే భౌతిక తత్వ శాస్త్రానికి సహాయం పడింది. స్కూలు, కాలేజీ చదువులలో ఉపాధ్యాయులవద్ద నేర్చుకోడం ప్రాథమిక పునాది మాత్రమే జరిగింది. కాలేజీ విడిచిన తర్వాత ముందుముందు మానవజాతుల భౌతిక, నాగరిక శాస్త్రము (anthropology) తత్వ శాస్త్రము, మానసిక శాస్త్రము, అర్థిక రాజకీయ శాస్త్రము, చరిత్ర మొదలగు శాస్త్ర పఠనము, వాట్ల గ్రంథసేకరణ సాగించాను. ఇతరుల చేతుల్లో పడని గ్రంథాలు యిప్పటికి నావద్ద వున్నాయి. కాలేజీ చదువుకు కొన్న పుస్తకాలు పోయాయి, కాని జీవశాస్త్రము, రసాయన శాస్త్రానికి సంబంధించిన యితర గ్రంధాలు నా రిఫరెన్సుకు నావద్ద వున్నాయి. రాజకీయ రంగములో పడి పనిచేయడంలో యింకా నా చదువుకు టైము సరిపోవడం లేదు, కాని నా గ్రంథాలు తిరగవేయడానికి ఎన్నిరోజులైనా పతిపోవు.

మొదట్లో చదువు జ్ఞాన సముపార్జన గురించి సాగినా, తదుపరి కార్యాచరణకు సామాజిక వ్యవస్థను మార్చే వ్యాపకానికి వుపయోగపడిందనాలి. అయితే నాకు అందుబాటైన విజ్ఞానము సంపూర్ణంగా వుపయోగమయిందా లేదా అంటే, దాని అంతు యింకా తెలియడంలేదని నేను చెప్పవలసి వుంటుంది. అయితే విద్య, విజ్ఞానంయెడల కుతూహలం మాత్రం తగ్గడంలేదు. మనుష్యులమధ్య పుట్టి, మనుష్యులతో జీవిస్తూ మానవులకై కృషి అద్భుతమనిపిస్తుంది.

నా ఉపాధ్యాయు లెవరూ యిప్పుడు లేరు. ఒక్కరు మినహా మిగతా వారెవ్వరూ సాంఘిక, రాజకీయ రంగంలో ప్రవేశించలేదు. హైస్కూలు క్లాసు చదువులో బుద్ధిని జీవితం నేర్పిన ఉపాధ్యాయులు సత్యనారాయణమూర్తి, తదుపరి కాలేజీలో వృక్షశాస్త్ర అధ్యాపకులు గోపరాజు రామచంద్రరావు (గోరా) మాత్రం వారి జీవితకాలమంతా నాకు పరిచితులుగా, సన్నిహితులుగానే వున్నారు. కాలేజీలో వృక్షశాస్త్ర ప్రధాన అధ్యాపకులగు డాక్టరు W. లక్ష్మణరావు పరిచయమే కాని నా బి. యస్. సి. పూర్తయ్యేవరకు ఆయన పి. ఆర్. కాలేజీలో లేరు. ప్రిన్సిపాలు వేమూరి రామకృష్ణారావు సనాతన ధోరణులు బలవంతపు పద్ధతులు వహించక లక్ష్మణరావు కాలేజీనుండి వెళ్ళిపోయారు. గోపరాజు రామచంద్రరావు (గోరా) హేతువాద విధానాలను ప్రిన్సిపాలు సహించక ఆయనను కాలేజీనుండి తప్పించివేశారు.

నేను గోపరాజు రామచంద్రరావు (గోరా) వంటి ఉత్తమ ఉపాధ్యాయుని ముందుకాని తదుపరికాని చూడలేదంటే అతిశయోక్తి కాదు. కాలేజీలో బహు సమర్థవంతంగాను, విజ్ఞానపూరితంగాను వృక్షశాస్త్రము బోధన జరిపేవారు. విద్యార్థులను తనతో సమానంగా చూచుకొనేవారు. తన కాలాన్ని, పనులను నిర్వర్తించడములో బహు నిర్మాణయుతంగా వ్యవహరించేవారు

అయితే ఆయన సాంఘిక ధోరణిలో విప్లవాత్మక భావాలుగల వ్యక్తి, దేశభక్తిగల వ్యక్తి, స్వాతంత్ర్య ప్రియుడు, కాని ఆయన సిద్ధాంతం నాస్తికత్వం, మతాంధ విశ్వాసాలను ఎదిరించడము.

నేను విద్యార్థిగా ఆయన ఉపాధ్యాయుడుగా మా యిద్దరిమధ్య కాలేజీలో చూచిన తక్షణము అన్యోన్యత, అభిమానాలు ఏర్పడ్డాయి.

మా యిద్దరిమధ్య వయస్సు తేడా 10 సంవత్సరాలు మాత్రమే. అయినా ఆయన ఉద్దేశాలను యితరులపై రుద్దేవారు కాదు. ఇతరులను ఆలోచనాపరులుగా చేసేవారు, కాని మా యిద్దరికి జాతీయ స్వాతంత్ర్య ఆకాంక్ష సమానంగానే వున్నది. అప్పటికి ఆయన ఉపాధ్యాయవృత్తిలో వున్నారు. నేను స్వేచ్ఛా విద్యార్థిని: అనుభవాలను పుంజుకొంటున్నాను.

నేను 1929_1932 కాలేజీ చదువులో వున్న కాలంలో బ్రిటీషు పాలకుల రాజ్యాంగ ఎత్తుగడలు పెద్ద స్థాయికి వచ్చాయి. భారత దేశంలోని ద్వంధ పరిపాలనా విధానాన్ని మార్చి, రాష్ట్రాలకు పరిపాలనా అవకాశాలు కలుగచేయాలంటూ, డొమినియన్ స్టేటస్, ఆస్ట్రేలియా, కెనడాలవలె బ్రిటీషు రాజరికంకింద జాతీయ నాయకులకు పరిపాలనా అవకాశాలు కలుగచేస్తామంటూ వాగ్దానాల పరంపరలు బ్రిటీషు పాలకులు వెదజల్లడం మొదలుపెట్టారు.

అయితే యీ వాగ్దానాలతో జాతీయ నాయకులకు సంతృప్తి కలుగలేదు. బ్రిటీషు పాలకుల వలలో జాతీయ నాయకులు పడలేదు. ప్రజావెల్లువ, ప్రజాందోళనను అణగ ద్రొక్కడానికి, జాతీయ నాయకులను వాగ్దానాలతో సంతృప్తి పర్చడానికి, బ్రిటీషు పాలకవర్గం తాపత్రయం. రాజ్యాంగ సంస్కరణలకు తన రిపోర్టును సర్ జాన్ సైమన్ కమీషను రాష్ట్రాలన్నీ తిరిగి తయారుచేసింది. అయితే అప్పటి (1929) కాంగ్రెసులో రెండువర్గా లున్నప్పటికి సైమన్ కమీషనును తిరస్కరించడములో అందరూ ఏకమయినారు. దేశమంతటా సైమన్ కమీషను వ్యతిరేక ఆందోళన బయలుదేరింది.

కార్మికవర్గం కూడా సమ్మెలు, హర్తాలులు బ్రిటీషు పాలకుల విధానానికి వ్యతిరేకంగా లేవదీసింది. లేబరుసమ్మెలు అణగద్రొక్కడానికి చట్టాలు, నిర్బంధానికి "పబ్లిక్ రక్షణ"

అనే శాసనాలు బ్రిటీషు పాలకులు తెచ్చిపెట్టారు. బ్రిటీషు ప్రభుత్వంపై ద్వేషాన్ని రెచ్చగొడుతున్నారని, కార్మిక నాయకులను అరెస్టులుచేసి మీరట్ పట్టణంలో దీర్ఘకాలిక విచారణ మొదలుపెట్టారు.

జాతీయ కాంగ్రెసు నాయకులకు ఒక మూల దేశంలో బయలుదేరిన ప్రజావెల్లువ, వేరొకమూల బ్రిటీషు పాలకుల రాజ్యాంగ సంస్కరణల తతంగం మధ్య పడ్డారు. దేశంలో విప్లవ పరిస్థితులు రాకూడదని జాతీయ కాంగ్రెసు నాయకులు బ్రిటీషు పాలకులు తమతో రాజీ చేసుకోవాలనే ధోరణిలో వున్నారు

ఇక బ్రిటీషు పాలకులు, జాతీయ ఉద్యమం విప్లవ స్వాతంత్ర్య ఉద్యమం వైపు పోకుండా అరికట్టి తమ దోపిడీ విధానాన్ని కొనసాగించుకోవాలనే ఎత్తుగడలు ప్రారంభించారు. ఇందుకు మైనారిటీ వర్గాలను ముఖ్యంగా ముస్లింలను షెడ్యూల్యు, వెనుకబడిన తరగతుల నాయకులను జాతీయ ఉద్యమంవైపు పోకుండా అరికట్టాలని కూడా ప్రయత్నాలు సాగించారు. పాలకవర్గం పరిపాలనా యంత్రాంగాన్ని చేత ల్లో పెట్టుకొని, మత విద్వేషాన్ని రేకెత్తించి, ప్రజలలో విభేదాలు లేవనెత్తి తద్వారా దేశంలో సంక్షోభపరిస్థితులు లేవదీసారు.

పాలకవర్గాల ఎత్తుగడలు ఎన్ని వేసినా, ప్రజాజీవితానికి మెరుగుపడదు. ప్రజాజీవితం స్వేచ్ఛను జీవిత రక్షణను ఆశిస్తుంది. మొదటి ప్రపంచ యుద్ధం తదుపరి ఒక దశాబ్ద

కాలానికి ప్రపంచంలో బ్రహ్మాండమయిన మార్పులు సంభవిస్తున్నాయి. సామ్రాజ్యవాదం సంఘర్షణలో పడిపోతూంది. అది యీ సంఘర్షణనుండి బయటపడడం సులువుకాదు. బ్రిటనులో కాన్సర్వేటివు (పెట్టుబడిదారీవర్గపు) ప్రభుత్వం పోయి 1929 లో లేబరు పార్టీ ప్రభుత్వం బయలుదేరింది. ఈ రెండు పార్టీలు వలసదేశాల్లో విస్తృవాత్మక ప్రభుత్వాలను శాసిస్తున్నవి. జాతీయ కాంగ్రెసుతో సహితం వాటి కోర్కెలతో అంగీకరించేది లేదనే ధోరణి కాన్సర్వేటివు ప్రభుత్వ విధానమూ అయితే లేబరు ప్రభుత్వ విధానము 1929 నుండి భారత కాంగ్రెసు జాతీయ నాయకత్వంతో రాజీకి సిద్ధం. అప్పటి వైస్‌రాయ్ లార్డు ఇర్విను వుపయోగించి కాంగ్రెసు నాయకుడు గాంధీజీతో సంభాషణలు జరిపించారు. అయితే జాతీయ కాంగ్రెసు 1930 లో సంపూర్ణ స్వాతంత్ర్యం భారత దేశ లక్ష్యమని స్పష్టీకరించింది. ప్రజలు సామ్రాజ్యవాదానికి తీవ్రమయిన వ్యతిరేక ఉద్యమాన్ని లేవదీస్తున్న కాలమది.

నా కాలేజీ చదువులో రాజకీయ గుణపాఠాలు నేర్చుకోడానికి అవకాశాలు కల్గాయి. జాతీయ విమోచనా ఉద్యమ పాఠాలనుండి దేశ స్వాతంత్ర్యముయెడల ప్రగాఢ ఆకాంక్ష నాహృదయంలో బలపడుతున్న కాలమది. ఆలోచించే మధ్యతరగతి యువకులు బ్రిటీషు సామ్రాజ్యవాద విధానానికి వ్యతిరేకులు. 1929–1932 నాకు స్కూలులో, స్కూలుబైట మంచి పాఠాలు నేర్చుకొనే అవకాశము.

నేను స్కూలులో ప్రవేశించి పట్టభద్రుడనయ్యేవరకు జాతీయవాద సిద్ధాంతమే నాకు 20 వ సంవత్సరం వయస్సు వచ్చినప్పటివరకు సామ్యవాద రాజకీయ సిద్ధాంత గ్రంథాలేమీ చదువలేదు కాని అప్పటికే దేశ చరిత్ర అవగాహన చేసుకొన్నాను. బ్రిటీషు పాలనమండి దేశం స్వాతంత్ర్యము కావాలని నా ఆకాంక్ష, నా విద్యార్థి దశలో గాంధీజీని విశ్వసించాను. బ్రిటీషు పాలనను సమర్థించేవాళ్ళను నిరసించేవాడను. రాజకీయ సిద్ధాంతాలు నేర్చుకోడానికి అందుబాటైన గ్రంథాలు నా కాలేజీలో లేవు.

సిద్ధాంత ప్రబోధకుల కూడా నాకు అందుబాటు కాలేదు. ఆ రోజుల్లో మధ్యతరగతి యువకులకు కాలేజీ చదువే పెద్ద చదువు, ఆ చదువు తరువాత ఉద్యోగ తాపత్రయమే. అందుకై పాశ్చాత్య పాలనయెడల ద్వేషం నా కాలపు విద్యార్థి బృందాలకు ప్రమాదము. అయితే నాకు స్కూలు ప్రవేశంనుండి పాశ్చాత్యపాలనయెడల ద్వేషం బయలుదేరడం స్వాతంత్ర్య ఆకాంక్ష నా అదృష్టమనే చెప్పాలి. దానిలోని ఒడుదుడుకులు అంచనా వేయలేదు.

నా పెరుగుదల ఒక క్రమపద్ధతిలోనే అనుకూలంగా సాగుతూంది. నా పెంపకములో తలిదండ్రులనుంచి నాకు స్వేచ్ఛ వున్నది. నేను పెరుగుతున్న ప్రాంతాలు కులతత్వపు మూఢ విశ్వాసాలు కలిగిన సమాజంలోని దుష్పరిణామాలను నేను అసహ్యించుకొన్నా, నా విద్యార్థి దశలో నా ద్వేషం పాశ్చాత్య పాలనపై కేంద్రీకృతమయింది.

# నా వివాహం

నేను మా తలిదండ్రులతో కలసి సామర్లకోట వెళ్ళడం నా హైస్కూలు చదువు పూర్తయ్యే ముందు మాకు ఐరిష్ గుర్రపు పందెములో లాటరీ రావడం, సామర్లకోటలో చదువు పూర్తయినతోడనే నేను మా తలిదండ్రులతో కాకినాడ రావడం కాలేజీ చదువు ప్రారంభించడం జరిగింది. తిరిగి కాకినాడవచ్చిన 2 సంవత్సరములకు నాకు వివాహము జరిగింది. నా వివాహము కూడా నాకు ఒక లాటరీవంటిదే అని యిప్పుడు అనవలసి వుంటుంది. నేను అనుకోకుండా మంచిపని జరిగిందని అనాలి.

ఆలస్యమయితే నాకు పెండ్లికి పిల్లను ఎవరూ యిచ్చే వారు కాదనుకొంటాను, ఆలస్యమయితే నేను కష్టభూయిష్ట మయిన రాజకీయ రంగంలో ప్రవేశిస్తా కాబట్టి. అయితే యీ దేశంలో మనుష్యులు పుట్టడమే బహుజనం కష్టభూయిష్ట మయిన ప్రపంచ భాగంలో పుట్టడమనాలి.

నా పెండ్లి సమయానికి నాకు 18 సంవత్సరాలు నా భార్య మాణిక్యాంబకు 11 సంవత్సరాలు మాత్రమే. మాణిక్యాంబ అమ్మమ్మ వరహాలమ్మ తన మనుమరాలును నాకిచ్చి పెండ్లి చేయాలని పట్టు పట్టిందట. అందుకు కారణాలు మాది కాకినాడ, వారిది కాకినాడ తెలుసున్న వాళ్ళము. ఇక మా తండ్రికి ఆస్తిపాస్తులున్నాయి వాళ్ళు ఆస్తిపరులు, యిక ముఖ్యంగా నేను బుద్ధిమంతుడనని ఆమె

అభిప్రాయమట. నా పెండ్లికి ముందు ఆమె మా యింటికి వచ్చి నన్ను చూచేది, మా యిల్లు వారింటికి దగ్గరే

మా మామ్మ వాళ్ళ మనుమరాలిని నా కిచ్చి పెండ్లి చేయదలచుకొన్నారంటే ఆమెను గసిరేవాడను. "ఇప్పుడు పెండ్లేమిటి ?" ఆ దశలో నాకు పెండ్లి వద్దనే ధోరణిలో వుంటుండేది. ఏ పిల్లవాడు తనంతట తాను పెండ్లి చేసుకొంటానని అంగీకరిస్తాడు ?

అసలు నా భార్య తాలూకు దువ్వూవారు మా యింటికి దగ్గరే. నాకు పెండ్లి కాకముందే వారింటికి శుభకార్యాలలో భోజనానికి వెళ్ళేవారము. బహుశా నా భార్య పుట్టి నప్పుడు నాకు 7 సంవత్సరా లుంటాయి. వారింటికి భోజనానికి వెళ్ళానుకొంటాను

నాకు మొదటి సంవత్సరం ఇంటర్ మీడియేటు చదువు పూర్తయింది. రెండవ సంవత్సరము పూర్తవుతుంది పరీక్షలు వచ్చాయి. ఇక పరీక్షలకు చదువుతున్నాను. ఒకరోజు ఉదయం మా పెద్దతండ్రి రామారావు నా గదిలోకి వచ్చి "రా, నాయనా బయటకు వెడదాము" అన్నారు. ఎక్కడికో ఎందుకో చెప్పలేదు. మా తండ్రి కూడా నా పని ఏమిటో నాకు తెలియచేయలేదు. మేడ దిగి కిందకు వచ్చేటప్పటికి గుర్రపు బగ్గీ సిద్ధంగా వుంది. మా పెదతండ్రి నేను కలసి బయలుదేరాము. సరాసరి దువ్వూవారి మేడ దగ్గరకు

వచ్చాము. మా పెద్దతండ్రి లోపలకు తీసుకువెళ్ళారు. ఆ యింట్లో విశాలమగు వసారాలో కూర్చొన్నాము. అక్కడున్న కుటుంబ సభ్యులందరూ కూర్చొన్నారు. ఒక అమ్మాయిని తీసుకు వచ్చారు. వంటినిండా బంగారు వస్తువులు వున్నాయి నాకు చూపించారు.

ఆ 11 సంవత్సరాల పిల్ల తన బంగారు వస్తువుల మూలంగా నాకు అంత అందంగా కనపడలేదు కాని నేను మారుమాట్లాడలేదు. అయితే నేను పెండ్లాడిన తర్వాత మాణిక్యాంబ, ఆ వస్తువులు నేను ఆఖరు చేసిన తర్వాత నాకు అందమయిన పిల్లగానే కనపడింది. అతిసులువుగా మా పెదతండ్రి "పసుపు కుంకాలు" ఏర్పర్చుకొని నాకు పెండ్లి నిశ్చయించారు. నన్ను మా గుర్రపు బండిలో తీసుకు వచ్చి చదువుకొనే నా గదిలో విడిచిపెట్టారు. నా గదిలోని నా ఫోటో ఒకటి తీసి పెండ్లికూతురువారి యింటికి పంపారు. నా ఫోటో మాణిక్యాంబ నాలో ఎన్ని కష్టాలున్నాయో ఆ ఫోటోలో తెలుసుకొనివుండరు.

ఒక నెలలోనే నా వివాహము బాగానే జరిగింది. అది ఫిబ్రవరి 1930. నేను మా యింట్లో పెద్దపిల్లవాడను, నాకు 7 గురు తమ్ములు, 5 గురు చెల్లెండ్రు వున్నారు. నా భార్య వారింట్లో ఒక్కతే అమ్మాయి తనకు 6 గురు తమ్ములున్నారు.

లోనే చాలమ్మంది తన ఆఫీసు నిర్వాహణలో ఉద్యోగంలో పెట్టి పనులు కల్పించినవ్యక్తి. తన వ్యాపారంలోనే ఆ కాలంలో సంవత్సరానికి సుమారు లక్ష రూపాయలు రాబడి వస్తుందని నాతో చెప్పడం జరిగింది. కాని నాకు వ్యాపారంలో చేరా లని కోరికలేదు. ధనార్జనయడల మక్కువ కలగలేదు. నా మనస్సు మా తండ్రికి తెలుసున్నా, తెలియకపోయినా, ఆయన నన్ను తన వ్యాపారంలో చేరమని కోరలేదు. ఆయన నమ్మకంబట్టి నా "జాతకం" అభివృద్ధ జాతకమని విశ్వాసం. ఏమైనా నా తండ్రి వలన నాకు కావలసిన స్వేచ్ఛ దొరికింది. అది వుపయోగపడిందే అనుకొంటాను.

యిక డబ్బు విషయంలో నేను కోరినది యిచ్చేవారే కాని అడ్డుచేయలేదు. డబ్బును నేను దుర్వినియోగం చేయ లేదు కాని మా తండ్రి వలన నాకు డబ్బుకు యిబ్బంది లేదు.

లండనులోని చదువుకు భారతీయ విద్యార్థులకున్న అవ కాశాలగురించి సూచనలిచ్చే పుస్తకాని మద్రాసు యూని వర్సిటీ నుండి తెప్పించాను. నాకు ముందు ఇంగ్లాండులో చదువుకొని ఐ సి యస్ లో ప్రవేశించిన ఎ. యస్ పి అయ్యరు వ్రాసిన "యూరపులో ఒక భారతీయుడు" యింగ్లీషు పుస్తకాన్ని కొని ఆకర్షింపబడి ఎ యస్ పి అయ్యరుకు వ్రాసి భారత విద్యార్థులకు యూరపులో పరిస్థి తులగురించి సలహాలు అడిగాను. ఇలా కొంత సరంజా మేక రించాను. లేటు ఎ యస్ పి అయ్యరు I C S కలెక్టరేటు

ఎగ్జిక్యూటివ్ ఉద్యోగంలో వుండి, నేను లండనులో వుంతగా తానుకూడ మళ్ళీ అక్కడికివచ్చి బార్-ఎట్-లా చదివి జ్యుడీషియర్ శాఖలో ప్రవేశించారు. అయ్యరు స్వతంత్ర భావాలుగల వ్యక్తి మరో 10 సంవత్సరాల తర్వాత నేను బళ్ళారి జైలులో (1942) నిర్బంధంలో వుండగా అయ్యరు ఆ ప్రాంతంలో జిల్లా జడ్జిగా వుండడము తటస్థించింది.

చిన్న వయస్సులో నా తత్వము, ప్రత్యేకంగా తెలుసు కోవలసినది లేదనే అహంభావముండేది. భర్తృహరి సుభాషితములోని నమ్రత గురించి పద్యాలు చిన్నప్పుడే ఆకర్షింపబడి కంఠస్థం చేసినప్పటికి ఆచరణలో దానిని వుపయోగం లోకి తీసుకురాలేకపోయాను. అయితే ఫ్యూడల్ భూస్వామిక సమాజంలో పెరుగుతున్న నాకు దానిని ఎదిరించడానికి మూఢత్వాన్ని చాలెంజి చేయడానికి, నా వ్యక్తిత్వము నాకు అవసరమైందనుకోవాలి.

డిసెంబరు 10 వ 1932 లో పి & ఓ స్టీమరు మెలోజాలో బొంబాయి నుండి లండనుకు నా ప్రయాణము నిర్ణయమైంది. విద్యార్థిగా నాకు ప్రయాణంలో కన్సెషను వుండడం మూలంగా నా తండ్రి స్టీమరులో మొదటి తరగతిలోనే నాకు రిజర్వ్ చేయించారు. ఆ రోజుల్లో పశ్చిమ దేశాలకు స్టీమరు ప్రయాణమే గొప్పది. యిప్పటివలె విమానప్రయాణాలు లేవు.

నా తండ్రికి యూరొపులో ఎగుమతి దిగుమతి వ్యాపార ముండేదికనుక, నా ప్రయాణంలో పారిస్‌లో నున్న తన

వ్యాపార ఏజెంటగు రెనీమెల్లహార్టును నా స్టీమరు ఫ్రాన్సులో పోర్టు మార్సెల్ చేరినతోడనే నన్ను కలుసుకోమని వ్రాసారు. ఇక లండనులోవున్న వ్యాపార ఏజెంట్లగు నికల్సు అండ్ నికల్సు వారికి వ్రాసి, నేను లండనులో ఉండడానికి భారత విద్యార్థులున్న హోస్టలులో మకాం ఏర్పాటుచేయమని వ్రాసారు. నా ప్రయాణానికి సదుపాయాలన్నీ బాగానే సమకూడాయి.

నా ప్రయాణం గురించి నా భార్య మాణిక్యాంబతో చెప్పాను త్వరగానే స్వదేశానికి వస్తానని చెప్పాను కాని ఇంగ్లాండు దేశమేమిటో యింకా చదువు ఏమిటో చిన్న తయస్సు మూలంగా తనకు తెలియదు. తమ యింట్లో ఒక్కర్తే కూతురు ఎంతో వైభవంగా పెండ్లి జరిపి రెండు సంవత్సరాలకే నేను పశ్చిమ సీమ దేశానికి ప్రయాణం కట్టడం నా భార్య తల్లికి కుటుంబానికి, యిష్టము లేకపోయినా, నాకు చెప్పడానికికాని, ఆపడానికి సాహసించలేదు. నా భార్యకు తమ్ములు అయిదుగురు చిన్నపిల్లలున్నారు. ఆరోజుల్లో దూరదేశ ప్రయాణంకాబట్టి నా భార్య తల్లికి కుటుంబానికి కొంత ఆందోళన కలిగించింది అయినా నాయడల నమ్మక మున్నవారు కాబట్టి కొంత ఉపశమనము. మా తల్లికి మాత్రం పట్టింపులేమీ లేవు. ఆమె అమాయకురాలు. ఆమెకు నా దూరప్రయాణంగురించి ఉత్సాహంకాని బాధకాని లేదు

52 సంవత్సరాలకి పూర్వమూ బొంబాయి నుండి లండనుకు స్టీమరు ప్రయాణం, సరాసరి లండను టిల్‌బరీడాక్సుకే చేరు కొంటే, 21 రోజులు తీసుకొనేది. మార్సేలు పోర్టులో దిగి ఫ్రాన్సు మీదుగా ఇంగ్లీషు చానలుదాటి లండను చేరు కొంటె 15 రోజులు మాత్రమే తీసుకొనేది, నా ప్రయాణం యూరపు మీదుగా లండనుకు నిర్ణయించబడింది.

ఈ రోజుల్లో స్టీమరు ప్రయాణాలు ఎవరూ సామా న్యంగా చేయరు. లండనుకు విమాన ప్రయాణం బొంబాయి నుండి అర్ధరోజు మాత్రమే తీసుకొంటుంది. 1973 లో నా కుమారుడు డా॥ కుసుమేశ్వరరావు, నా కోడలు, నా చిన్న మనుమడు ఆ దేశానికి అలా ప్రయాణం కట్టి అక్కడే నివాస మేర్పర్చుకొన్నారు.

డాక్టరు కుసుమేశ్వరరావు వైద్యశాస్త్రంలో పై చదువుకు వెళ్ళి అక్కడ వైద్యవృత్తిలో స్థిరపడ్డాడు. మన దేశంలో ప్రభుత్వ వైద్యశాఖలో 10 సంవత్సరాలు పనిచేసిన తర్వాత ఆ దేశంలోని అనారోగ్యాలకు వైద్యుడుగా 1973 నుండి స్థిరపడ్డాడు. ఇక నా దేశంలో నేను "రాజ కీయ అనారోగ్యాలకు" వైద్యుడుగా నాఅంతట నేను వృత్తి స్వీకరించినా నా దేశంలో నామందులు పనికి కష్టమవుతూంది, ఇక నా స్టీమరు ప్రయాణానికి వస్తాను. ఆ రోజుల్లో మధ్యతరగతి యువకులు ఇంగ్లాండు వెళ్ళడం గొప్ప. వేరొక

మూల సముద్ర ప్రయాణం అనాచారంగా కూడా ఘ్యాడ లిష్టు విమర్శ వుండేది. 1932 నాటికి సముద్ర ప్రయాణం గురించి చాందస్త భావం కొంత తగ్గినా ఇంగ్లాండు వెళ్ళువారలకు నైతిక స్వభావం సన్నగిల్లుతుందనే మూఢ నమ్మక యీ దేశంలోని చాందస్తుల కుండేది. అయినా డబ్బుకలిగి అప్పటి పాలకులకింద ఉద్యోగాలు సంపాదించుకోడానికి బ్రిటనులో చదువు ఒక పాస్పోర్టు అనుకొనేవారు. కాని కొందరు యువక వయస్సులో ఇంగ్లాండు వెళ్ళి అక్కడ రాజకీయ చైతన్యం పొంది భారత దేశంలో ప్రజా సామాన్యానికి సన్నిహితులై దేశభక్తులు కావడం కద్దు

నా తండ్రి నన్ను స్టీమరు మలోజా ఎక్కించడానికి నాతో బొంబాయివరకు రైలులో వచ్చారు. దారిలో వివిధ రైలు స్టేషన్లలో ఆయన మిత్రులు, వ్యాపార ఏజంట్లు బంధువులు వచ్చి నా ఇంగ్లాండు ప్రయాణానికి మా తండ్రిని నన్ను పూలమాలలతో అభినందించారు. బొంబాయి చేరుకొన్న తర్వాత ఒక పార్సీ కుటుంబమూ మమ్మాలను అభినందించారు. ఇంగ్లాండు ప్రయాణం ఆరోజుల్లో కొందరికి గొప్పదన్నమాట.

నా వయస్సులో అప్పటి నా ప్రయాణం నా తండ్రికి డబ్బున్నది కాబట్టి సాధ్యమైంది. నేటికాలంలో ప్రాశ్చాత్య దేశాలలో వృత్తి భారతీయులకు ధనార్జనకు ఆకర్షణ. బహుశా నా తండ్రి మిత్రులు నేను బ్రిటీషు దీవులలో "ఉన్నత విద్య" నభ్యసించి "ఉన్నత పదవిని" పొందు

తానని ఆకాంక్ష అయివుండాలి. కాని నాకే తెలియదు. ద్ధాంతాల్లో ఉన్నత సిద్ధాంతమగు శాస్త్రీయ కమ్యూనిజం స్వీకరిస్తానని, పాలకవర్గాల చేతుల్లో జైళ్ళపాలవుతానని, ధనిక వర్గాల చేతుల్లో ఎన్నికల్లో తీవ్రపోటీ బడతానని అదే నా ఉన్నత స్థానమని నా అభిమానులకు తెలియదు. వాళ్ళ దీవనల అంతరార్థము వాళ్ళకు తెలియలేదు. దాని ఫలితం నాకు మంచికే జరిగిందంటాను, లేకపోతే నా చదువు నా అన్వేషణ వృథా అయ్యేవి.

స్టీమరులో నా తండ్రి నన్ను కూర్చోబెట్టి తన శిరస్సుతో నా శిరస్సు తాకి నన్ను దీవించి సాగనంపారు. మానవ సముదాయాన్ని అర్థం చేసుకోడానికి నా తండ్రి దీవనలుపయోగపడ్తాయంటాను.

బొం. బాయి హార్బరు నుండి స్టీమరు మలోజా కదలింది. అది పెద్ద స్టీమరు. అదొక చిన్న పట్టణమువలె సముద్రంమీద కదులుతూంది. అన్ని సదుపాయాలు దానిలో నిండివున్నాయి.

స్టీమరులో మొదటి తరగతి ప్యాసింజర్లకు మనిషికి ఒక ప్రత్యేక కేబిన్ (ఉండేగది) వుంది. రెండవ తరగతిలో B, C, విభాగాలున్నాయి. ఆ విభాగాన్నిబట్టి రెండు నుంచి ఎక్కువ ప్యాసింజర్లు వుంటారు. రెండవ తరగతి ర్జీలు తక్కువ.

ప్రయాణికులు కూర్చోడానికి, ఏరోజు కారోజు న్యూస్ లిటినులు చదువుకోడానికి పెద్ద హాలు వంటిది వున్నది.

తానని ఆకాంక్ష అయివుండాలి. కాని నాకే తెలియదు. సిద్ధాంతాల్లో ఉన్నత సిద్ధాంతమును శాస్త్రీయ కమ్యూనిజం స్వీకరిస్తానని, పాలకవర్గాల చేతుల్లో జైత్యపాలవుతానని, ధనిక వర్గాల చేతుల్లో ఎన్నికల్లో తీవ్రపోటీ బడతానని అదే నా ఉన్నత స్థానమని నా అభిమానులకు తెలియదు. వాళ్ళ దీవనల అంతరార్థము వాళ్ళకు తెలియలేదు. దాని ఫలితం నాకు మంచికే జరిగిందంటాను, లేకపోతే నా చదువు నా అన్వేషణ వృధా అయ్యేవి.

స్టీమరులో నా తండ్రి నన్ను కూర్చోబెట్టి తన శిరస్సుతో నా శిరస్సు తాకి నన్ను దీవించి సాగనంపారు. మానవ సముదాయాన్ని అర్థం చేసుకోడానికి నా తండ్రి దీవనలుపయోగపడ్డాయంటాను.

బొంబాయి హార్బరు నుండి స్టీమరు మలోజా కదలింది. అది పెద్ద స్టీమరు. అదొక చిన్న పట్టణమువలె సముద్రంమీద కదులుతూంది. అన్ని సదుపాయాలు దానిలో నిండివున్నాయి.

స్టీమరులో మొదటి తరగతి ప్యాసింజర్లకు మనిషికి ఒక ప్రత్యేక కేబిన్ (ఉండేగది) వుంది. రెండవ తరగతిలో A, B, C, విభాగలున్నాయి. ఆ విభాగాన్నిబట్టి రెండు నుంచి ఎక్కువ ప్యాసింజర్లు వుంటారు. రెండవ తరగతి చార్జీలు తక్కువ.

ప్రయాణీకులు కూర్చోడానికి, ఏరోజు కారోజు న్యూస్ బులిటినులు చదువుకోడానికి పెద్ద హాలు వంటిది వున్నది.

రెండు వెళ్ళి ఎడిన్‌బరోకు చేరుకొంటాడు. మా స్టిమరులో అప్పుడు ఈయన ఒక్కరే భారతీయ ప్రయాణికుడు. బ్రిటనుకు ప్రయాణములో పాత అనుభవమున్నవాడు. అయితే ఈయన మూడు వారాలు స్టిమరులో ప్రయాణంచేసి లండను చేరుతాడు. అది ఖర్చు తక్కువగుతుంది. ఈయన రెండవదఫా సముద్రంపైన ప్రయాణం చేస్తున్నా, సముద్రప్రయాణం అంతగా ఈయనకు పడదు. సముద్రపు పరిస్థితినిబట్టి ఈయనకు సముద్ర వికారము (Sea sickness) వచ్చేది. ఆ సమయంలో వాంతులు వస్తాయి. ముందు ప్రయాణంలో తాను యీ బాధపడ్డానన్నాడు అతనికి నిమ్మకాయ పచ్చడి యిష్టమనుట వికారము కలిగినప్పుడు యీ పచ్చడి తీసుకోడానికి యింటివద్ద నుండి తెచ్చుకొన్నాడు

స్టిమరులో మరో పరిచయము ఒక ఫ్రెంచి స్త్రీ ఆమె సింగపూరు నుండి బయలుదేరుతున్నట్లు చెప్పినట్లు గుర్తు ఈమె మొదటి తరగతిలోనే ప్రయాణం చేస్తుంది ఈమె కబుర్లు ఎక్కువ చెప్పేది.

మా స్టిమరు రెండు రోజుల ప్రయాణం తర్వాత ఏడెన్‌పోర్టు చేరింది. ఎడెన్ చూడడానికి స్టిమ్‌షిప్ కంపెనీ పి అండ్ ఓ ట్రిప్పు ఏర్పాటు చేసింది స్టిమరు రాత్రి వేళ చేరింది. ఏడెన్ రేవులోదిగి పట్టణాన్ని చూడడానికి ఆ ట్రిప్పులో నేను చేరాను, ఏడెన్‌లోని అద్భుతమైన పుష్ప

తెంబు వెళ్ళి ఎడిన్‌బరోకు చేరుకొంటాడు. మా స్టిమరులో అప్పుడు ఈయన ఒక్కరే భారతీయ ప్రమాణికుడు. బ్రిటనుకు ప్రయాణములో పాత అనుభవమున్నవాడు. అయితే ఈయన మూడు వారాలు స్టిమరులో ప్రయాణంచేసి లండను చేరు తాడు. అది ఖర్చు తక్కువగుతుంది. ఈయన రెండవదపా సముద్రింపైన ప్రియాణం చేస్తున్నా, సముద్రప్రయాణం అంతగా ఈయనకు పడదు. సముద్రపు పరిస్తితినిబట్టి ఈయ నకు సముద్ర వికారము (Sea sickness) వచ్చేది. ఆ సమ యంలో వోకులు వస్తాయి. ముందు ప్రయాణంలో తాను యీ బాధపడ్డానన్నాడు అతనికి నిమ్మకాయ పచ్చడి యిష్టమట వికారము కలిగినప్పుడు యీ పచ్చడి తీసుకోడానికి యింటివద్ద నుండి తెచ్చుకొన్నాడు

స్టిమరులో మరో పరిచయము ఒక పైంచి స్త్రీ ఆమె సింగపూరు నుండి బయలుదేరుతున్నట్లు చెప్పినట్లు గుర్తు ఈమె మొదటి తరగతిలోనే ప్రయాణం చేస్తుంది ఈమె కబుర్లు ఎక్కువ చెప్పేది.

మా స్టిమరు రెండు రోజుల ప్రయాణం తర్వాత ఏడెన్‌పోర్టు చేరింది. ఎడెన్ చూడడానికి స్టిమ్‌షిప్ కంపెనీ పి అండ్ ఓ ట్రిప్పు ఏర్పాటు చేసింది స్టిమరు రాత్రి వేళ చేరింది. ఏడెన్ రేవులోదిగి పట్టణాన్ని చూడడానికి ఆ ట్రిప్పులో నేను చేరాను, ఏడెన్‌లోని అద్భుతమైన పుష్ప

తోటలు చూచి చాల సంతోషించాను, స్టీమరు బయలు దేరేముందు ఆ రాత్రి చేరుకొన్నాము.

బొంబాయి నుండి అరేబియా సముద్రందాటి ఏడెన్ రేవు చేరేటప్పటికి అరేబియా దక్షిణభాగము దగ్గరనుండి ప్రయాణం సాగింది. ఏడెన్ దాటినతోడనే ఎర్రసముద్రం ప్రవేశించాము.

సముద్రంలో ప్రయాణం చేస్తూ ఏవైపు చూచినా నీటిమయం పరికిస్తే మరొక అద్భుతమైన దృశ్యము. స్టీమరు నీటిపై పయినిస్తున్నప్పుడు ఆకాశంవైపు చూడడము ఒక బ్రహ్మాండమగు గొడుగు మాపై అమర్చినట్లు అనిపించింది. సూర్యచంద్రాదులను నీటిమీద ప్రయాణం చేస్తూ వాట్ల గమనాన్ని పరికించడము నాకు సరదా అనిపించింది.

సృష్టిలోని వస్తుసముదాయాన్ని చూచి ఆనందించే వాడినేకాని దానికి పరవశుడనయ్యేవాడినికాదు. ఈ విశ్వం లోని గోళాలను ఊహించవలసింది మానవుడు. ఆ మానవుడు కూడా యీ విశ్వంలోని కోట్లాది గోళాలలో ఒక గోళముా (భూగోళము) పైనే వున్నాడు. ఇతర గోళాలలో ఎక్కడ ఏ ప్రాణి వున్నదీ మనకు ప్రస్తుతానికి తెలియదు. తనకున్న కొలతబద్దలతో ఏ వూహనైనా మనిషి చేయవచ్చు. దానికి తగిన ఆధారాలు బయలుదేరాలి.

నా ఆలోచనలన్నీ భూమిమీద మనిషి నైతిక ప్రవృత్తిపైనే కేంద్రీకృతమైనాయి. సముద్రంపై ప్రయాణం చేస్తూ, పాశ్చాత్యులతో కలసి వుంటూ అప్పటి నా చిన్న వయస్సులో మానసిక తత్వదోరణి మనిషి ఎక్కడికి పయనిస్తున్నాడు అనేదే. దీనిలో నా స్థానమేది అన్వేషణే. నేను చిన్నవయస్సు నుండి ఆశావాదిని, మనుష్యజాతి ఉత్తమ పంధానే స్వీకరిస్తుందని నా దృఢవిశ్వాసము. అందుకై కష్టాలనే ముందు ముందు స్వీకరించాను. సౌఖ్యం పొందితే భయమేసేది.

సముద్రంపై ప్రయాణం చేస్తూ నా ఆలోచనలు వివిధ పరిధులలో సాగాయి. నా తత్వానికి కుదిరిన తోడి ప్రయాణికుల గురించి ప్రయత్నించలేదు. డెక్కుపైన కలసి తిరగడానికి కాని, వాతావరణ గురించి మాట్లాడడానికి కాని, డెక్కుపై ఈత కొలనులో (Swimming pool) ఈదడానికి నాకు పాశ్చాత్య ప్రయాణికులు సహచరులైనారు.

మా స్టీమరు ఎర్ర సముద్రంలోకి ప్రవేశించింది. ఎర్ర సముద్రం ఎర్రగా వుండదు పేరుమాత్రం ఎరుపు. ప్రధాన సముద్రాలలో ఎర్ర సముద్రము ఒకటి. ఎర్ర సముద్రం వంటి ముఖ్య సముద్రాలు 16 వున్నాయి. వీట్ల వైశాల్యం మహా సముద్రాలతో పోల్చడానికి వీలులేదు. ఎర్రసముద్రము వైశాల్యము 169 వేల స్క్వేరు మైళ్ళు మాత్రమే. ఎర్రసముద్రా

నికి ఒకవైపు ఆఫ్రికా తూర్పు తీరము వేరొకవైపు అరేబియా పశ్చిమ తీరముండి.

ఎర్రసముద్రం నా స్టీమరు పూర్తిగా ప్రయాణంచేసి, సూయజ్ కాలువ ప్రవేశించే ముందు సూయజ్ రేవు చేరుకుంది. ఈజిప్టు ముఖ్య పట్టణం కెయిరో చూడవలసినవారిని అక్కడ దింపి, ఆ యాత్రకై (Excursion) ఏర్పాట్లకు స్టీమ్‌షిప్ కంపెనీమనిషికి 6 పౌన్లు 5 షిల్లింగులు చార్జీ చేసింది. అప్పటి డబ్బు విలువకు యిది ఎక్కువే కాని నాకు డబ్బు విలువ అప్పుడుకాని యిప్పుడుకాని తెలియదు. ఫరో తన దేశమగు ఈజిప్టు, దాని ముఖ్య పట్టణం కెయిరో అక్కడ ప్రపంచ ప్రసిద్ధి పిరమిడ్సులను చూడడానికి వుత్సాహపడ్డాను.

మేము స్టీమరు దిగినతోడనే స్టీమరు సూయజ్ కాలువగుండా ప్రయాణంచేసి సూయజ్ కాలువ చివర భాగం లోని పోర్టుసెడ్ చేరుకొంటుంది. అక్కడికి మా బృందము కెయిరో నుండి రైలులో బయలుదేరి ఆ రోజు రాత్రికి పోర్టుసెడ్ చేరుకుంటాము. మా స్టీమరు ఎక్కి ప్రయాణం సాగిస్తాము. ఇవి స్టీమరు కంపెనీవారి ఏర్పాట్లు.

సూయజ్‌లో దిగిన మా బృందములో నేను బాగా చిన్నవాడిని, ఫ్రెంచి స్త్రీ ప్రయాణికురాలు వున్నది ఆమె వృద్ధురాలు. ఇక మిగతావారు కొందరు పురుషులు, స్త్రీలు

ఈజిప్టు పురాతన నాగరికత 6 వేల సంవత్సరాల నుండి దాని చరిత్రి వివరాలున్నాయి. 5 వేల సంవత్సరాల క్రితము ఈజిప్టు నంతటినీ ఏకంచేసి ఏకదాటిగా ఫెరోవాలు పరిపాలించారు.

తదుపరి అనేక పాశ్చాత్య పాలకులు, రోము చక్రవర్తులు, ఒమయాద్ కలీఫ్‌లు, ఓట్టొమన్ టర్కు పాలకరాజరికాలు, బ్రిటీషు సామ్రాజ్యవాదులు ఈజిప్టుపై ఆధిపత్యం చెలాయించారు. భారతదేశంపైన క్రీస్తుపూర్వము 326 B C లో దండయాత్రి చేసిన అలెగ్జాండరు ఆరు సంవత్సరాల ముందు ఈజిప్టును జయించాడు.

5 వేల సంవత్సరాలక్రితము ఫిరోవాల వంశము ఈజిప్టును పాలించి, వారి నాలుగవ వంశీయులు ప్రపంచ ప్రసిద్ధికెక్కిన పిరమిడ్డులను మొత్తం 70 కట్టించారు. పిరమిడ్డు పిరోవాల రాజవంశీయుల గోరీలు, ఈ పిరమిడ్డు రాళ్ళతో ఒకదానిపై ఒకటి పేర్చి చక్కని శిలానైపుణ్యంతో కోణాకారంలో వేల సంవత్సరాలక్రితము కట్టినవి చెక్కుచెదరకుండా వున్నాయి. చివరకు రాజరికపాలక వర్గాలకు మిగిలేది గోరీలే అని ఫెరోవాలు చాటదలచారన్నమాట.

ప్రపంచ సప్తమ అద్భుతాలలో యీ పిరమిడ్డు ఒకటి. మా ప్రయాణీకుల బృందము డిసెంబరు 18, 1932లో పిరమిడ్డు చూచి, అక్కడ ఒంటెలపైన కొంత స్వారీ

ఈజిప్టు పురాతన నాగరికత 6 వేల సంవత్సరాల నుంచి దాని చరిత్ర వివరాలున్నాయి. 5 వేల సంవత్సరాల క్రితము ఈజిప్టు సంతతినీ ఏకంచేసి ఏకదాటిగా ఫెరోవాలు పరిపాలించారు.

తదుపరి అనేక పాశ్చాత్య పాలకులు, రోము చక్రవర్తులు, ఒమయాద్ కలీఫ్‌లు, ఓట్టామన్ టర్కీ పాలకరాజరికాలు, బ్రిటీషు సామ్రాజ్యవాదులు ఈజిప్టుపై ఆధిపత్యం చెలాయించారు. భారతదేశంపైన క్రీస్తుపూర్వము 326 B C లో దండయాత్ర చేసిన అలెగ్జాండరు ఆరు సంవత్సరాల ముందు ఈజిప్టును జయించాడు.

5 వేల సంవత్సరాలక్రితము ఫిరోవాల వంశము ఈజిప్టును పాలించి, వారి నాలుగవ వంశీయులు ప్రపంచ ప్రసిద్ధికెక్కిన పిరమిడ్సును మొత్తం 70 కట్టించారు. పిరమిడ్సు పిరోవాల రాజవంశీయుల గోరీలు, ఈ పిరమిడ్సు రాళ్ళతో ఒకదానిపై ఒకటి పేర్చి చక్కని శిలానైపుణ్యంతో కోణాకారంలో వేల సంవత్సరాలక్రితము కట్టినవి చెక్కుచెదరకుండా వున్నాయి. చివరకు రాజరికపాలక వర్గాలకు మిగిలేది గోరీలే అని ఫెరోవాలు చాటదలచారన్నమాట.

ప్రపంచ సప్తమ అద్భుతాలలో యీ పిరమిడ్సు ఒకటి. మా ప్రయాణీకుల బృందము డిసెంబరు 18, 1982లో పిరమిడ్సు చూచి, అక్కడ ఒంటెలపైన కొంత స్వారీ

చేసి ఫొటోలు తీయించుకొన్నాము. అందులో 450 అడుగుల ఎత్తున్న చియాప్స్ పిరమిడ్స్ చూస్తున్న నా ఫొటో అలా అర్ధశతాబ్దం వున్నది. నేను పాశ్చాత్యదేశం ప్రయాణం చేస్తు వేల సంవత్సరాలక్రితము రాజరికం చేసిన ఫెరోవాల ప్రసిద్ధి గోరీలు (పిరమిడ్స్) కెయిరో సమీపంలో ప్రథమంగా చూడడం ఒక ప్రత్యేకత అని జ్ఞాపకం చేసుకొంటున్నాను. తరువాత నా దేశ స్వాతంత్ర్య పోరాటంలో నిమగ్నమైన నేను సామ్రాజ్యవాద విధానానికి గోరీని కట్టడం చూడగలిగాను.

భారతదేశంపై ఆధిపత్యం కొనసాగిస్తున్న బ్రిటీషు సామ్రాజ్య పరిపాలనా విధానమే ఈజిప్టు పైనా 1932 లో కొనసాగిస్తూంది. దాని వ్యాప్తి పద్ధతులు తేడాలాని ప్రజలను పీడించడములో తేడా లేదు. ప్రపంచములో బ్రిటీషు సామ్రాజ్య విధానము నలుమూలల వ్యాపించివున్నది. 60 కోట్ల (600 మిలియన్లు) ప్రపంచ ప్రజలపై వలసపెత్తందారీ విధానాన్ని బ్రిటీషు సామ్రాజ్య వాదులు చెలాయిస్తున్న కాలమది. ఆసియా దేశాల్లోని భారతదేశం, బర్మా, సిలాన్ పాలస్తీనా జోర్డాన్ ఆఫ్రికా ఖండములోని ఈజిప్టు, సూడాన్, గోల్డు కోస్టు నైజీరియా, బ్రిటీషు సోమాలీలాండ్, సైరలియోన్, టాంగనీకా, ఆగ్నేయ ఆసియాలోని మలేయా, మధ్యధరా సముద్రంలోని సైప్రస్, యూరపులోని ఐర్లండ్ లు బ్రిటీషు పాలకుల చేతుల్లో వున్నాయి. సుమారు 44 లక్షల 93 వేల

చతురపు మైళ్ళ ప్రపంచ భూభాగముపై బ్రిటీషు సామ్రాజ్య వాదం పెత్తనం చెలాయిస్తూంది.

ఆసియాలోని భారత భూఖండంపై ఆర్థికంగా దోపిడీ సాగిస్తున్న బ్రిటీషు కాపిటలిస్టు పాలకులకు సూయజ్ కాలువ మార్గము తమ కవాటా విధానానికి ఒక ఆయువుపట్టు; 1878లో సూయజ్ కాలువకు బ్రిటీషు పాలకులు 40 లక్షల పౌనుల షేర్లు కొని స్వాధీనం చేసుకొన్నారు.

మా ప్రయాణికుల బృందము ఈజిప్టులో ఉదయం నుంచి చీకటిపడేవరకు వున్నాము కెయిరో నుండి రైలులో పోర్టుసెడ్ వచ్చాము. 100 మైళ్ళ సూయజు కాలువ పయ నించి పోర్టుసెడ్‌లో మా స్టీమరు సిద్ధంగావుంది.

రాత్రి భోజనం స్టీమరులో చేసాము. స్టిమరులో భోజన సదుపాయానికి కొరత ఏమీ వుండదు కాని, నేను యీ ప్రయాణానికి ముందే స్టిమరు ఏజెంట్లు తామస్ కుక్ అండ్ సన్సు వారికి వ్రాసి నాకు శాకాహారాలే కావాలని తెలిపి ప్రత్యేకంగా ఏ రూపంలోనూ మాంసాది హారాలతో కల్తీ లేకుండా భోజన సదుపాయము చేయాలని కోరాను. అన్ని రకాల భోజన పదార్థాలు ఇండియను పద్ధతి యింగ్లీషు పద్ధతిలో కూరలు వగైరాలు మా భోజనానికి తయారయ్యేవి మెనూ (menu) ప్రకారం యిష్టం వచ్చిన సరకు కోరే వారము. అయితే ఆ రోజు రాత్రి భోజనానికి నా భోజన

టేబిలు దగ్గరకు మా స్టివార్డు (Steward, భోజనం అందవేసే స్టీమరు మనిషి) మంచి అప్పడాలు కూడా తెచ్చాడు. యివి ఎక్కడివి అని స్టివార్డును అడిగాను. స్టాకులోనివే మీకోసం వేపించి పంపారు అన్నాడు. ఉత్సాహంతో తినడానికి మొదలు పెడితే అప్పడాలు వుప్పుచేప వాసన కొట్టాయి. నా శాకాహార అహింసా వ్రతము చెడిందనుకొన్నాను. హెడ్ స్టివార్డును దగ్గరకు పిలిపించి శాకాహారుడనని చెబితే వుప్పు చేపల వాసనతోవున్న అప్పడాలు ఎందుకు పంపావన్నాను. బహుశా వుప్పుచేపలు వేపిన పెనములో ఆ అప్పడాలు వేపడం జరిగిందేమో అని క్షమాపణ కోరుకొన్నాడు.

పోర్టుసెడ్ దాటి నా స్టిమరు మధ్యధరా సముద్రము ప్రవేశించింది.

స్టీమరు నుండి ఉత్తరాలు నా తండ్రికి, నా భార్యకు వ్రాసేవాడిని. ఈజిప్టు వద్ద పోర్టుసెడ్ వచ్చేవరకు రెండు దఫాలు వ్రాసాను చిన్న వయస్సు నుండి నాకు దినచర్యలు (Diary) వ్రాయడం అలవాటు. ప్రయాణంలో కూడా వ్రాస్తుండేవాడిని. ముందు ముందు నా జీవితం చాల ఒడిదుడుకులతో యిమిడివుండడం వలన నా డైరీలు అన్నీ లేవు. నా పుస్తకాలు కూడా నా దగ్గర నుండి పారిపోకుండా మిగిలిన వాట్లబట్టి, నా జ్ఞాపకార్థము నా కథలింకులు తెలుసుకొంటాను.

నా ప్రయాణం బాపతు వ్రాసుకొన్న దినచర్య పుస్తకాలన్నీ పోయాయి. కాని ప్రయాణం ప్రారంభించి నప్పటి నుండి లండనులో నివాసం ఏర్పర్చుకొన్న ఒక సంవత్స రం కాలపు అక్కౌంటు పుస్తకం ఆశ్చర్యంగా అలాగే వున్నది. తదుపరి నా ఆఖరి తమ్ముడు డాక్టరు రమణమూర్తి తన చిన్నతనంలో గీసిన గీతలతో వున్నది. ఈ 53 సంవత్స రాల నుండి (1985) యీ పుస్తకం నన్ను విడవనంటుంది.

దానినుండే ప్రయాణానికి సంబంధించిన దినచర్య వివ రాలు కొంత జ్ఞాపకానికి తెచ్చుకోగలిగాను. నా కేబిన్ నెంబరు 170 అని నా కేబిన్ స్టీవార్డు పేరు ఎల్లిస్ బాత్ బాయి అని, నాకు భోజనం వడ్డించే భోజనహాలు స్టీవార్డుకు, అక్కడున్న హెడ్ స్టీవార్డుకు సుమారు 1½ పౌనుల యింగ్లీషు డబ్బు బహుమతి స్టీమరు నుండి దిగినప్పుడు యిచ్చినట్లు నా పుస్తకంలో వుంది. నా కేబిన్‌లో కాబిన్ స్టీవార్డు పేరుం డుండికనుక దాన్ని నోటుచేసి వుంటాను. నేను స్టీమరు నుండి వుత్తరాలు వ్రాసినట్లు తెలుసుకోడానికి స్టీమరులో 1½ పెన్నీ స్టాంపులు 27 కొన్నట్లు నా అక్కౌంటులో వున్నది, నేను యింటికి వ్రాసిన వుత్తరాలు స్టీమరులోని పోస్టుబాక్సులో నే వదవేయగా ఆ వుత్తరాలను ఒక పోర్టులో ఆగినప్పుడు అక్కడ్డి నుండి యింటికి బట్వాడా అయ్యేవి. ఆ రోజుల్లో వుత్తరాలకు విమానా బట్వాడా వుండేది.

స్టీమరు ప్రయాణంలో ఖర్చుకు నావద్ద 10 పౌనులుం

చేతిలోనూ, 30 పౌనులు ప్రయాణికుల చెక్కులలోనూ వున్నాయి. నాతో కెమేరా కూడా ప్రయాణంలో తీసుకు వెళ్ళాను. దానితో తీసిన ఫొటోలు స్టీమరులోనే డెవలప్ చేయించి ప్రింటులు తీయించినందుకు 4 షిల్లింగులు 3 పెన్నీలు యిచ్చినట్లు వ్రాసుకొన్నాను. కెయిరోలో పిరమిడ్సు వద్ద దానితో తీసిన ఫొటో మాత్రమే ప్రయాణం బాపతుది నా దగ్గర మిగిలింది.

పోర్టుసెడ్ నుండి స్టీమరు మెలోజా మార్సెలు రేవు 5 రోజులకు చేరింది. మార్సెలు ఫ్రాన్సు దక్షిణ ప్రాంతములో మధ్యధరా సముద్రంలోని పెద్ద రేవుపట్టణము అది పారిశ్రామిక నగరం కూడాను.

మార్సెలు చేరినతోడనే నేను భోజన సెలూన్‌లో వుండగా, ఫ్రాన్సులోని వ్యాపార ఏజెంటు రెనీమొహార్తు నా దగ్గరకు వచ్చాడు. ఆయన పొడుగుపాటి మనిషి 50 సంవత్సరాలుంటాయి ప్రెంచి దేశస్థుడైనా యింగ్లీషు మాట్లాడుతాడు. నన్ను ఆప్యాయతతో పలకరించి మా తండ్రి నుండి తనకు వచ్చిన ఉత్తరం చూపించాడు. మార్సెలులో దిగిన తర్వాత నన్ను తన కూడా లండను తీసుకు వెడతానన్నాడు.

రెనిమొహార్తు నాకు మార్సెలు పట్టణమంతా చూపించారు. మా తండ్రి ఎగుమతిచేసే క్రిస్సెను బోన్సు తాను

రైల్వే స్టేషను నుంచి లండనులోని 112 గవర్సు వీధిలో నున్న ఇండియను స్టూడెంట్సు హాస్టలులో నాకు రిజర్వు చేయించిన గదిలోకి తీసుకు వచ్చారు. నాది 40 వ గది ఆ హాస్టలులో అందరూ ఇండియన్లే. నికల్సు తన ఎడ్రెసు యిచ్చి, నాకే అవసరమున్నా వారి కంపెనీ నికల్సు అండ్ నికల్సుకు ఫోను చేయమని సంకోచించవద్దని కోరారు. నాకు ప్రతీనెల 30 పౌనులు అందచేయమని నా తండ్రి వ్రాసారని అలాగ ప్రతి ఒకటవ తేదీకి ఆ డబ్బు చెక్కు పంపుతామని నికల్సు చెప్పి తన ఆఫీసుకు వెళ్ళిపోయారు.

లండనులోని నికల్సు అండ్ నికల్సు కంపెనీకి నా తండ్రి కాకినాడ రేవు నుండి సరుకులు ఎగుమతి చేయడం, ప్యారిస్సులోని ఫ్రెంచి వ్యాపారి రెనీమొహర్తుకు కూడా సరుకులు ఎగుమతి చేయడం ద్వారా లాభాలు సంపాదించేవారు. ఆ లాభాల ఫలితం నుండే నా యూరపు ప్రయాణానికి లండనులో నా పరిశోధనా జీవితానికి అవకాశము కల్పించిందని చెప్పాలి.

అయితే యూరపు గడ్డపై దిగినతోడనే ఫ్రెంచి వ్యాపారి రెనీమొహర్తు నన్ను ఆహ్వానించడము ఇండియాలో సుమారు రెండు శతాబ్దాల పూర్వము ఫ్రెంచి ఈస్టుఇండియా కంపెనీ బ్రిటీషు ఈస్టుఇండియా కంపెనీలు స్థావరాలను ఏర్పర్చుకొని చివరకు 1760 లో బ్రిటీషు ఈస్టుఇండియా కంపెనీ

రైల్వే స్టేషను నుంచి లండనులోని 112 గవర్సు వీధిలో నున్న ఇండియను స్టూడెంట్సు హాస్టలులో నాకు రిజర్వు చేయించిన గదిలోకి తీసుకు వచ్చారు. నాది 40 వ గది ఆ హాస్టలులో అందరూ ఇండియన్లే. నికల్సు తన ఎడ్రెసు యిచ్చి, నాకే అవసరమున్నా వారి కంపెనీ నికల్సు అండ్ నికల్సుకు పోను చేయమని సంకోచించవద్దని కోరారు. నాకు ప్రతీనెల 30 పౌనులు అందచేయమని నా తండ్రి వ్రాసారని అలాగ ప్రతి ఒకటవ తేదీకి ఆ డబ్బు చెక్కు పంపుతామని నికల్సు చెప్పి తన ఆఫీసుకు వెళ్ళిపోయారు.

లండనులోని నికల్సు అండ్ నికల్సు కంపెనీకి నా తండ్రి కాకినాడ రేవు నుండి సరుకులు ఎగుమతి చేయడం, పారిస్సులోని ఫ్రెంచి వ్యాపారి రెనీమొహర్తుకు కూడా సరుకులు ఎగుమతి చేయడం ద్వారా లాభాలు సంపాదించేవారు. ఆ లాభాల ఫలితం నుండే నా యూరప్ప ప్రయాణానికి లండనులో నా పరిశోధనా జీవితానికి అవకాశము కల్పించింది అని చెప్పాలి.

అయితే యూరప్పు గడ్డపై దిగినతోడనే ఫ్రెంచి వ్యాపారి రెనీమొహర్తు నన్ను ఆహ్వానించడము ఇండియాలో సుమారు రెండు శతాబ్దాల పూర్వము ఫ్రెంచి ఈస్టుఇండియా కంపెనీ బ్రిటీషు ఈస్టుఇండియా కంపెనీలు స్థావరాలను ఏర్పర్చుకొని చివరకు 1760 లో బ్రిటీషు ఈస్టుఇండియా కంపెనీ

ఇండియాపై తన ఆధిపత్యాన్ని స్థిరం చేసుకోడం ఆ చారిత్రిక విషయాన్ని జ్ఞప్తికి నేను తెచ్చుకొన్నాను. ఇక ఇంగ్లాండులోని ఇంగ్లీషు వ్యాపార కంపెనీ ప్రతినిధి నికల్సును నన్ను ఫ్రెంచి వ్యాపారి రెనీమొహార్తు పరిచయంచేసి వెళ్ళిపోవడం తదుపరి చరిత్ర అవగాహనకు నాకు ఒక తాత్పర్యమున్నదని చెప్పాలి. ఒక బ్రిటీషు సామ్రాజ్యవాద ఆధిపత్యం కిందవున్న నా భారత దేశం నుండి ఆ పాలకవర్గ స్వస్థలమగు బ్రిటీషు దీవులలోకి వచ్చాను. దాని ప్రధాన కేంద్రమగు లండనులో నివాసం వచ్చింది.

నా జీవితంలో కొన్ని ఘటనలు వాట్ల ప్రభావమూ జీవిత యాత్రిలో ముందు ముందు మైలురాళ్ళు అయినా అవి అప్పటికప్పుడే పూర్తి అర్థాన్ని విశదీకరించవు.

నా దేశం ఫ్యూడలు భూస్వామిక అర్థికవ్యవస్థ, రాజకీయంగా వలసదేశం. ఆ సమాజంలో నా చదువు పూర్తకాగానే 2 శతాబ్దాలు భారతదేశ సంపదను దోచుకొంటున్న సామ్రాజ్యవాద దేశంలోకి ప్రవేశించడం, మానవ జాతి వ్యవస్థను అవగాహన చేసుకోడానికి నూతన చైతన్యానికి అవకాశం కలిగిందనాలి.

# లండను నివాసము
# 1932 - 1937

డిసెంబరు 24, 1932 న లండను ఇండియన్ స్టూడెంట్సు హాస్టలులోకి వచ్చినతోడనే నా మొదటి భోజనము రాత్రి డిన్నర్. అప్పటివరకు యస్ యస్ మలోజా స్టీమరులో 14 రోజులు భోజనాలు చేసాను. అక్కడ రెండురకాల వంటకాలు రుచి చూచిన తర్వాత యీ మార్పు. అయితే శాకాహారమే అప్పటి నా ఆహారము; యింగ్లీషు సూపులు (రసం) కాయగూర సెలాడులు (తినడానికి వీలైన పచ్చికూరల మిశ్రమము ఒక రకం వెన్నతో కలిపింది) అన్నమూ, వండిన కాయకూరలు, పళ్ళు తిన్నాను. స్టీమరులో మాత్రము అన్నమూ మినహా కూరకాయల వంట మాత్రము మన వంటల లాగ లేవు.

యిక ఇండియన్ స్టూడెంటు హాస్టలులో నా మొదటి భోజనంలోనే సాంబారు, రసం, మసాలాలతో కాయ కూరలు, పెరుగు వగైరాలు లభ్యమైనాయి. అయితే మాంసాహారము తినేవారికి కూడా అన్ని రకాల ఇండియన్ వంటకాలు హాస్టలు భోజనశాలలో లభ్యమయ్యేది. అక్కడ హాస్టలులో విడిదవున్న భారతీయులుకాక, లండనులో వున్న యితరులు భోజనానికి వచ్చేవారు. హాస్టలు దిగువ భాగంలో పెద్ద భోజనశాల వున్నది. హాలు డిగువ బేసి

మెంబులో వంటశాల వున్నది. అక్కడ వంటలన్నీ తయా రవుతాయి.

ఆ రాత్రి భోజనశాలలో నేను భోజనం చేస్తుంటే అందరూ భారతీయులే కనపడ్డారు లండను చేరినట్లు నాకు లేదు ఇండియాలో వున్నట్లే అనిపించింది. కాని స్టీమ రులో మాత్రము నాతో భోజన సెలూనులో అందరూ యూరోపియనులు అందులో ఎక్కువగా బ్రిటీషు వాళ్లు వడ్డించేవారు (స్టీ వార్డు) వంటచేసేవారు అందరూ బ్రిటీషువాళ్ళే (ఆ స్టీమరు బ్రిటీషు కంపెనీది కనుక) కాని లండను ఇండి యన్ హోస్టలులో హోస్టలు కార్యదర్శి మొదలుకొని వంటచేసేవారు, వడ్డించేవారు, భోజనం చేసేవారు అందరూ భారతీయులే. భోజనానికి మాత్రము కూడా తీసుకు వచ్చిన ఇంగ్లీషు అతిథులు వుండవచ్చు.

స్టీమరు ఎక్కినప్పటినుంచి నేను ఒక్కడినే అయి పోయాను. ఇంటివద్ద ఇల్లు కదలితే లేక ఏదైనా వూరు వెడితే కావలసినవారు వుండేవారు. లండనులోని హోస్టలు లోకి వచ్చేటప్పటికి భారతీయుల మధ్య పడ్డాను అయినా అందరూ కొత్తవాళ్ళే.

24.వ తేదీ రాత్రి నా భోజనం టేబిలు దగ్గర నలుగు రున్నాము. నేను బొజన లిస్టు చూచి (menu) భోజన పదా ర్దాలు తెచ్చే మనిషి (waiter) తో నాకు కాయకూర వంట పదార్థాలే కావాలని చెప్పి నేను అడిగిన పదార్థాలలో

మాంసాదులు వుంటె చెప్పమని కోరి ఆర్డరు చేసాను. నా టేబిలు దగ్గర పక్కనే కూర్చొనివున్న ఒక భారతీయుడు కోడి మాసం మొదలగు **(non-vegetarian)** పదార్థాలు ఆర్డరుచేసి నా వంక చూచాడు. నా కంటె ఆయనకు 5, 6 సంవత్సరాలు ఎక్కువ వుంటాయి. బాగా సూటు వేసుకొన్నాడు టిప్‌టాప్‌గా వున్నాడు. నా సూటు అప్పటికి ఇండియాలో కుట్టించినదే వేసుకొన్నాను. నా భోజన సహచరుని డ్రెస్సుతో పోలిస్తే నాది లండను తయారైన సూటుగా కనపడదు. వెంటనే అతడు పసిగట్టి "యిప్పుడే వచ్చారా?" ఎక్కడి నుంచి వచ్చారురి?" అన్నాడు. నేను మద్రాసు రాష్ట్రం (అప్పుడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రమే ఉండేది) నుంచి వచ్చానని ఆంధ్రుడనని చెప్పాను. ఆయన ఏ రాష్ట్రమో నాకు తెలియదు యిద్దరమూ ఇంగ్లీషులోనే మాట్లాడుకొన్నాము, మా భోజనాలు వచ్చినమీాదట నేను కాయకూరలు తినడం చూచి "మీారు బ్రాహ్మనులా" అన్నాడు. "కాదు నేను నాన్ బ్రాహ్మణుడ"నన్నాను. "అయితే కాయకూరలు తినడమేమిటయ్యా" అని నన్ను హెచ్చరించి మిగతా యిద్దరు టేబిలు సహచరులతో "ఈయన నాన్ బ్రాహ్మణుడు చూడండి. కాయకూరలు తింటున్నాడు" అని అన్నాడు. అతను వేళాకోళం చేయడానికి అన్నాడో లేక నేను ఏదో తప్పుచేసానని అన్నాడో నాకు అర్థం కాలేదు. అయినా వాళ్ళ మధ్య నేను ఒంటరిని

అయ్యాను. కొంచెము ఆలోచించి నా పేరు చెప్పి మీ "పేరేమిటండి" అని నా కొత్త మిత్రుని అడిగాను. తన పేరు జమ్మి కృష్ణమూర్తి అని చెప్పాడు. మన యిద్దరి పేరులలో "కృష్ణుడు"న్నాడు అని చెప్పి "మీరుకూడా నాన్ బ్రాహ్మణులా" అన్నాను. కాదు తాను బ్రాహ్మణుడనని చెప్పి నవ్వాడు. "అయితే మీరు మాంసాహారం ఎందుకు తింటున్నారు ?" అని సౌమ్యంగా అడిగాను. యిక నా మిత్రుడు నా ప్రశ్నకు "ఏమిటయ్యా ? నీవు పల్లెటూరి నుంచి వచ్చిన వాడులాగ వున్నావు" అన్నాడు. వెంటనే నేను "క్షమించండి ! కొత్తగా వచ్చానుకదా నాకు కొంత మరపు వుంది. నిజమే మనమందరమూ యిప్పుడు లండనులో వున్నాము." దాంతో అందరమూ నవ్వుకొన్నాము. భోజనాలు అయిపోయాయి యిక కదిలాము. నేను నా గదిలోకి వెళ్ళి ఆ రాత్రి నిద్రపోయాను.

ఇండియన్ స్టూడెంట్సు హాస్టలు ఇండియాలోని యువక క్రిష్టియన్ అసోసియేషనువారే (YMCA) లండనులో నిర్మించారు. అక్కడ అన్ని తరహా భారతీయులను, విద్యార్థులను కలుసుకోడానికి అవకాశముండేది. కొత్తగా లండను చేరేవారికి అది చాలవుపయోగముగా వుంటుంది. దాని ఆఫీసు నుండి అవసరమగు సలహాలు భారతీయ విద్యార్థులు యితరులు పొందడానికి అవకాశముండేది. ఆ రోజుల్లో దానిలోనే ఇండియన్ స్టూడెంట్సు యూనియను అని సంస్థకు

సభ్యత్వము తీసుకొనేవారు. నేను దాని చందాకట్టి సభ్యుడుగా చేరాను.

లండనులో భారతీయులకు వేరొక విడిదియిల్లు ఉండేది. దానిని లండన్ మజ్లీస్ అనేవారు. అక్కడ భారతీయ మిత్రులను చూడడానికి ఒక్కసారి వెళ్ళాను. కాని అందరూ ఏదో రోజు ఇండియన్ స్టూడెంట్సు హాస్టలుకు వచ్చేవారే. ఆ రోజుల్లో మొత్తం ఇంగ్లాండులో 2 వేల మంది భారతీయులున్నట్లు ఒక లెక్క. ఎక్కువ మంది లండనులోనే వుండేవారు. ఎక్కువ మంది ఆ దేశానికి విద్యగురించి మాత్రమే వచ్చినవారు. ఎక్కువ మంది డబ్బున్నవాళ్ళ పిల్లలే. బహు కొద్దిమంది మాత్రము స్కాలర్‌షిప్పులతో వచ్చినవారున్నారు.

ఇండియాలో కలుసుకోడానికి అవకాశములేని అన్ని రాష్ట్రాల భారతీయ ప్రతినిధులను లండనులో కలుసుకొనే అవకాశము నాకు కలిగింది. అంతేకాకుండా వెస్టు ఇండీస్ నుండి, ఆఫ్రికానుండి, సిలాను నుండి బర్మానుండి, జపాను నుండి యూరపు నుండి వచ్చిన విద్యార్థులను కూడా కలుసుకొనే అవకాశము కలిగింది.

ఇంగ్లాండుకు ముఖ్యపట్టణమే కాకుండా, లండను బ్రిటీషు సామ్రాజ్యానికే ముఖ్యపట్టణము ప్రపంచ వ్యాపారానికి 1933 లో ఒక ప్రధాన కేంద్రము. లండను దాని పార్లమెంటు చారిత్రకమైనది, పురాతనమైనది. శాస్త్రీయ కమ్యూనిజానికి పునాదివేసిన కార్మికవర్గ నాయకుడగు కార్లు

మార్క్సు లండనులోనే తన నివాసాన్ని ఏర్పర్చుకొని ప్రఖ్యాతి చెందిన బ్రిటీసు మ్యూజియం లైబ్రరీలో తన పరిశోధనలు జరిపి కాపిటల్ గ్రంథాన్ని తయారు చేసాడు. కాపిటలు గ్రంథము ప్రపంచ శ్రామిక వర్గానికి మార్గదర్శక విజ్ఞాన దీపికైంది.

1933 లో లండను గురించి నేను పొందుపర్చుకొన్న కొన్ని వివరాలు యిక్కడ ఇస్తున్నాను. క్రీ॥ శ॥ 43 లో లండను పట్టణం రోమన్లచే నిర్మించబడింది. 18 సంవత్సరాల తర్వాత తదుపరి బాద చోడిసియా లండనుకు నిప్పంటించి వేలకొలది రోమన్లను చంపి వేసాడు. క్రీ॥ శ॥ 839 లో డేన్లు లండనును దోపిడీ చేసారు. 1199 లో పాశ్చాత్య వ్యాపారులను లండనులో నివాసం ఏర్పర్చుకోడానికి ఆహ్వానించారు.

కాక్స్టన్ (Caxton) చే వెస్ట్‌మినిస్టర్ పార్లమెంటు భవనప్రాంతంలో 1471 లో ప్రింటింగు ప్రెస్ ఏర్పర్చబడింది. గైఫాక్సు 1605లో పార్లమెంటును ధ్వంసం చేయుడానికి మందుగుండు బాంబు కుట్ర పన్నాడు. 1664 లో లండనులో ప్లేగు మహామారి సంభవించింది. 1683 లో పెన్నీ పోస్టు ప్రారంభమైంది. 1732 లో బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండు స్థాపితమైంది. 1834 లో పార్లమెంటు భవనానికి నిప్పంటించి ధ్వంసమైంది. 1838 లో మొదటి రైలు లండను నుండి బర్మింగ్ హామ్‌కు నడపబడ్డది. 1888 లో లండను కౌంటీగా (మున్సిపల్

స్థానిక పరిపాలన) వుంది. 1899 లో 28 బరోలు (స్థానిక పరిపాలనా సంస్థలు) నిర్మాణమైనాయి.

20 శతాబ్దానికి లండనులో ప్రసిద్ధికెక్కిన ప్రాంతాలు పార్లమెంటు భవనాలు, బ్రిటీషు మ్యూజియం, ఇన్సు ఆప్ కోర్టు, కెన్సింగ్‌టన్ తోటలు, హైడ్ పార్కు, క్యూ తోటలు, జాతీయ గాలరీ, ట్రఫాల్‌గర్ స్క్వేరు, ప్రకృతి చరిత్ర మ్యూజియం, విక్టోరియా అండ్ ఆల్బర్ట్ మ్యూజియంలు వున్నాయి.

1933 లో గ్రేటర్ లండను జనాభా సుమారు 82 లక్షలు. లండను మహాపట్టణములో ప్రజల ప్రయాణ సౌకర్యానికి బస్సులు, ట్రాములు, భూమి అడుగున నడిచే రైళ్ళు **(underground railway)** వున్నాయి. ఇక టాక్సీలు ఎక్కడపడితే అక్కడ వున్నాయి.

లండనులో పడమరభాగము, **(West End)** మరొకటి తూర్పు భాగము **(East End)** వున్నాయి. పడమర భాగములో భాగ్యవంతుల విశాల నివాసాలు, పార్కులు, వున్నాయి, తూర్పు భాగములో పేదల యిళ్లు **(slums)** ఎక్కువగా వున్నాయి.

మేమున్న ప్రాంతము పడమర భాగానికి చెందినది. ఇండియన్ స్టూడెంట్సు హాస్టలున్న ప్రాంతానికి దగ్గరగానే

టావిటన్ వీధి వున్నది. అక్కడ కొన్ని యిళ్ళలో భారత విద్యార్థులు కొందరు బోర్డింగు అండ్ లాడ్జింగ్ యిళ్ళలో మకాం ఏర్పర్చుకొన్నారు. అక్కడ సదుపాయాలు స్టూడెంటు హాస్టలు కంటె ఎక్కువగా వుంటాయి. గదిలోనే ఫోను యిక గది విశాలంగా వుంటుంది. ఆ యిల్లు మూడు నాలుగు అంతస్తులుంటాయి. గదిలోకే భోజనాలన్నీ సరఫరా చేస్తారు. అవి ఇంగ్లీషు పద్ధతి వంటలు అసలు ఇండియను పద్ధతి వంటలు కావాలంటే ఇండియన్ స్టూడెంటు హాస్టలు దగ్గరగానే వున్న 112 గవర్ స్ట్రీట్‌కు వచ్చి ఇండియన్ ఆహారము తీసుకొనేవారు.

నేను గవరు స్ట్రీటీలోని హాస్టలులో చేరినతోడనే 9 టావిటన్ స్ట్రీటీకు అక్కడ బండి రామమోహనరావును చూడడానికి వెళ్ళాను. బండి రామమోహనరావు తండ్రి బండీ శ్రీహరిరావు నాయుడు కలక్టరుగాను తదుపరి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వంలో కీలక ఉద్యోగాలు నిర్వహించారు. ఈయన, మా తండ్రి మొదటి నుండీ స్నేహితులు. ఆయన కొడుకు నా కంటె ఒక సంవత్సరం ముందే లండను వచ్చాడు. మేము ఇండియాలో కలుసుకోలేదు కాని అతను కాకినాడలో మెక్లారిన్ హైస్కూలులో చదువుకొని తదుపరి తన తండ్రి ట్రాన్సువరుతో మద్రాసు రాష్ట్రంలో వివిధ ప్రాంతాల్లో చదివి చివరకు లా చదవడానికి లండను వచ్చాడు. నా కంటె

రెండు సంవత్సరాలు పెద్దవాడు అతనికి కూడా పెండ్లిఅయింది. ఒక పిల్లవాడు పుట్టిన తర్వాత అతను ఇంగ్లాండు వచ్చాడు. అతన్ని నేను 9 టావిటన్ స్ట్రీటీలో కలుసుకొన్నతోడనే స్నేహితులమైనాము.

టావిటన్ స్ట్రీటీ 9 నెంబరు యింట్లోనే కూర్మా రెడ్డి నాయుడు కొడుకు కూర్మా గోపాలస్వామి వుండేవాడు. నేను వెళ్ళిన మొదటి రోజుల్లోనే అతడు ఇండియాకు వచ్చేసాడు. అతని తండ్రి కూర్మా రెడ్డినాయుడు బ్రిటీషు పాలకుల జస్టిస్ పార్టీ నాయకుడు అతన్ని మద్రాసు ఆక్టింగ్ గవర్నరుగా కొంతకాలము బ్రిటీషు పాలకులు నియమించారు. ఇద్దరి కొడుకులను ఇంగ్లాండు పంపాడు అతని పెద్దకొడుకు కూర్మా గోపాలస్వామి బ్రిటీషు కమ్యూనిస్టులతో స్నేహముండేది అందుచే త్వరగానే అతని తండ్రి గోపాలస్వామిని యింటికి పిలిపించి ఉద్యోగంలో చేర్పించి ఆంధ్రయూనివర్సిటీ రిజిస్ట్రారు పదవిలో ప్రవేశింపచేసాడు. మరో 20 సంవత్సరాలకు నేను **M L A** ఆంధ్ర యూనివర్సిటీ సెనేటు మెంబరైన మీదట రిజిస్ట్రారుగా గోపాలస్వామి నాకు సన్నిహితంగా వుండేవాడు,

ఆ భవనంలోనే యు పి నుండి వచ్చిన జహీర్ వుండేవాడు. బారెట్ లా చదివాడు ఇండియాకు వచ్చిన తర్వాత కమ్యూనిస్టు ఉద్యమానికి సంబంధించిన రచయితల సంఘములో కృషి సాగించాడు. ఇక ఆ భవనంలోనే రష్యను

నాయకుడు స్టాలిన్ కూతురిని పెండ్లాడిన భారతీయ యువకుడు వుండేవాడు.

ఆ భవనం యజమానురాలు (**Land Lady** అంటారు) మిసెస్ క్రౌదర్. ఆమె భర్త పెన్షను దేశస్థుడు. ఆ యింటి కింద భాగములో వారు కాపురమూ ఆ యింట్లో గదులకు అద్దె ఎక్కువ కనుక సదుపాయాలన్నీ బాగానే ఏర్పాటై అద్దెలు ఎక్కువగానే మిసెస్ క్రౌదరు సంపాదించేది. స్టూడెంటు హాస్టలుకు దగ్గరగా వుండడమూ టావిటన్ భవనం గదులు మంచి ఫర్నిచరుతో వుండడమూ మూలంగా, ఆ వీధి నిశ్శబ్దంగా వుండడముచేత చదువుకోడానికి హాస్టలు కంటె అనుకూల మని, నేను ఆ భవనంలో గది ఖాళీఅయినతోడనే అక్కడకు నా మకాం మార్చాను.

టావిటన్ స్ట్రీట్‌కు, గవర్ స్ట్రీట్‌కు దగ్గరగానే హెచ్. కె లూయీస్ అండ్ కంపెనీ మంచి పుస్తకశాల వుంది. దానిలో ఎక్కువగా శాస్త్రీయ గ్రంథాలుంటాయి. దానికి లైబ్రరీ వున్నది. చదువుకోడానికి నిశ్శబ్దమైన గదు లున్నాయి. ఆ లైబ్రరీకి నేను మెంబరుగా చందా కట్టాను. లండనులో పబ్లిక్ లైబ్రరీలు చాలా వున్నాయి అవి కూడా బాగా సదుపాయాలు కలవే. విశేష పుస్తకాలున్న వే. అయితే లూయీస్ లైబ్రరీ శాస్త్రీయ పుస్తకాలు, ఆధునిక మైన గ్రంథాలు సులువుగా లభ్యమవుతాయి అది నా నివా సానికి బహుసమీపం కనుక దానిలో మెంబరుగా చేరడం

నాకు బాగా అనుకూలమనిపించింది. నేను లండను చేరిన మొదట్లో యీ చిన్నసదుపాయాలు తెలుసుకొని అపుర్చు కోడం జరిగింది.

ఈ కాలంలోనే బ్రిటనులో లేబరు పార్టీ నాయకుడు రామ్సేమెక్ డోనాల్డు ప్రధాన మంత్రిగా వున్నాడు. 1929లో లేబరు పార్టీ బ్రిటనులో అధికారంలోవున్న కాన్సర్వేటివ్ పార్టీని ఓడించడము మొదటి ప్రపంచయుద్ధం తర్వాత బ్రిటనులో ఒక అద్భుతమైన రాజకీయ సంచలనం. మొదటి ప్రపంచయుద్ధం దుష్పరిణామాలు మూలంగా యూరపంతా ఆర్థిక సంక్షోభములో చిక్కుకొన్నది. ఇంగ్లాండు పరిస్థితి కూడా యీ క్లిష్టదశలో చిక్కుకొన్నది. నిరుద్యోగం పెరిగి పోయింది. భారత దేశంలో రాజకీయ సంక్షోభం పెరిగింది. గాంధీజీ నాయకత్వాన్న కాంగ్రెసు ఉద్యమమున్నది. బ్రిటీషు ప్రధాని మెక్ డోనాల్డు లేబరు మితవాద నాయకుడు, కాంగ్రెసు నాయకుడు గాంధీజీతో భారత రాజ్యాంగ సంస్కరణలకై రౌండు టేబిలు కాన్సరెన్సుకు 1931లో లండను పిలిపించి చర్చలు విఫలమైన కాలం. లేబరు ప్రభుత్వం బ్రిటనులోని ఆర్థిక పరిస్థితిని పరిష్కరించలేకపోయింది. భారత జాతీయ కాంగ్రెసుతో రాజీపడలేకపోయింది. మెక్ డోనాల్డు లేబరు ప్రభుత్వం రాజీనామా చేసింది అయితే మెక్ డోనాల్డు లేబరు పార్టీ నుండి చీలి మరికొంతమంది అనుచరులతో కలసి కాన్సర్వేటివు పార్టీతో కలసి మిశ్రమ ప్రభుత్వంలో తాను

ప్రధానమంత్రిగా వ్యవహరిస్తున్న కాలంలో 1932 నేను లండను చేరానన్నమాట.

లండనులో బ్రిటీషు దినపత్రికలు లండను టైమ్సు, డైలీ ఎక్స్‌ప్రెస్, డైలీ హెరాల్డు, స్టూడెంటు యూనియను హాస్టలులో చదివేవాడను ఇండియాలో కాలేజీ చదువు కాలంలో మద్రాసు హిందూ ఇంగ్లీషు దినపత్రిక చదివే వాడిని. కాని బ్రిటీషు పత్రికలతో పోల్చడానికి వీలులేదు. ఆ రోజుల్లోకాని యీ రోజుల్లోకాని మన దేశ ఇంగ్లీషు పత్రికల నుండి ప్రపంచ వ్యవహారాలలో జరుగుతున్న తీవ్ర మార్పులు తెలుసుకోడం కష్టం. అయితే ఆ రోజుల్లో లండను లోని దినపత్రికల నుండి వలస దేశాల్లో జరుగుతున్న అప్పటి రాజకీయ సంచలనం తెలుసుకోడం కష్టం. బ్రిటను, యూరపు బ్రిటీషు సామ్రాజ్య గొప్పతనం గురించి కావలసిన వార్తలు, విమర్శలు ఎంతైనా వుండేవి.

లండను టైమ్సు పైకి ఇండిపెండెంటు పత్రిక అని నిర్వచించుకొన్నప్పటికి వాస్తవానికి బ్రిటీషు పెట్టుబడిదారీ వర్గాన్ని బలపర్చే పత్రిక, ఇక లండను నుంచి వెలువడే డైలీ హెరాల్డు బ్రిటీషు లేబరు పార్టీని బలపర్చే దినపత్రిక. దానిలో భారతదేశ వార్తలు కొద్దిగా ఉండేవి కాని జాతీయ ఉద్యమం యెడల కొంత లేబరు పార్టీ అభిమానాన్ని చూపే పత్రిక. అయితే లేబరు పార్టీ కూడా అప్పటి రోజుల్లో భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని యివ్వాలనే ధోరణిలో

లేదు. నిజానికి లేబరు పార్టీ నాయకుడు రామ్సే మెక్ డొనాల్డు ప్రధాన మంత్రిగా వున్నప్పుడు భారత దేశ రాజ్యాంగ సంస్కరణలకు భారత దేశంలోని సామ్రాజ్యవాద అనుకూల వ్యక్తులను కూడగట్టడానికి పూనుకొని భారత దేశ జాతీయ ఉద్యమ నాయకుడగు మహాత్మాగాంధీని ఒక తంతుగా రౌండు టేబిల్ కాన్ఫరెన్సుకు పిలిపించి తదుపరి భారత దేశంలో జాతీయ ఉద్యమం తీవ్రమవుతుండగా ఆయనను అరెస్టు చేయించాడు తిరిగి విడుదల చేయించాడు. లండను డైలీ ఎక్స్ప్రెస్ ఎక్కువ సర్క్యులేషనులో వుండేది. అదికూడా స్వతంత్ర పత్రికగానే వ్యవహరించేది. మార్నింగు పోస్టు దినపత్రిక కాన్సర్వేటివు పార్టీ పత్రిక అది భారత దేశ స్వాతంత్ర్య ఉద్యమానికి పూర్తిగా వ్యతిరేక పత్రిక మాంచెస్టరు గార్డియన్ అనే ఇంగ్లీషు దినపత్రిక మాంచెస్టరు పట్టనం నుండి వెలువడినా లండనుకు ఉదయాన్నే సరఫరా అయ్యేది. అది లిబరల్ పార్టీ పత్రిక, ఇవికాక నేను కలకత్తా స్టేట్సుమెన్ వారపత్రిక తెప్పించి చదివేవాడను.

దానినుండి ఇండియా వార్తలు తెలుసుకొనేవాడిని. అయితే ఇండియా పరిస్థితులపై వివరించడానికి వివిధ రకాల బల్లిటిన్లు స్థానిక చిన్నపత్రికలు లండనులో వెలువడేవి. ఇండియా లీగ్ లండనులో అప్పట్లో ఒక చిన్నసంస్థగా వుండేది. జాతీయ భావాలుకల విద్యార్థులు ఆ సంస్థకు చందాలు కట్టేవారము.

దానిలో వి. కె. కృష్ణమీనన్ ఒక కార్యదర్శిగా పని చేసేవాడు. బ్రిటీషు లేబరు పార్టీ నాయకులతో సంబంధం పెట్టుకొనేవాడు. వి. కె. కృష్ణమీనన్ నన్ను అంతంగా ఆకర్షించలేదు. అహంభావమున్న వ్యక్తిగా నాకు ఆ రోజుల్లోనే తోచాడు. అప్పుడే అతను నెహ్రూతో కొంత పరిచయం పెట్టుకొన్నాడు. ఆ పరిచయం అతనికి ముందు ముందు రాణించింది.

జర్మనీలో హిట్లరు అతని నాజీ పార్టీ అధికారంలోకి వస్తున్న రోజులు హిట్లరు జర్మను పార్లమెంటుకు నిప్పంటించి, కమ్యూనిస్టులు యిందుకు కారణమని జర్మన్ కమ్యూనిస్టు నాయకుడగు ఎర్నెస్టు తాల్‌మెన్‌ను అరెస్టు చేయించాడు. జర్మనీలో హిట్లరు ఆధిపత్యం, యూదులపైన, కమ్యూనిస్టుల పైన అతను సాగిస్తున్న దాడులు అతని నియంతత్వపోకళ్లు తీవ్ర సంచలనం తెచ్చాయి.

లండనులో నా నివాసకాలం ప్రాధమిక దశలోనే యీ ప్రపంచ మార్పులు, లండనులోని రాజకీయ చర్చలు మొదట కుతూహలాన్ని తదుపరి చైతన్యాన్ని కలుగచేసాయనాలి. బ్రిటనులో ప్రవేశించడము నాకు అత్యద్భుతమైన స్వేచ్ఛకు ఆలోచనకు చక్కని అవకాశం కలుగచేసింది.

లండనులోని భారతీయ విద్యార్థులు ధనిక మధ్య తరగతి నుండి వచ్చినవారు. ఎక్కువ మంది విలాసాల యెడల మక్కువ కలవారు. జాతీయ భావాలు తక్కువ మందికి

వుండేవి. బ్రిటనులోని విజ్ఞాన సముపార్జన అవకాశాలు నన్ను ఆకర్షించాయి కాని, బ్రిటీషు సమాజంలోని విలాసపద్ధతులు నన్ను ఆకర్షించలేదు. వాట్లను నేను తీవ్రంగా విమర్శిస్తే నా మిత్రులు కొందరు నన్ను పాతకాలపు వ్యక్తిగా జమకట్టేవారు.

ఇండియా నుండి బ్రిటను వచ్చిన భారతీయ మధ్యతరగతి యువకులు బ్రిటీషు పాలనక్రిందవున్న వలస భారత దేశం నుండి, బూర్జువా పార్లమెంటరీ విధానంలో వుండి బూర్జువా నాగరికత కలిగిన పెట్టుబడిదారీ బ్రిటనులో ప్రవేశించడమన్నమాట. ఫ్యూడలు సాంప్రదాయాలు, కుల తత్వాలు, పాశ్చాత్యపీడన, పేదరికంతో నిండిన భారతదేశంలోని బ్రిటీషు పాలకుల ఆధిపత్యం, వారితాబేదార్ల రాజకీయాల వాతావరణ నుండి బయటపడి, బ్రిటీషు కాపిటలిస్టు సమాజంలో అడుగుపెట్టడమన్నమాట. కాపిటలిస్టు సమాజంలో ధనిక పేద వర్గతారతమ్యాలున్నప్పటికి జాతీయ భావాలులేని భారతీయ విద్యార్థులు బ్రిటీషు పాలకవర్గంవైపే మొగ్గుతారు.

జాతీయ స్వతంత్ర భావాలుకల భారతీయ విద్యార్థులు ఇంగ్లాండులో సోషలిస్టు భావాలుయెడల సమాజంగా మొగ్గుతారు. బ్రిటనులోని కాపిటలిస్టు వర్గం శ్రామిక వర్గం మధ్య వైరుధ్య రాజకీయాలు బ్రిటీషు సామాజిక రాజకీయ వ్యవస్థలో సుస్పష్టమవుతాయి, బ్రిటీషు పాలకవర్గంతో

వైరుధ్యం మూలంగా బ్రిటీషు శ్రామికవర్గం వలస దేశాల స్వాతంత్ర్య ఉద్యమాన్ని సహజంగా బలపరుస్తూంది. వలస దేశాల్లో సంపాదించిన లాభాలతో బ్రిటీషు కాపిటలిస్టులు ఆ దేశ శ్రామిక వర్గాన్ని యింకా పీడిస్తారు అందుచేత బ్రిటీషు సామ్రాజ్యవాదము వాళ్ళకుకూడా విరోధమైంది.

సామాన్య బ్రిటీషు పౌరునికి భారతదేశ పరిస్థితులు తెలియవు. ఇండియా ప్రజలగురించి సామాన్య బ్రిటీషు పౌరునికి చాల మతాలతో కూడిన దేశమని, విశేషవిలాసాలు ధనం కలిగిన సంస్థానాదీసులతో కూడిన దేశమని, బహు జనం పేదలని మాత్రమే తెలుసు, గాంధీజీ విధానాలు హిందూమత చాంధస్తవిధానాలని, అయితే బహుభారత ప్రజలు ఆయనను ఒక నాయకుడుగా భావిస్తారని మాత్రమే వాళ్ల ధోరణి.

1933 లో లండనులో ఇండియన్ హైకమిషనరు భారతీయుడు సర్ బి. యస్. మిత్రా వున్నారు. బెంగాల్ ప్రావిన్షియల్ గవర్నమెంటు సర్వీసులో 1910 లో ప్రవేశించి ప్రభుత్వ సర్వీసులో పైకి ప్రమోటుఅయి వైస్రాయి కౌన్సిలు ఢిల్లీలో మెంబరుగావుండి, 1924 నుంచి లండనులో ఇండియన్ హైకమిషనరుగా వున్నాడు. ఈయన బ్రిటీషు పాలకులకు అనుకూలం కనుక త్వరితంగా ప్రమోషన్లు బిరుదులు పొందాడు. ఈయనక్రింద డిప్యూటీ హైకమిషనరు బ్రిటీషు వ్యక్తి ఎ. యం. గ్రీన్ ICS వున్నాడు. లండనులో నా

చదువు గురించి సలహాతీసుకోడానికి ఆల్డివిచ్ లోనున్న హైకమి షనరు ఆఫీసుకు వెళ్ళి హైకమిషనరును కలుసుకొన్నాను, ఆఫీసుకు వెళ్ళినతోడనే కొద్ది నిమిషాలలోనే నాకు హైకమిష నరు ఇంటర్వ్యూ యిచ్చారు. ఆయన బెంగాళీయుడు సుమారు 57 సంవత్సరాల ఉంటాయి. నాకు సర్ ఆర్. వెంకటరత్నం నాయుడు మద్రాసు యూనివర్సిటీ మాజీ వైస్‌చాన్సలర్ యిచ్చిన పరిచయపత్రాన్ని చూపించాను.

అప్పటి లండనులో ఇండియన్ హైకమిషనరు ఆఫీసు భారతీయ విద్యార్థులకు తగు సహాయాలు చేయదనే వదంతు లున్నాయి. భారతదేశ విద్యార్థులపైన ఒక నిఘావేసి వుంటుం దని కూడా జాతీయ వాదులలో వదంతులున్నాయి కాని యివిపైకి ఏమీ కనపడవు. బ్రిటీషు పార్లమెంటరీ విధానంలో పైకి అన్నీ మర్యాదగానే స్వేచ్ఛగానే వున్నట్లు కనపడతాయి. భారత వలస పెత్తందారీ వ్యవస్థలో వున్న మోటు బానిసతనము ఆ కాపిటలిస్టు వ్యవస్థలో వుండదు కాని ధనిక పేద తార తమ్యాలు వాట్ల వైరుధ్యాలున్నాయి.

నేను లండను యూనివర్సిటీ కాలేజీకి చెందిన బర్క్‌బెక్ సాయంత్ర కాలేజీలో **(Birkbeck Evening College)** ప్రొఫెసరు గ్రిన్‌వాన్ కింద ప్రకృతశాస్త్ర యం. యస్. సి. చదవాలని కోరిక హైకమిషనరు ఆఫీసులో తెలియచేసాను. అందుపై ఆ కాలేజీ ప్రొఫెసరుతో నాకు యింటర్వ్యూ ఏర్పాటు చేయబడింది. ప్రొఫెసర్ గ్రిన్‌వాన్ నిపుణులైన శాస్త్రవేత్త

ఆమె ప్రధాన గ్రంధాన్ని నేను బి. యస్. సి. లో బాగా చదివాను. నేను సాయంత్రపు కాలేజీలో ఎందుకు చేరదల చాను అని అడిగింది. ఆమె ప్రముఖమైన వృక్ష శాస్త్రజ్ఞురాలు కనుక, ఆమె గ్రంధాలు ఇండియాలో పట్టభద్ర డిగ్రీకి చది వాను కనుక తనవద్ద పోస్టు గ్రాడ్యుయేటు కోర్సుకు వృక్ష శాస్త్రంలో ప్రవీణత పొందాలని నా కోరిక అన్నాను. మరో కారణంకూడా చెప్పాను. నేను ఇండియన్ సివిల్ సర్వీసు పోటీ వరీక్షలకు కూడా చదువుతున్నాను అందుచే పగలు ఆ చదువుకు వినియోగించి సాయంత్రం వృక్ష శాస్త్రము పోస్టు గ్రాడ్యుయేటు కోర్సు ఆమె వద్ద చదువాలని కుతూహలపడ్డాను.

అయితే రెండు వ్యాపకాలు పెట్టుకొంటే ఎట్లాగు అన్నది. ఏదో ఒకటి నమ్ముకొని కృషిచేయాలి అందులో రాణించాలికదా అన్నది. నిజానికి నాకు వృక్షశాస్త్రముపై యడల ఆసక్తివున్నది అని చెప్పాను, బి. యస్. సి. లోని వృక్షశాస్త్రానికి సంబంధించిన నా కాలేజీ ప్రాక్టికల్ రికార్డు పరిశీలించింది. అయితే ఇండియన్ గ్రాడ్యుయేటు విద్యార్థు లను సరాసరి పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులకు తీసుకోడం లేదని, 3 సంవత్సరాల బ్రిటీషు గ్రాడ్యుయేటు కోర్సులో ఒక సంవత్సరం మినహాయించి మిగతా రెండు సంవత్సరాలు ఇండియన్ గ్రాడ్యుయేటు తన కాలేజీలో చదవవలసి వుంటుందని చెప్పింది. నాకు ప్రత్యేకమైన కన్సెషను

చూపించమని కోరాను. ముందు కాలేజీలో చేరమని తరు వాత నా ప్రోగ్రసు చూచి తనకు సంతృప్తి కలిగితే బి యస్ సి ఒక సంవత్సరమే చదవవలసి వుంటుందన్నది. యిక నన్ను నిర్ధారణ చేసుకొని త్వరలో తెలుపమన్నది.

మరుచటి దినాన్ని హైకమిషనరు ఆఫీసుకు వెళ్ళి విద్యకు సంబంధించిన ఆఫీసరు పి. కె. దత్తును కలుసుకొని బ్రిటనులో ఇండియన్ గ్రాడ్యుయేట్లు తిరిగి గ్రాడ్యుయేటు కోర్సులు చదవాలా, అని అడిగాను ఇండియన్ హైకమిషనరు ఆఫీసు అందచేసిన బ్రిటనులోని విద్యావకాశ సూచనల ప్రకారము ఇండియన్ యూనివర్సిటీల గ్రాడ్యుయేట్లు, పోస్టు గ్రాడ్యుయేటు కోర్సుకు అర్హులని వున్నది, ఈ సందర్భములో బర్కు బెక్ కాలేజీ ప్రొఫెసరుతో జరిగిన సంభాషణ తెలిపాను. ఆమె కింద ఇండియన్ యూనివర్సిటీ వృక్ష శాస్త్ర పోస్టు గ్రాడ్యుయేటులు కూడా తిరిగి లండను గ్రాడ్యుయేటు కోర్సులు చదువుతున్నారని అక్కడ నేను చేరాలనుకొంటె తిరిగి బి యస్ సి చదవవలసి వుంటుందని స్పష్టంగా చెప్పారు. కాని నేను మాత్రము యం యస్ సి కి అవకాశం లేకపోతే మాని వేస్తానుకాని తిరిగి బి యస్ సి లో యిక్కడ చేరను అన్నాను. దానిమీద దత్తు భారతీయ విద్యార్థులందరూ ఏదో ఇంగ్లీషు డిగ్రీకి తాపత్రియ పడుతున్నారు కాని, ఫలానా కోర్సు దొరికితేనే చదువుతాము అనడం లేదు యీ చిన్న వయస్సులో మీా పట్టుదలపమి అన్నాడు. నిజానికి నేను ఇంగ్లీషు డిగ్రీ

మోజు పడ్డవాడనుకాను కాని నేను ఇండియాలో చదివిన డిగ్రికోర్సు ఇంగ్లీషువాళ్ల పుస్తకాలే ఆధారంగా చదివి, జర్మనీలో పి. హెచ్.డి. డిగ్రీ సంపాదించుకొన్న డాక్టరు డబ్ల్యు. లక్ష్మణరావు వద్ద మరి వృక్షశాస్త్ర విజ్ఞాన నిపుణులగు లెక్చరరు గోపరాజు రామచంద్రరావు (గోరా) వారివద్ద నేను బి యస్ సి లో వృక్షశాస్త్రాన్ని ప్రధాన శాస్త్రముగా నేర్చుకొని పట్టభద్రుడనైతే తిరిగి ఇంగ్లాండులో వృక్షశాస్త్రములో డిగ్రీ కోర్సుకు చదువు మొదలుపెట్టాలంటే నా ఆత్మ గౌరవానికి లోపము అన్నాను. నా చదువు ఉద్యోగం గురించి కాదు, విజ్ఞానం కొరకు అన్నాను. దత్తుకు మాత్రం నా ధోరణి నచ్చినట్లులేదు. నా స్వేచ్ఛాధోరణి నాకు చిన్నప్పటి నుండి నష్టదాయకమైనా దానిని మార్చుకోడానికి ప్రయత్నం చేయలేదు; అది మంచిదైంది అనుకొంటున్నాను. నాకు లాభం లేకపోయినా పరువు మాత్రం మిగిలేది అనుకొంటున్నాను. దత్తు ఇంకో యూనివర్శిటీలో యం యస్ సి చదవడానికి వెడతావా అని అడిగాడు. అప్పుడు మాత్రం ఒప్పుకొన్నాను. బ్రిటనులో వేల్సు యూనివర్సిటీ అబిరిస్ట్విత్ పట్టణంలోని సైన్సు కాలేజీ వృక్షశాస్త్ర ప్రొఫెసరుకు వ్రాస్తానన్నాడు. అక్కడ నాకు అవకాశముంటుందన్నాడు.

అఖిల బ్రిటనులో (Great Britain) వేల్సు తూర్పు ప్రాంతము, దానిని ప్రిన్సిపాలిటీ ఆఫ్ వేల్సు (Principality of Wales) అంటారు. బ్రిటనులో భాగమే అయినా వెల్సు

ఒక ప్రత్యేకజాతి వారికి ప్రత్యేక భాష, ప్రత్యేక నాగరికత వుంది. అదికాక ఇంగ్లీషు భాషకూడా వారి ప్రధాన భాష. బ్రిటీషు దీవిలో కలసి ఇంగ్లాండు, (కింగ్ డమ్ ఆఫ్ ఇంగ్లాండు) అని, స్కాట్ లెండు (కింగ్ డమ్ ఆఫ్ స్కాట్ లెండు), అని వ్యవహరింపబడతవి. యిక వీట్లకు సెంట్రల్ గవర్నమెంటు బ్రిటీషు ప్రభుత్వము. బ్రిటీషు సామ్రాజ్యముపైన బ్రిటీషు ప్రభుత్వ ఆధిపత్యము. నేను ఇండియాలో చదువుకొనే రోజుల్లో బ్రిటీషు ప్రభుత్వం ఒకటే జాతి అనుకొన్నాను. వేల్సు జాతీయుడు లయడ్ జార్జి లిబరల్ పార్టీ నాయకుడు బ్రిటీషు ప్రధాన మంత్రిగా మొదటి ప్రపంచ యుద్ధకాలంలో నిర్వహించారు.

వేల్సు కూడా బ్రిటనులో భాగమే కనుక వేల్సు యూనివర్సిటీలోని అబెరిస్టిత్ కాలేజీ- యం యస్ సి కి సిద్ధపడ్డాను

అబెరిస్టిత్ చిన్న పట్టణం అప్పటి దాని జనాభా సుమారు 9 వేలు మాత్రమే. మొత్తం వేల్సు ప్రాంతపు పట్టణాల జనాభా అంతా కలసి సుమారు 26 లక్షలు మాత్రమే. ఒక లండను మహాపట్నం జనాభా అంతా కలసి మొత్తం వేల్సు జనాభాకు 3 రెట్లు వుండేది.

అబెరిస్టిత్ కాలేజీ వృక్షశాస్త్ర డిపార్టుమెంటు అధిపతి ప్రొఫెసరు, కూడా స్త్రీయే. నా వృక్షశాస్త్ర చదువుకు బ్రిటనులో యిద్దరూ స్త్రీలతోనే సంప్రదిస్తున్నానని కొంత

ఆశ్చర్యపడినా నేను అభ్యంతరపడలేదు. లండను ప్రొఫెసరు ముక్తసరిగా కనపడింది, కాని వేల్సు యూనివర్సిటీ ప్రొఫెసరు నాయెడల అభిమానమూ చూపినట్లు కనపడింది నా చదువు గురించి తెలుసుకొన్నది. బి యస్ సి లో నా వృక్ష శాస్త్ర చదువుకు సంబంధ రికార్డు పరిశీలించింది. యం యస్ సి లో సీటు యిస్తానన్నది ఒక వారం రోజులలో చేరాలని ఆదేశించింది. చివరకు బ్రిటనులో యం యస్ సి సీటు సంపాదించినందుకు సంతోషించాను కాని లండను విడచి చిన్న ప్రాంతమగు అబిరిష్టిత్ (వేల్సు)లో చేరడమూ, యిక ఇండియన్ సివిల్ సర్వీసు పోటీపరీక్షల చదువుకు యీ చిన్న పట్టణంలో అవకాశాలేమంటాయి అనే సంకోచమూ బయలు దేరింది.

ఆ వేల్సు ప్రాంతంలో యం యస్ సి చదువుతూ, అక్కడి కాలేజీలో నా సబ్జెక్టులలో ఐ సి యస్ పోటీ పరీక్షకు చదవడానికి తగిన ఏర్పాటులు చేసుకోలేక పోగలనా అనే ఆలోచన కూడా బయలు దేరింది.

లండను వచ్చినతోడనే వారం రోజులు వెంచెయ్యాలి అనే ఆలోచనలోనే పడ్డాను. చివరకు లండనులోనే వుండడానికి నిర్ధారణ చేసుకొన్నాను. అబిరిష్టిత్ కాలేజీ ప్రొఫెసరుకు ప్రత్యుత్తరం వ్రాసాను. నా వృక్షశాస్త్ర విద్య యిలా సమాప్తమైంది. వృక్షశాస్త్రం నుండి మనుష్యశాస్త్రంలోకి ప్రవేశించాలేమో !

లండనులో నా సరంజా పెంచుకొన్నాను. టోటన్ హామ్ కోర్టు వీధిలో నున్న రెమింగ్‌టన్ కంపెనీకి వెళ్ళి ఒక టైపు మిషీను కొన్నాను. ప్రత్యేక టైపు అక్షరాలను ఎంపికచేసి నా టైపు మిషను తయారు చేయమన్నాను. యిప్పటి ఏబదరెండు సంవత్సరాలనుండి యీ టైపు మిషను నా వద్దనేవున్నది. జైలు, అజ్ఞాతవాసంలో వున్నప్పటికి టైపు మిషను పోలేదు తిరిగి బైటకు వచ్చేటప్పటికి నాకు దొరికేది. నేను బ్రిటను వెళ్ళేటప్పుడు (1932) ఇండియాలో ఆకాశవాణి వ్యాప్తి లేదు. అప్పుడే బ్రిటీషు ప్రభుత్వం ఇండియాలో బ్రాడ్ కాస్టింగ్ ప్రయోగం మొదలుపెట్టింది. అయితే నా బి యస్ సి లో కాలేజీలో వుండగా కాలేజీ విద్యార్థుల సమావేశంలో బ్రాడ్ కాస్టింగుపైన కాలేజీ ఫిజిక్సు లెక్చరరు అధ్యక్షతను రేడియో గురించి ఉపన్యాసం సాహసించి యిచ్చాను. లండను వెళ్ళినతోడనే ఒక రేడియోను వాయిదాల పద్ధతిపై కొన్నాను. ఇది ఎంతో వుపయోగమైంది. బ్రిటీషువాళ్ల జాతీయ సమస్యలు, అంతర్జాతీయ వ్యవహారాలపై వ్యాఖ్యానాలు అప్పటి ప్రపంచ తీరు అవగాహనకుపయోగపడేది. ఆ బి బి సి ప్రోగ్రాములు "ఇది లండను" (This is London) అని ప్రారంభించడము యిప్పటికి వినడం సాగుతూంది బ్రిటీషు సామ్రాజ్యం ఈ కాలంలో చితికిపోయినప్పటికీ, బ్రిటీషు వ్యక్తిత్వమూ, ప్రత్యేక విమర్శనా ధోరణి పోగొట్టుకోలేదని పిస్తూంది. దానిని అంగీకరించకపోయినా మానవ తత్వాన్ని

వాళ్ళ చరిత్రల ప్రభావాన్నిబట్టి అవగాహన చేసుకోడాని అవసరమైంది.

అనుకూలమైన విజ్ఞానపూరితమైన ఆధునిక గ్రంథాలు కొనడం, ఉపన్యాసాలు వినడం, చర్చించడం మొదలగు కార్యక్రమాలకు ఋక లండను నివాసం వుపయోగమైంది.

లండనులో నాకు కలిగిన రాజకీయ పరిజ్ఞాన అవకాశాలు పురస్కరించుకొని, నా స్వేచ్ఛను కాపాడుకోవాలనే ధోరణిలో పడ్డాను కాని, నా తండ్రితో చెప్పినప్రకారం నేను సివిల్ సర్వీసు పోటీ పరీక్షకు కూర్చోకపోతే ఆయనకిచ్చిన మాట పొల్లు చేసుకొన్నట్లుంటుందని నేను ఆవేదన పడ్డాను. అదొక పోటీ పరీక్ష కనుక కావలసిన నా కాలేజీ పాఠ్యగ్రంథాలను (సబ్జెక్టులను) క్షుణ్ణంగా చదివాను. అదనంగా ఆదిమ మానవుల శాస్త్రము, (anthropology) అంతర్జాతీయ న్యాయశాస్త్రము చదివాను. సివిల్ సర్వీసు పోటీ పరీక్షకు నిర్బంధంగా తీసుకోవలసిన సబ్జెక్టులపై పేపర్లు కాక, మిగతా తన యిష్టమొచ్చిన సబ్జెక్టులలో ఒకో పేపరుకు 100 మార్కులు చొప్పున మొత్తం వెయ్యి మార్కులు సరిపడే సబ్జెక్టులలో ప్రశ్నాపత్రాలకు సమాధానం వ్రాయాలి. ప్రతి సబ్జెక్టుకు క్రింది తరహా (Lower) పేపరు పై తరహా (Higher) పేపరు వుంటుంది. క్రింది తరహా సబ్జెక్టు స్థాయి తక్కువ, పై తరహాది ఎక్కువగా వుంటుంది. వృక్షశాస్త్రానికి (Botany) జంతుశాస్త్రానికి (Zoology) నేను క్రింద స్థాయి పై స్థాయి

ప్రశ్నాపత్రాలకు సిద్ధపడ్డాను. గాని రసాయన శాస్త్రానికి (Chemistry)) కిందస్తాయి ప్రశ్నాపత్రాన్నే కోరుకొన్నాను. ఈ పాఠ్యవిషయాలు నేను కాలేజీలో డిగ్రీ పరీక్షలో వుత్తీర్ణపడనైనవే అయితే ఆ శాస్త్రాల పైస్తాయి పాఠ్యంలో నేను స్వయంగా తర్ఫీదు కావడం కష్టంకాదు కనుక దానికి పూనుకొన్నాను. యిక యింటర్వ్యూ సమయంలో మొత్తం మార్కులు 300 వుంటాయి. ఈ విషయాలన్నీ సేకరించుకొని, ఒక 6 సంవత్సరాలు ప్రశ్నాపత్రాలు సేకరించి, వాట్లపై శక్తికొద్దీ స్టడీచేసి, పోటీ పరీక్షకు కూర్చొన్నాను. ఇంటర్వ్యూకు కూడా వెళ్ళాను.

సివిల్ సర్వీసు పోటీలో దిగాను. నా బాధ్యతను నెరవేర్చానుకొన్నాను కాని యీ సివిలు సర్వీసు వృత్తికి నేను తగుదునా అనేది నా మనస్సులో సంకోచమూ తటపటాయింపు తీవ్రంగా బయలుదేరింది. ఇటువంటివే సంశయాలు నాకు "తగునా! తగదా!" ("To be or not to be") అనేవి నా జీవితంలో బయలుదేరిన ఘట్టాలు వున్నాయి. నిర్ధారణలో తాత్కాలిక మానసిక సంఘర్షణలో పడినప్పటికి ముందుపరిణామాలుబట్టి నా తుది నిర్ణయాలు తప్పుకాదనే రుజువులు సంభవించాయి అని వివరించక తప్పదు. నేను సివిల్ సర్వీసు పోటీనుండి విరమించుకొంటున్నానని సివిల్ సర్వీసు కమిషనుకు వ్రాసాను. పరీక్షలు వ్రాసాను ఇంటర్వ్యూ అయింది కాని సివిల్ సర్వీసు వృత్తికి నేను సిద్ధం కానట్లు దానినుండి నా

విరమణ పత్రం చేయించుకొన్నాను. విరమించుకోడం వలన సివిల్ సర్వీసు కమిషను నేను కట్టిన డిపాజిట్టు డబ్బు వాపసు కాబడదని వ్రాసింది. అది నేను సరకు చేయలేదు

లండనులో బారెట్ లా చదువుతున్న గుంటూరుజిల్లా వాసి జి. వి. చౌదరి నాకు పరిచయమయ్యాడు. నేను సివిల్ సర్వీసుకు తయారైననాని విమర్శించాడు, తనకొక్కనికే దేశ భక్తి వున్నదని గర్వించవద్దన్నాను .అయితే సివిల్ సర్వీసుకు కూర్చొన్న అభ్యర్థులందరి పేర్లు తరువాత ప్రకటితమయ్యాయి కాని నా పేరు లేదు. నేను అసలు ఆ పోటీకి సిద్ధంకాలేదని అనుకొని నన్ను అభినందించాడు, ఒకవేళ అటువంటి సర్వీసులో ప్రవేశిస్తే అందులో మనబోటివాళ్ళను ఉండనిస్తారా ఉండగలుగుతామా అన్నాను. అది వాస్తవమని ధీమాగా ఒప్పుకొన్నాడు. జి వి. చౌదరి లండనులో కమ్యూనిస్టు భావాలు కలిగిన వ్యక్తి. ఇండియాకు వచ్చిన తర్వాత కాంగ్రెసులో చేరాడు. తరువాత ఉద్యోగంలో చేరాడు.

తరువాత ఒక సంవత్సరానికి నాకు ఐర్లండు డబ్లిన్ యూనివర్సిటీ నుండి ఇండియన్ సివిల్ సర్వీసుకు ఎంపికై అక్కడ తర్ఫీదు (ప్రొబేషను) పొందే ఒక తమిళ అభ్యర్థికి తెలుగు నేర్పడానికి లండను స్టూడెంటు హాస్టలు ద్వారా నన్ను తెలుగు ఉపాధ్యాయునిగా ఒక సంవత్సర నియామకం కోరినమీదట నేను ఆశ్చర్యపడ్డాను, అయితే సివిల్ సర్వీసు నాకు కూడదనుకొన్న నేను యీ పనికి యిష్టం లేకపోయింది.

జి. వి. చౌదరి లండనులో డబ్బులకు యిబ్బంది పడు తున్నాడు. జీతం వస్తూంది కనుక డబ్లిన్ యూనివర్శి టీలో ఒక సంవత్సరం ఐ సి యస్ ప్రొబెషనరుకు తెలుగు నేర్పుతావా అనిచౌదరిని అడిగాను వెంటనే అంగీకరించాడు తనను రికమెండు చేయమన్నాడు. అలా అతనికి ఆ ఉద్యోగం వచ్చింది. మరో సుమారు 20 సంవత్సరాల నా రాజకీయ జీవితంలో 1952 మద్రాసు లెజిస్లేచరులో యం. యల్. ఏ గా ఎన్నికైనప్పుడు జి. వి. చౌదరిని రాజాజీ ప్రభుత్వంలో లెజిస్లేచరు డిపార్టుమెంటు జాయింటు కార్యదర్శి ఉద్యోగి అయ్యాడు.

అది నేను యిప్పించిన ఉద్యోగం కాదు. నేను కాంగ్రెసు ప్రభుత్వానికి ప్రతిపక్షంలో విమర్శకుడుగానూ, జి వి. చౌదరి ఆ ప్రభుత్వంకింద ఉద్యోగిగానూ తయా రైనాడు. బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా దిగిపోయేముందు హైదరాబాదులో జి. వి. చౌదరి రిటైరు అయిన సమయంలో శాసనసభలో నేను ఉపన్యసించి అతని రిటైరుమెంటులో శుభాకాంక్షలు తెలుపుతూ, బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వా నికి సేవచేసినందుకు చౌదరికి రాజకీయ ఉద్యోగం యిప్పించ మని రికమెండు చేసాను. చౌదరితో నా పూర్వపు పరి చయం, అతన్ని ఐ. సి. యస్. ఉద్యోగికి తెలుగు నేర్పడానికి మొదటి ఉద్యోగం ఐరిష్ రిపబ్లిక్ డబ్లిన్‌లో యిప్పించడం వివరించాను

నేను లండనులో వున్నప్పుడే పండిట్ జవహార్‌లాల్ నెహ్రూ కుమార్తె ఇందిరాగాంధీ ఇంగ్లాండులో వుంటున్నట్లు విన్నాను. జవహార్‌లాల్ నెహ్రూ జైలునుండి విడుదలై యూరపులో ఆయనభార్య అనారోగ్యంగా వుండడమువలన అక్కడికి వచ్చి, అక్కడనుండి లండను కాక్సుటన్ హాలులో ఇండియా లీగు ఏర్పాటుచేసిన మీటింగులో మాట్లాడినప్పుడు నెహ్రూతో పరిచయం చేసుకొన్నాను. ఆ మీటింగులోనే ప్రొఫెసరు హెరాల్డు లాస్కీ మాట్లాడుతూ, జర్మనీలో హిట్లరు నియంతృత్వము కింద నిర్బంధంలో వుంచబడిన కమ్యూనిస్టు నాయకుడు, శ్రామికవర్గ నాయకుడు ఎర్నెస్టు తాల్ మేన్‌తో పోల్చి, బ్రిటీషు పాలకుల కాలంలో ఇండియాలో నెహ్రూ నిర్బంధాలకు గురవుతున్నాడని వివరించాడు. నెహ్రూకు కాబోయే అల్లుడు ఫిరోజ్ గాంధీ లండన్ మజ్లీస్‌లో వుంటున్నట్లు అప్పుడే విన్నాను. అక్కడ అతను స్వేచ్ఛా జర్నలిస్టుగా **(Free Lance Journalist)** వున్నట్లు విన్నాను.

నెహ్రూ జీవిత చరిత్ర నేను లండనులో వుండగానే అక్కడ అచ్చైంది. కాంగ్రెసు నాయకుల జీవిత చరిత్రలు నేను ఇండియాలో కాలేజీలో వున్నప్పుడే చదివాను. ఇండియాలోనే మహాత్మా గాంధీ జీవిత చరిత్ర చదివాను.

లండనులో వుండగానే సుభాష్ చంద్రబోసు రచించిన "భా ర త దే శ పో రా ట ం" **(The Indian Struggle)** గ్రంథాన్ని చదివాను, అయితే సుభాష్ చంద్రబోసును

బ్రిటీషు ప్రభుత్వం యూరప్పులో వుండనిచ్చింది కాని ఇంగ్లాం డులో సుభాష్ చంద్రబోసు ప్రవేశించడాన్ని నిషేధించింది. అందుచే సుభాష్ చంద్రబోసును నేను ఇంగ్లాండులో చూడ డం తటస్థించలేదు. నేను ఇండియాకు 1937 లో వెళ్ళిన తర్వాత 1939 లో సుభాష్ చంద్రబోసు కాంగ్రెసు అధ్యక్ష పదవినుండి రాజీనామాచేసిన కాలంలో ఆయన్ను కాకినాడ విద్యార్థి ఉద్యమ మహాసభలకు అహ్వానించినప్పుడు నా అతిథిగా ఒక రోజు మా యింట్లో వున్నాడు. అదేరోజున రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది.

నేను స్కూలులో ప్రవేశించేటప్పటికి (1918) మొదటి ప్రపంచ యుద్ధం సమాప్తమైందని వివరించాను. నేను ఇంగ్లాండు ప్రవేశించిన ఒక నెల రోజులకు జర్మనీలో హిట్లరు నియంతృత్వము (1933) ప్రారంభించి రెండవ ప్రపంచ యుద్ధానికి బీజాలు పడ్డాయి. మొదటి ప్రపంచ యుద్ధంలో సామ్రాజ్య వాద దేశాలు విజయం సాధించినప్పటికి జర్మన్ రష్యన్ సామ్రాజ్య వ్యవస్థలు చితికిపోయాయి. రష్యాలో విప్లవం విజయవంతమై జర్మనీలో విప్లవ ప్రతీఘాతం జరిగింది. నేను లండనులో చేరినప్పటికి యూరప్పులో ఒకమూల రష్యాలో కార్మిక నియంతృత్వము వేరొకవైపు జర్మనీలో పెట్టుబడిదారీ నియంతృత్వం ఆవిర్భవణ అప్పటి మానవ వ్యవహారముల తీవ్రవైరుధ్యం నా విద్యార్థి రాజకీయ పరి శోధనకు ఒక సంఘటన అనాలి.

యీ ప్రపంచ ఆర్థిక సంక్షోభము తీవ్రదశకు చేరుకొన్నది. దీనినుండి బయటపడడానికి పెట్టుబడిదారీ దేశాలకు సులువైన వ్యవహారం కాలేని రోజులు. ఇటలీలో ముస్సోలినీ ఫాసిజం నాటుకొని నియంతృత్వాన్ని సాగిస్తుంది. ఆర్థిక సంక్షోభములో నిరుద్యోగం పెట్టుబడి దేశాలలో పెరిగింది. పెట్టుబడిదారీ పాలకవర్గాలకు సామ్రాజ్యవాద దేశాలకు అగ్నిపరీక్ష ప్రారంభించింది. జపాన్ చైనాపై యుద్ధంచేసి మంచూరియాను కబళించింది, పూర్వ ప్రాంతంలో యుద్ధం ప్రారంభము కావడం యూరపులో బయలుదేరిన ఆర్థిక సంక్షోభానికి తోడైంది.

ఇక యూరపులో హిట్లరు నాజీపార్టీ ప్రపంచ అభివృద్ధి నిరోధక శక్తులకు ఆహ్లాదకరమైన వ్యవస్థగా తయారైంది. విప్లవ శక్తులను, ప్రజాస్వామిక వ్యవస్థలను దెబ్బతీయడానికి జర్మనీలో తలెత్తిన ఫాసిజం దారితీసింది.

లండనులో లేబరుపార్టీ శాఖలు, యుద్ధ వ్యతిరేక సంస్థలు, స్వతంత్ర లేబర్ పార్టీ, కమ్యూనిస్టు పార్టీ, సామ్రాజ్యవాద వ్యతిరేక లీగ్ మొదలగు సంస్థలు ఫాసిజానికి వ్యతిరేకంగాను, యుద్ధానికి వ్యతిరేకంగాను ఆందోళనలు ప్రారంభించాయి. ఈ ఆందోళన కార్యక్రమాల్లో యుద్ధానికి వ్యతిరేకంగాను, హిట్లరు ఫాసిజానికి వ్యతిరేకంగాను పాల్గొనే వాడను. జార్జి పాడ్ మోర్ అనే నీగ్రో నాయకుడు లండనులో లేబరు సోషలిస్టు ఉద్యమానికి అనుకూలుడు నాకు

తెలుసున్న వ్యక్తి. ఆఫ్రికాలోని బ్రిటీషు, ఫ్రెంచి వలస పెత్తందార్ల కిందవున్న ఆఫ్రికారాజ్యాల స్థితిగతుల గురించి వారి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకై పోరాటం గురించి కొన్ని పుస్తకాలు వ్రాసాడు. చాలకాలము యూరపులోను, ఇంగ్లాండులో వుండిపోయాడు.

నా బెంగాలీ మిత్రుడు యస్.సి. ముఖర్జీ ఇంగ్లాండులో లా చదువుతూ ఎక్కువగా సామ్రాజ్య వ్యతిరేక ప్రచారంలో పాల్గొనేవాడు. నాకు మిత్రుడు. ముఖర్జీ ఇంగ్లాండులోనే (1978) వున్నట్లు తెలుసు.

చాల తెలివైనవాడు. ఏదైనా పని సాధించడానికి తన వాగ్ధాటితో యితరులకు నచ్చచెప్పి సాధించుకొనేవాడు. ఏదైనా ఒక విషయంపై చర్చించాలంటే దానికి సంబంధించి అనుకూల వ్యతిరేక గ్రంథాలు ఆధారాలన్నీ తెచ్చి చదివి తయారయ్యేవాడు. మేమిద్దరమూ లండను బ్రిటీషు లైబ్రరీలో చదువుకోడానికి వెళ్ళేవారమూ. నేను కమ్యూనిస్టు సిద్ధాంతానికి అనుకూలమైన వ్యక్తిని కాని ముఖర్జీ కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని వ్యతిరేకించలేదు. బ్రిటీషు సామ్రాజ్య వాదానికి బద్ధవిరోధి.

విఠల్ భాయి పటేల్ కూడా లండను వచ్చినప్పుడు ఆయన బహిరంగ సభకు వెళ్ళాను, ఆయన్ను కలుసు కొన్నాను. విఠల్ భాయి వల్లభాయిపటేల్ అన్నగారు, అప్పటి జాతీయ కాంగ్రెసు నాయకత్వంలో గాంధీజీతో

వేదించి, మోతీలాల్ నెహ్రూ (జవహర్‌లాల్ నెహ్రూ తండ్రి) కలసి ఎన్నికలలో పాల్గొని బ్రిటీషు పాలన గురించి పార్లమెంటరీ రంగంనుండి బహిరంగ వర్చాలని కోరినవారిలో ఒకరు. ఢిల్లీలోని లెజిస్లేటివ్ అసెంబ్లీ ఎన్నికలకు విఠల్‌బాయి పటేల్ ఎన్నికై దాని నాయకుడుగా పార్లమెంటరీ రంగంలో బహు సమర్ధవంతమైన వక్తగా వ్యవహరించారు. ఈయన సమావేశానికి లండనులో వున్న భారతీయులు బ్రిటీషు లేబరు రాజకీయవాదులు హాజరైనారు. విఠల్‌బాయి అప్పటికే బాగా వృద్ధుడు. భారతదేశ రాజకీయ నాయకులను లండనులో కలుసుకోడం నాకు అనుభవాన్ని కలుగ చేసింది.

ఇంగ్లాండునుంచి ఇండియాకు బ్రిటీషు ప్రతినిధులతో కలసి ఇండియా లీగు డెలిగేషను పేరుతో వెళ్ళి "ఇండియాలోని పరిస్థితులు" అనే రిపోర్టు లండనులో విడుదలైంది, దానిని నేను చదివాను. ముప్పైవ దశాంకము ప్రారంభములో భారత దేశంలోని జాతీయ ఉద్యమం పరిస్థితి, భారత రాజ్యాంగ సంస్కరణల గురించి బ్రిటీషు పాలకవర్గాల ధోరణులు విధానాలపై నేను సమాచారాన్ని సేకరించుకో గలిగాను. ఈ కాలంలోనే భారతదేశంలో నిర్మాణమవుతున్న కార్మిక ఉద్యమంపై బ్రిటీషు పాలకులు సాగించిన మీరట్ కేసు గురించి పుస్తకం (Meerut Trial) లండనులో అచ్చైంది చదివాను. మీరట్ కుట్ర కేసులో వివిధరాష్ట్రాల

లోని ట్రేడ్ యూనియను నాయకులను నేరస్థులుగా ప్రభుత్వం విచారించడమే కాకుండా బ్రిటీషు కార్మిక నాయకుడు కమ్యూనిష్టు, బెన్ బ్రాడ్‌లేను కూడా చేర్చారు. ఈయనను నేను లండనులో కలుసుకొన్నాను.

బ్రిటీషు కమ్యూనిష్టు పార్టీ తరఫున బెన్ బ్రాడ్లే ఇండియాలో అప్పటి డాంగేవంటి యువకులతో కలసి బొంబాయిలో ట్రేడ్ యూనియను ఉద్యమంలో పనిచేసాడు. మీరటు కుట్ర కేసులో అన్నిరకాల ట్రేడ్ యూనియను నాయకులతో కలసి మొత్తం 31 మందిని బెన్ బ్రాడ్‌లేను కలిపి బ్రిటీషు పాలకులు శిక్షలు విధించారు. ఇతను విడుదలై లండనులో వుండగా అక్కడి విద్యార్థులకు నేను రాజకీయ తరగతులు నడిపేటప్పుడు కలుసుకొన్నాను. కాని బెన్ బ్రాడ్లే బ్రిటనులో వున్న కమ్యూనిష్టు నాయకులు సప్రర్జి సక్లత్ వాలా, పామీదత్తులవలె నన్ను ఆకర్షించలేదు. బెన్ బ్రాడ్లే సంకుచిత ధోరణులు కల వ్యక్తిగా నాకు గోచరించాడు.

సక్లత్ వాలా, పామీదత్తులు యిద్దరూ భారతీయుల బిడ్డలే. పామీదత్తు తండ్రి బెంగాలీయుడు. తల్లి యూరపుస్త్రీ. లండనులో స్థిరపడ్డారు. సక్లత్ వాలా పామీదత్తుకంటె పెద్దవాడు. టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీవారి తరఫున వారి లండను ఆఫీసులో ఉద్యోగానికి వెళ్ళి లండనులో 1925 నాటికే ఉద్యోగానికి రాజీనామాపెట్టి బ్రిటీషు ట్రేడ్ యూనియను ఉద్యమంలో కృషిచేసి బ్రిటీషు కార్మికులలో

పలుకుబడి సంపాదించాను. 1920-22 లో 1924-29 లలో బ్రిటీషు పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికైనాను. ఈయన బ్రిటనులో కమ్యూనిస్టు పార్టీతో సన్నిహితము, నేను లండనులో వుండగానే సక్లత్‌వాలా మృతి చెందారు. బ్రిటీషు కార్మికులు సక్లత్‌వాలాయెడల చాల గౌరవం, ఆదరణ చూపేవారు.

బ్రిటనులోని కన్సర్వేటివ్ పార్టీ ప్రభుత్వం లేబరు పార్టీ ప్రభుత్వం భారత రాజ్యాంగ సంస్కరణలకు సైమన్ కమిషను నియామకంనుండి (1927) నుండి మూడు రౌండు టేబిలు కాన్ఫరెన్సులు జరిపి, 1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టాన్ని పార్లమెంటులో ఆమోదింప చేసాయి. నాకు 16 వ సంవత్సరము వయస్సునుండి హైస్కూలు పూర్తి చేసేటప్పటినుండి కాలేజీ చదువు పూర్తిచేసి లండను వచ్చినప్పటి 1933 లో సదరు సంస్కరణలకై ప్రభుత్వం ఒక శ్వేత పత్రాన్ని ప్రకటించి, భారత ప్రభుత్వ చట్టాన్ని మరో రెండు సంవత్సరాలకు (1935) లో ఆమోదింప చేసింది. భారతదేశంలో జాతీయ ఉద్యమ ఆందోళనను ఒక మూల అణగద్రొక్కుతూ, వేరొక మూల రాజ్యాంగ సంస్కరణల పేరుతో వివిధ వైరుధ్య శక్తుల, భారతదేశంలోని సంస్థానాధీశులతో కలిపి ఒక ఫెడరలు రాజ్యాంగాన్ని తయారుచేసింది. ఈ కాలంలోనే నేను ఇంగ్లాండులో వుండడము, వివిధ భారత జాతీయ నాయకులను లండనులో కలుసుకోటం జరిగింది.

ఈ కాలంలోనే నేను వివిధ భారత జాతీయ నాయకులను లండనులో కలుసుకోడం జరిగింది. 1935 పూర్వం బర్మా భారత దేశంతో కలపి పాలింపబడేది. బ్రిటీషు పాలకులు బర్మాను విడదీసి వేరే రాజ్యాంగాన్ని ఏర్పాటు చేసారు. సామ్రాజ్యవాద శక్తులు తమ ఆదిపత్యం పూర్తిగా శిథిలం కాకుండా, వీలైనంతటిలో తమ లాభాలను కాపాడుకోడానికి చేసిన ఎత్తుగడలని బ్రిటనులోని యీ రాజ్యాంగ సంస్కరణలను సామ్రాజ్యవాద వ్యతిరేక భారతీయులమగు మేము విమర్శించాము. భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్య సాధనకై కృషి సాగించాలని లండనులోని అభ్యుదయ భావాలుగల భారతీయుల ఆందోళన బయలుదేరింది.

ఇదే కాలంలో లండనులో ఇండియన్ స్టూడెంట్సు యూనియను వార్షికోత్సవ సభ వై యమ్ సి ఏ హాస్టలువారు ఏర్పాటు చేసారు. ఆ సభకు అప్పుడు లండనులో వున్న జాతీయ నాయకుడు, మహమ్మదాలీ జిన్నా, బ్రిటీషు కన్సర్వేటివ్ పార్టీ రాజకీయవాది లార్డ్ జట్లెండులను ఆహ్వానించారు.

ఈ సభకు అక్కడి యువక భారతీయులము హాజరైనాము. భారత రాజ్యాంగ సంస్కరణల మేలు అంటూ లార్డ్ జట్లెండ్ చేసిన ఉపన్యాసాన్ని మేము వ్యతిరేకించాము. జిన్నా యొక్క మత రాజకీయ ధోరణిని కూడా వ్యతిరేకించాము. ఆ సభలో వి. కె. కృష్ణమీనన్, జహీర్

మొదలగువారు హాజరైనారు. మేమంతా ప్రశ్నల వరంపరలు జట్ లెండు, జిన్నా ఉపన్యాసాలపై వేసాము. రౌండు టేబిలు కాన్ఫరెన్సునుండి బ్రిటీషు పార్లమెంటు భారత రాజ్యాంగ సంస్కరణల చట్టము తయారుచేసే కాలం లో మహమ్మదాలీ జిన్నా లండనులోనే ఎక్కువగా మకాం పెట్టి, ముస్లిముల హక్కుల రక్షణ జాతీయ కాంగ్రెసు చేతుల్లో కష్టమనే వాదనలు లేవదీస్తూ భారత జాతీయ కాంగ్రెసుతో భేదాలు ప్రారంభించాడు. జాతీయ కాంగ్రెసులో మితవాద శక్తులు వామపక్ష శక్తులుకూడా బయలుదేరుతున్న కాలము,

ఒకమూల బ్రిటీషు ప్రభుత్వం మితవాద శక్తులను ప్రోత్సహించడము, వేరొకమూల వామపక్షాన్ని వేరుచేయు డానికి నిర్బంధ యంత్రాంగాన్ని భారతదేశంలో సాగించింది. భారతదేశంలో శాసనోల్లంఘన ఉద్యమాన్ని లేవదీసిన కాంగ్రెసుపై బ్రిటీషు ప్రభుత్వం నిషేధాన్ని విధించి తదుపరి ఒక సంవత్సరంలోనే 1934 లో ఆ నిషేధాన్ని తొలగించింది, అప్పటికే బాల్యావస్థలో వున్న భారత కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని విధించింది. ఈ దశలోనే గాంధీజీ కాంగ్రెసు లోని వామపక్షాల పెరుగుదల యిష్టపడక తన అనుచరులలో కూడా భేదాభిప్రాయాలు మూలంగా కాంగ్రెసునుండి రాజీనామా చేసారు. ఇదే కాలంలో (1934) లో ఇండి యాలో కాంగ్రెసులో భాగంగా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఆవిర్భవించింది.

కాంగ్రెసు జాతీయ ఉద్యమంగాను, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులకు ఒక కేంద్రంగాను వున్న సంస్థలో మితవాదుల ధోరణిలో, వామపక్ష ధోరణిలో సంఘర్షణ వున్నది. గాంధీజీ నాయకత్వంలో పాతకాలపు కాంగ్రెసు మితవాద శక్తులపై తనది పైచేయి అయినప్పటికి, ఆధునికమైన వామపక్షాలతో ఏకీభవించలేదు. వారు కాంగ్రెసు సోషలిస్టులుగా తదుపరి మారినా కాంగ్రెసు సంస్థలోనే వున్నారు. వారికి అప్పటి దశలో జవహర్‌లాల్ నెహ్రూ మద్దతు వున్నదనాలి, అశోక మెహతా మసానీ మొదలగువారు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నిర్మాణంలో కృషి సాగించారు, "కాంగ్రెసు సోషలిస్టు" అనే వార పత్రికను బొంబాయినుండి అచ్చువేసారు. ఈ పత్రికకు నేను లండనునుండి వ్యాసాలు పంపేవాడిని. నేను ఇంగ్లాండునుండి ఇండియాకు బయలుదేరే (1937) కాలానికి ప్రధానంగా వ్రాసిన రెండు వ్యాసాలు చాల ముఖ్యమైనవిగా నేను భావించుకొంటున్నాను. ఒకటి భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమ ఐక్యతకు హిందూ ముస్లింల రాజకీయ అన్యోన్యత అవసరమని హెచ్చరించాను. రెండవ వ్యాసం యూరప్‌లో రెండవ ప్రపంచ యుద్ధం బయలుదేరే ప్రమాదమున్నదని రెండవ ప్రపంచ యుద్ధం సంభవిస్తే హిట్లరు ముస్సోలినీల ఫాసిజం అంతమే కాకుండా, సామ్రాజ్యవాదమే శిథిలమవు తుందని హెచ్చరించాను. కాంగ్రెసు సోషలిస్టు పత్రికకు 1936 లో యీ వ్యాసాలు వ్రాసిన కాలము, అప్పుడు నేను నా వ్యాసాలకు కలంపేరు "బుద్దా 2" అని పెట్టాను.

నాకు లండను (West-End) టూవిటన్ వీధిలో మకాంకు అద్దె ఎక్కువ అని మార్చాలని ఉద్దేశపడ్డాను. అందుచే లండను 14. లైశాన్ వీధిలోని మకాంకు వెళ్ళాను. హెమ్‌స్టెడ్ హీత్ పార్కుకు దగ్గరగావున్న ప్రదేశం, సెంట్రలు లండనుకు కొంత దూరమైనా అక్కడనుండి భూగర్భ రైలులో అతి త్వరితంగా సెంట్రల్ లండను చేర వచ్చు. ఆ ఇంటి యజమానురాలు (land lady) ఉదయం టిఫిన్ వగైరాలు, రాత్రి భోజనము గది అద్దె కలిపి చౌకగా వుంటూ, మంచి భోజన సదుపాయం, గదులు శుభ్రంగా వుంచడంలోనూ, ఎవరైనా అతిథి వస్తే భోజన ఏర్పాటు చేయడంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొనేది. ఆ యింట్లో నాలుగు గదులే వున్నాయి.

ఆ యింటి యజమానురాలు పేరు మిసెస్ సాండర్సు. ఆమె భర్త సాండర్సు అనుభవమున్న లండను టైలర్, బాగా సంపాదిస్తాడు. మిసెస్ సాండర్సు తాను మధ్య ఇంగ్లాండు గ్రామంలో పుట్టానని తనతండ్రికి చాలమంది పిల్లలుండుటచే చాల చాకిరీ యింటివద్ద చేసేదని, తాను మొదటి ప్రపంచ యుద్ధానికి చిన్నవయస్సులోనే లండను వచ్చి పనిలో చేరానని చెప్పింది. తన 30 వ ఏట మిస్టరు సాండర్సును పెండ్లి చేసుకొన్నానన్నది. అప్పటికి సాండర్సుకు 40 సంవత్సరాలట. అతని మొదటి భార్య చనిపోతే యితన్ని పెండ్లి చేసుకొన్నా నన్నది. సాండర్సుకు మొదటిభార్యకు ఒక కూతురు వున్నది.

ఆ కూతురుకు పెండ్లిఅయి పని చేసుకొంటుంది. తన స్వయం కృషివలన మిసెస్ సాండర్సు ఒక యిల్లు కొనుక్కొని భారత విద్యార్థులను మాత్రమే డబ్బిచ్చి నివసించే అతిథులు (paying guest) గా తీసుకొంటుంది.

మిసెస్ సాండర్సుకు పని మనుష్యులు ఎవరూలేరు. తన సవతికూతురు మాత్రం తీరుబడి సమయంలో వచ్చి యిల్లు శుభ్రపర్చడం, యింటిమెట్లు కిందిగదులు, మేడ గదులు తుడవడం మొదలగు సహాయం చేస్తుంది; సవతి కూతురు వేరే నివసిస్తుంది. కాని యింటి రోజువారీ పనులన్నీ మిసెస్ సాండర్సు చేసేది. బజారునుంచి ఆహార పదార్థాలు తీసుకు రావడం, వంట వండడమూ, మాకు ఉదయం టిఫిన్ వగైరాలు (break-fast) యివ్వడం, రాత్రి భోజనాలు పర్పాలు చేయడం యీామె చేసేది. ఇంటి పనులన్నీ చాల కష్టపడి చేసేది. ఆమె భర్త మంచి స్పెషల్ టైలరుగా బాగా ఆదాయం సంపాదించి, అంతా మిసెస్ సాండర్సు అక్కౌంటు లోనే వేసేవాడు. తనకు ఏ ఖర్చు కావలసినా ఆమె యివ్వాలి.

పని అయిపోయినతోడనే ఆమె భర్త సాయంత్రం యింటికి వచ్చి తన వంటింట్లో వున్న కుర్చీలో కూర్చోవాలి. మేము ఆ యింట్లో అతిథులుగా చేరేటప్పటికి మిసెస్ సాండర్సుకు 50 సంవత్సరా లుంటాయి. ఆమె భర్తకు 60 సంవత్సరా లుంటాయి. మిసెస్ సాండర్సుకు కోపము హెచ్చు, ఆమె భర్త బహు సాత్వికుడు. అతని పోగాకు

పై ఫుటు ఖర్చు, పనిలోకి రానుబోను ప్రయాణం బస్సు వగైరా ఖర్చు మినహా మిగతా ఏ ఖర్చు పెట్టడానికి వీలులేదు.

మేము ఎప్పుడైనా మిసెస్ సాండర్స్‌తో తనకు కావలసిన డబ్బు వున్నదికదా అంతా మిగుల్చుకొని అనవసరంగా యింటిచాకిరీ వంటచాకిరీ చేసుకొనే బదులు ఏదైనా పని మనిషిని పెట్టుకోకూడదా అంటే, తనకు పూర్తి పని లేకపోతే మతిపోతుంది అనేది. చిన్నతనంలో రోజుకు 6 పెన్నీలు సంపాదించుకొని, వంట మనిషిగా పనిచేసి, డబ్బు పోగుచేసుకొని రెండు యిళ్ళకు యజమానురాలైనానని గర్వంగా చెప్పేది. బిడ్డెన్ డెన్ అనే సముద్రతీరపు గ్రామంలో మరో యిల్లు వున్నది. ఎండా కాలంలో వేసవికాలపు అతిథులకు ఆ యిల్లు అద్దెకు యిచ్చేది.

నేను అనేక విషయాలపైన చాల పుస్తకాలు కొని నా గదిలో బల్లమీద పేర్చేవాడను. "ఇన్ని పుస్తకాలు ఎందుకు కొంటావు. మీ నాన్న డబ్బు వృధా చేస్తున్నావు, మీ నాన్నకు తెలిస్తే వూరుకొంటారా" అనేది.

మా నాన్న ఫోటో నా పెట్టెలోనుంచి తీసి ఆయన ఆమెకు చూపించి "మా నాన్న లోభిలాగ కనపడుతున్నారా లేక ఉదారమైన మనిషిగా కనపడుతున్నారా?" అని అడిగాను. "మీ నాన్న చాల వర్చస్సు కలవాడై, చాల ఉదారమైన పురుషుడుగా కనబడుతున్నాడు." అన్నది. "అందుకే నా ఆటలు సాగుతున్నాయి, ఈ దేశం రాగలిగాను

అన్నాను. మీ మనుష్యుల కంటె మీ పుస్తకాలే నాకు మక్కువ ఎక్కువ" అన్నాను. "నా కెందుకులే నీవు ఎన్ని పుస్తకాలు కొనుక్కొంటే, నా బల్ల నీ పుస్తకాల బరువుకు విరిగిపోకుండా చూడు" అనేది.

మిసెస్ సాండర్సు మొదటి ప్రపంచ యుద్ధకాలంలో లండనులో డాక్టరు మాసరిక్ యింట్లో వంటపని చేసిందట. ఆ ప్రపంచ యుద్ధకాలంలో యూరపు చెక్ జాతి నాయకు డగు డాక్టరు మాసరిక్ యూరపులో తమ చెక్ జాతికి ప్రత్యేక ప్రతిపత్తిగల రాజ్యం ఏర్పాటు కావాలని పోరాడు తున్న జాతీయ నాయకుడు. బ్రిటీషు ప్రభుత్వం జర్మనీ కైజర్ సామ్రాజ్యాన్ని యుద్ధపోరాటంలో దెబ్బతీయడానికి యూరపులో చెక్ ల సహాయం అర్థించింది. ఆ సందర్భమూగా యుద్ధ సమయంలో డాక్టరు మాసరిక్ కు బ్రిటీషు ప్రభుత్వం లండనులో ఆశ్రయ మిచ్చి, ఆయనకు తగిన ప్రోత్సాహం రక్షణ చేసింది. అప్పుడే డాక్టరు మాసరిక్ దగ్గర మిసెస్ సాండర్సు పనిచేసింది. ఈ విషయం మాకు ఆమె చెప్పినప్పుడు "మేముకూడా యిప్పుడు బ్రిటీషు సామ్రాజ్య పెత్తందారీ తనము పోయి మా దేశం స్వాతంత్ర్యము కావాలని పోరాడు తున్నాము. మాకు కూడా నీవు వంటచేసి పెడుతున్నావు ఏ మంటావు మిసెస్ సాండర్సు" అంటే "బ్రిటీషువాళ్ళు మీ దేశంపై పెత్తనం చేయడం మీ పొరపాటు" అనేది.

"హిట్లరు మీ ఇంగ్లీషు దేశంపై పెత్తనానికి యీ రోజుల్లో వస్తానంటున్నాడు, ఏమంటావు" అని అంటే "అలా వస్తే హిట్లరు మెడ విరగ గొడతాము" అనేది, "ఆపనే మా దేశంపై పెత్తనంచేస్తున్న మీ బ్రిటీషువాళ్ళను చెయ్యమంటావా" అంటే "అది చేయకే వాళ్ళు మీపైన పెత్తనం చేస్తున్నారు" అనేది. మిసెస్సు సాండర్సు ఉదయాన్ని మాకు వచ్చే దిన పత్రికల హెడ్డింగులన్నీ ఒక్కసారి చదవేసి జ్ఞాపకంతో మాకు వివరించేది.

తన వంటింట్లోకి వెళ్ళి కబుర్లు ఎప్పుడైనా చెబితే చాల ఆప్యాయతతో వుండేది, డైనింగు హాలులో మంచి మంచి కూరలు, సెలాడులు తెచ్చేది, లేకపోతే ముక్తసరిగా వుండేది. వారానికి తాను బిల్లు యిచ్చినతోడనే డబ్బు చెల్లిస్తే చాల ఆనందంగా వుండేది, ఆలస్యం చేస్తే ముక్తసరిగా వుండేది, ఆ యింట్లో వున్నంతకాలము నేను ఉదయాన్ని లేచి రీజెంటు పార్కులో నున్న చెరువులో ఒక బోటు అద్దెకు తీసుకొని ఒకగంట దానిని నీటిలో నడిపి కొంత శరీరానికి బలానికై కసరత్తుగా ( **Exercise** ) చేసేవాడిని. తరువాత లైతాన్ రోడ్డు యింటికి వచ్చి ఉదయం భోజనం చేసి ప్రసిద్ధ బ్రిటీషు మ్యూజియం లైబ్రరీకి వెళ్ళి రాజకీయ, ఆర్థిక, చారిత్రక శాస్త్రాల గ్రంథాలు పరిశోధన చేసేవాడిని, మార్క్సు గ్రంథాలను బ్రిటీషు మ్యూజియంలో చదివేవాడిని.

# చార్లెసు డార్విన్ — కార్లు మార్క్సు

నేను జీవిస్తున్న కాలము, సాగుతున్న ఘటనలు రెండు ఖండాల పర్యటన సుమారు అయిదు సంవత్సరాలు లండను నివాసము నా యువక దశలో నూతన ప్రపంచ దృక్పథానికి పునాది కలుగచేసింది. నా మానసిక ప్రవృత్తికి పరిపక్వతకు ప్రధానంగా చార్లెసు డార్విను తదుపరి కార్లు మార్క్సుల జీవిత కృషి పరిశోధనలు ప్రబోధ సారాంశము నాకు ప్రత్యేక పునాదులని స్పష్టం చేయాలి. తదుపరి వ్లాడిమిర్ ఇల్యిచ్ లెనిన్ విప్లవ పోరాటం అక్టోబరు రష్యాను విప్లవ విజయం నన్ను ప్రభావితం చేసాయి.

లండనులో యీ మహనీయుల గ్రంథాలు కొన్ని కొని సేకరించాను, అదికాక ప్రఖ్యాత బ్రిటీషు మ్యూజియం లైబ్రరీలో వీరి మూల గ్రంథాలు చదివాను.

ప్రకృతి ప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు చార్లెసు డార్విను పాఠాలు నా కాలేజీ చదువులోనే జీవశాస్త్రము చదివేటప్పుడు కొంత పరిచయమై, లండను నివాస కాలములో ఆయన శాస్త్రీయ గ్రంథాలు చదవడము సులువైంది. భౌతికవాద అవగాహనకు నాకు ఆ దశలో వుపయోగపడింది. నిజమగు నైతిక విలువల మార్గము విడవకుండా, నా చాంధస ధోరణులగు దైవతత్వము మూఢనమ్మకలు శిథిలం కావడానికి చార్లెసు డార్విన్ జీవశాస్త్ర పరిశోధనలు నన్ను చైతన్యం చేసాయి. ఈ

బ్రిటీషు శాస్త్రజ్ఞుడు 19 వ శతాబ్దంలో జీవ ప్రపంచము యొక్క చారిత్రక అభివృద్ధిని వివరించారు. ప్రాణిజాతుల పుట్టుక ( origin of species ) గ్రంథము చార్లెను డార్విన్ స్వీయచరిత్ర నేను చదివి విషయ పరిజ్ఞానము పొందాను. డార్విన్ తన 23 వ వయస్సులో ప్రపంచ యాత్ర (1831–1836 లో) H M S బీగుల్‌లో పయనించి దక్షిణ అమెరికాలోని వృక్షజాతుల జంతుజాతుల వివరాలన్ని సేకరించి, యీ పరిశోధనలనుండి తన ప్రముఖ గ్రంథాల్లో మార్పులు ప్రాణుల ఆవిర్భవానికి ఉనికికి ప్రకృతిలోని జీవ పోరాటాన్ని వివరించారు. డార్విన్ తాత్వికుడు, నాస్తికుడు, భౌతికవాది.

జీవాలయొక్క లోతును గ్రహించడానికి చార్లెను డార్వీను నాకు అత్యంత ఆకర్షణీయమైన ప్రబోధకుడయ్యాడు. లండనులో నాకున్న స్వేచ్ఛ, విజ్ఞాన కుతూహాలం యిందుకు సహాయపడ్డాయి. అయితే విజ్ఞాన వికాశంతో పాటు కష్టాల మూటలు కూడా నాకు తయారవుతూ వచ్చాయి. అందుకు నేను సిద్ధపడ్డాను. అనుసరించే మార్గము సరైనదా లేదా అనే అంచనా మాత్రం వేసుకోగలిగాను కాని దీనికి ప్రతిబంధకాలు అంచనా వేసుకోడంచలేదు

ఎందుచేతనంటే నాకు ఆదర్శమైన మహనీయుల జీవిత చరిత్ర సత్యాన్వేషనలో కష్టాలను ఎదుర్కోడంలోనే జీవిత భాగమయింది. మనుష్యుల పుట్టుక, దానంతటది సంభవిం

చిందికాదని యితర ప్రాణులనుండి అభివృద్ధి అని ప్రాణి నిలద్రొక్కుకోడం ప్రకృతిలో నిలకడకు సాగుతున్న పోరాట భాగమని ( struggle for existence ) డార్విను సిద్ధాంత ములో ఒక భాగము. బ్రిటీషు ప్ర్యాడలు మతాధిపతులు, వారి అనుచర బృందము, తీవ్ర వ్యతిరేకత లేవదీసి చార్లెసు డార్వినును అపఖ్యాతి చేయడానికి జరిపిన ప్రయత్నాలన్ని డార్విన్ ను చలింప చేయలేదు. డార్విన్ పరిశోధనలోని సత్యాలు రాబోయే తరాలకు పనిముట్టులే కాకుండా, 19 వ శతాబ్దంలో డార్విన్ వృక్ష జంతు శాస్త్ర పరిశోధనా సత్యాలకు తోడు మానవజాతి జీవనాభ్యున్నతికి సంబంధించిన పరిశోధనలు బయలుదేరాయి.

నా దేశంలో నేను చదువు ప్రారంభించిన కాలములో బుద్ధుని సందేశ పాఠం మొదలుకొని గాంధీజీ నాయకత్వంలో సహాయ నిరాకరణోద్యమంలో భారత జాతీయ విమోచనా ఉద్యమంలో పరిచయం ప్రారంభించి, ఇంగ్లాండులోని రాజకీయ విజ్ఞాన పరిశోధనలో ప్రపంచ శ్రామికవర్గ నాయకుడు శాస్త్రీయ కమ్యూనిజ సిద్ధాంత ప్రబోధకుడగు కార్లు మార్క్సు జీవిత కృషి బోధనలు అందుబాటైనాయి

చార్లెసు డార్వినూ, కార్లు మార్క్సు సమకాలీనులు. డార్వినూ, మార్క్సు కంటె తొమ్మిది సంవత్సరాలు ముందు పుట్టాడు. 19 వ శతాబ్దంలో 80 వ దశకంలో యిద్దరూ అస్తమించారు, కాని వారి జీవితకృషి పరిశోధనలు మానవ

జాతిని ప్రభావితం చేసాయి. ప్రపంచములోని ప్రాణుల యెడల మానవ దృక్పథాన్ని ప్రసరింపచేసాయి. ప్రపంచ అవగాహనకు మానవ పురోగమనానికి కార్లు మార్క్సు పరిశోధనలు డార్విన్ సిద్ధాంతాలను ముందుకు తీసుకుపోయాయి.

మార్క్సు సిద్ధాంతమూ అవగాహన నన్ను జాతీయవాదమునుండి సోషలిస్టు సిద్ధాంత అవగాహనకు దారితీసింది. వలస పరిపాలననుండి ప్రజ విముక్తి కావడం సరిపోదు, సామ్రాజ్యవాద పరిపాలన పోకపోతే జాతీయ కాపిటలిస్టు, భూస్వాముల పరిపాలన బహుజనంయొక్క ఆర్థిక సమానత్వాన్ని కలుగచేయదు, కనుక భారత ప్రజ పురోగమించాలంటే సోషలిస్టు సామాజిక వ్యవస్థ గమ్యస్థానమని మార్క్సుయొక్క సిద్ధాంత పరిశోధననుండి గుర్తించాను. కార్లు మార్క్సు నా పుట్టుకకు పూర్వము సుమారు ఒక శతాబ్దము ముందు 1818 లో జన్మించారు. ఆయన గ్రంథాలు నాకు లండనులో అందుబాటుకు సుమారు అర్థ శతాబ్దము ముందు లండనులో మార్క్సు దివంగతులైనారు.

1849 నుండి 1883 జీవితాంతరం వరకు ఆయన లండనులోనే స్థిరనివాసము ఏర్పర్చుకొని, ప్రపంచ కార్మిక వర్గానికి శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతాన్ని, కమ్యూనిజాన్ని అందచేయుటలో అన్ని కష్టాలు భరించారు. నేను ఇంగ్లాండులో వున్నప్పటికే మార్క్సుయొక్క సిద్ధాంతాలు బ్రిటీషు విద్యా కళాశాలలో ప్రవేశించకుండా అడ్డుగోడలు కట్టారని

విమర్శలున్నాయి. మార్క్సు జర్మనీలో 1835 సెకండరీ విద్యను అభ్యసించి, 1841 లో బెర్లిన్ విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్ర డాక్టరేటు పొందారు. న్యాయశాస్త్రము తదుపరి చరిత్ర, తత్వశాస్త్రములలో ప్రవీణత పొందారు. జర్మను విశ్వ విద్యాలయంలో తత్వశాస్త్ర ప్రొఫెసరుగా ప్రయత్నించారు కాని అప్పటి రాజకీయ పరిస్థితుల ప్రభావంచే జర్మను తత్వవేత్త హెగిల్ సిద్ధాంతాలలోని సూత్రాలకు, ఆచరణకు వైరుధ్యం మూలంగా హెగిల్ అనుచరులతో సంఘర్షణ పడ్డారు. వామపక్ష హెగిల్ అనుచరులను బలపర్చారు. మార్క్సు 1842 లో "రైనిష్ జీటింగు" (Rheiniche Zeiting) పత్రికా నిర్వహణ పూనుకొని విప్లవ ప్రజాస్వామ్య సూత్రాలను ప్రసారం చేయుడంతో అధికారవర్గంతో సంఘర్షణ బయలుదేరింది. ఒక్క సంవత్సరములోనే పత్రిక మూసివేయబడింది.

మార్క్సుకు 18 సంవత్సరాల వయస్సులో జెన్నీవాన్ వెస్టుపాలెన్‌లో నిశ్చితార్థము జరిగి 1843 లో వివాహాము జరిగి యిద్దరూ బహు ఆదర్శ దంపతులుగా ప్రవాసంలోనూ, ఆర్థిక చిక్కులలోనూ కష్టాలను ఎదుర్కొంటూ జీవిత భాగస్వాములుగా వుండి తమ ఉన్నత ఆశయాలను కొనసాగించారు. జెన్నీవాన్ వెస్టుపాలెన్ ఒక సంపన్న కుటుంబమునకు చెందినప్పటికి అప్పటి పాలకవర్గ తరగతికి చెందిన ఒక ప్రీవీ కౌన్సిలరు కూతురైనప్పటికీ, కార్లు

మార్క్సు అసాధారణ మేధాశక్తిని ముందే గుర్తించి తన జీవితాన్ని ఆయనకు అంకితముచేసి కుటుంబ భారాన్ని మోసిన ఉత్తమ యిల్లాలని వివరించక తప్పదు.

మార్క్సు జెన్నీవాన్ 1843 లో ప్యారిస్ చేరారు. శ్రామికవర్గ పాత్రగురించి, శాస్త్రీయ ప్రపంచ దృక్పథం గురించి అవగాహన చేసుకొంటున్న దశలో మార్క్సు కాబోయే తన సన్నిహిత సహచరుడు ఫ్రెడరిక్ ఎంగిల్సును ప్యారిస్‌లో కలుసుకొన్నారు. ఇద్దరూ తదుపరి ఇంగ్లాండులో నివాసము ఏర్పర్చుకొని శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంత ప్రబోధనకు సహకరించుకొన్నారు.

ఎంగిల్సు మార్క్సుకంటె రెండు సంవత్సరములు చిన్న. ఎంగిల్సు తన 21 వ సంవత్సర వయస్సులో జర్మనీ మిలటరీ సర్వీసులో చేరి వామపక్ష హెగీలియనులతో కలసి, హెగిలులోని కాన్సర్వేటివ్ ధోరణులను విమర్శించడము అప్పటి జర్మను అభ్యుదయకర రాజకీయ వాతావరణలో సద్దారు.

అయితే ఎంగిల్సు తండ్రి తన కొడుకును వ్యాపారంలో ప్రవేశింప చేయడానికి ఇంగ్లాండు పంపించడమూ జరిగింది. ఇంగ్లాండులో ఎంగిల్సు శ్రామికవర్గ స్థితిగతులను పరిశీలించి "ఇంగ్లాండులోని కార్మికవర్గ పరిస్థితి" అనే గ్రంథాన్ని 1845 లో రచించారు. ఎంగిల్సు ఇంగ్లాండులో సోషలిస్టు భావాలను స్వీకరించారు.

# మార్క్సు, ఎంగిల్సు

మార్క్సు ఎంగిల్సు ప్యారిస్‌లో 1844 లో కలుసుకొన్నారు. ఇద్దరూ కలసి పవిత్ర కుటుంబమూ, జర్మను సిద్ధాంతమూ (The Holy Family and German ideology) 1844_46 లో రచించారు. వారి భౌతికవాద తత్వ సూత్రాలను యివి స్పష్టీకరించి, పెట్టుబడిదారీ వ్యవస్థ పోయి సోషలిస్టు సామాజిక వ్యవస్థ ఆవిర్భవించడాన్ని సూత్రీకరించాయి. ఇద్దరూ కలసి "తత్వశాస్త్ర లేమి" (Poverty of philosophy) 1847 లో వ్రాసారు. దీనిలో అభివృద్ధి నిరోధక భావాలను విమర్శించి, కార్మికవర్గ విప్లవం సంభవమని స్పష్టీకరించారు.

బ్రసల్సులో (Brussels) రహస్యకమ్యూనిస్టు లీగులో చేరి, దాని రెండవ కాంగ్రెసులో పాల్గొని, "కమ్యూనిస్టు మానిఫెస్టోను" 1948 లో తయారు చేసారు. ఈ ప్రముఖ రాజకీయ పత్రము 1848 లో మార్క్సు, ఎంగిల్సు జర్మను భాషలో మొదట తయారుచేసారు. 1948 లోనే మొదటిసారిగా లండనులో అచ్చైంది.

మార్క్సు, ఎంగిల్సు రచించిన యీ సిద్ధాంత పత్రాన్ని నేను బ్రిటీషు మ్యూజియం లైబ్రరీలో ప్రథమంగా చదివాను. సాంఘిక జీవనముయొక్క మార్పులు వర్గపోరాటంద్వారా సంభవిస్తూ చారిత్రక పరిణామం చెందుతున్నాయి.

నూతన ప్రపంచ దృక్పదంయొక్క ఆవశ్యకత, విప్లవాత్మకమైన మార్పుద్వారా నూతన సమాజం ఆవిర్భవిసుం

దని శ్రామికవర్గం తన చారిత్రక పాత్రను నిర్వహించుటకు వర్గరాహిత్య సమాజ నిర్మాణానికి శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంత ఆవశ్యకత మార్క్సు సూచనలు చాటుతున్నాయి.

1848_49 లలో బూర్జువా విప్లవాలు యూరపులో బయలుదేరడం, మార్క్సు బెల్జియంనుండి, జర్మనీనుండి, ఫ్రాన్సునుండి బహిష్కరింపబడడము, యిక 1849 నుండి లండనుకు వెళ్ళిపోయారు. యూరపులోని బూర్జువా విప్లవాల పరిణామాలనుండి మార్క్సు తగిన గుణపాఠాలను తీయ గలిగారు. కార్మిక, కర్షక ఐక్యత, సోషలిస్టు విప్లవం, శ్రామికవర్గ నియంతృత్వము, బూర్జువా పాలనా యంత్రాగాన్ని నిర్మూలించే ఆవశ్యకత మార్క్సు తన గ్రంధాలగు 18 వ బ్రూమెయిర్ ఆఫ్ లూయీ బోనాపార్టీ (1852), ఫ్రాన్సులో అంతర్యుద్ధం 1871, క్రిటిక్ ఆఫ్ గోథా ప్రోగ్రాము (1875) లలో వివరించారు. మార్క్సు రాజకీయ, ఆర్థిక శాస్త్రము, కాపిటల్ 1867 లో అచ్చైంది.

19 వ శతాబ్దములో ఆర్థిక, రాజకీయ పరిశోధనలలో మార్క్సు, ఎంగిల్సు విప్లవాత్మక పాత్రను నిర్వహించారు. 19 వ శతాబ్దము శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో సంభ వించిన అభివృద్ధి సోషలిస్టు విప్లవ విజయానికి సహకారిగా బయలుదేరిందనాలి. లెనిన్ మార్క్సు సిద్ధాంతాలను సామ్రాజ్యవాద దశలో ముందుకు తీసుకపోయారు.

మార్క్సు, ఎంగిల్సు, లెనిన్‌ల సిద్ధాంతాలు సామాజిక మార్పు దిశను గమనించడానికి నా యువక దశలోనే తోడ్పడినాయి. అనుభవం సంపాదించుకొన్న కొలదీ కొన్ని సత్యాలు, రుజువులు స్పష్టమైనాయి. పెట్టుబడిదారీ వ్యవస్థకు స్థిరత్వం లేదు. సామ్రాజ్యవాదం శిథిలం కాక తప్పదు. సోషలిస్టు సామాజిక వ్యవస్థ ఒక్కటే వర్గదోపిడిని అరికట్టుతుంది. సామాజిక వ్యవస్థలో మానవుల వ్యక్తిత్వము, గౌరవము నిలబడడానికి మానవత్వం ఉన్నత స్థాయి చేరడానికి కమ్యూనిస్టు సామాజిక వ్యవస్థ అత్యవసరమనే సిద్ధాంతము ప్రబోధం చేయడానికి నాకు దీక్ష ఏర్పడింది.

లండనులో విద్యార్థులగు కొందరు బ్రిటీషు యూరపు దేశ యువకులను, భారతీయులను సమీకరించి ప్రతినెల చారిత్రక, రాజకీయ ఆర్థిక సమస్యలపై చర్చలకు 1935 లో సామ్యవాద స్టడీ కేంద్రాన్ని ( Socialist Study Circle ) ఏర్పాటు చేసాను. నాతోపాటు బ్రిటీషు మ్యూజియం లైబ్రరీలో గ్రంథ పఠనం చేసే యస్. సి. ముఖర్జీ కూడా సహచరుడుగా వున్నాడు. మా యువకులందరూ ఒకే స్థాయి కలవారు కాదు కాని సోషలిస్టు సిద్ధాంతాల శక్తి జ్ఞానం ప్రథమం అయినప్పటికీ కాపిటలిస్టు వ్యవస్థ మార్గాలని సోషలిజం వైపు పురోగమించాలనే దీక్ష కలవారు, భారత దేశపు మరి వెస్టు ఇండీస్, ఆఫ్రికా దేశ యువకులు సామ్రాజ్య వాదానికి విరోధులు. మా స్టడీ సర్కిల్‌లోని బ్రిటీషు

యూరపు విద్యార్థులు హిట్లరు ఫాసిజానికి, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకులు. మా యువక దశలో మామా అనుభవాల విజ్ఞానపరిధినుండి రాజకీయ ప్రచారం ప్రారంభించాము.

నేను తిరిగి నా భారతదేశం చేరేవరకు లండనులో సామ్యవాద స్టడీ కేంద్రాన్ని నిర్వహించాను. ప్రపంచ స్థితి గతులు మారుతున్న రోజులవి; 1935_1937 సంవత్సరకాలంలో లండనులోని కొందరి యువకులకు నేను శాస్త్రీయ కమ్యూనిజం గురించి ప్రబోధాన్ని ప్రారంభించానంటే అదొక మానసిక విజ్ఞాన కార్యక్రమంగా చేసుకొన్నాను కాని అదొక గొప్ప పనిగా ప్రారంభించలేదు. ముందుముందు రాజకీయ వలయంలోకి ప్రవేశించడానికి ప్రాతిపదిక చేసుకోలేదు. నేను నేర్చిన శాస్త్రీయ, రాజకీయ, ఆర్థిక పరిజ్ఞానాన్ని నా వయస్సులోవున్న యువకులకు ప్రబోధించడమే నాకు మంచిది అనుకొన్నాను.

పోతే పెద్ద నాయకులతో పరిచయానికి కాని ఒక రాజకీయ హోదా గురించి కాని నా ప్రాథమిక రాజకీయ ప్రయోగం ప్రారంభం కాలేదు. నేను ఒక వృత్తిలో చిక్కుకుండా నా మానసిక తృరిడుకు శ్రామికవర్గ విముక్తికై కృషికి ప్రథమ మెట్టు అయింది అంటాను. నా మానసిక వికాసానికి, ఆత్మ సంతృప్తికి, నా జీవితమూ వ్యక్తి సంసార

తాపత్రయంలోనే మునిగిపోకుండా నా ప్రజ శ్రామిక వర్గం యొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పోషణజానికై పోరాడడానికి యీ ప్రారంభము మూలంగా నా జీవితము ముగింపు సమయంలో సంతృప్తికి ప్రారంభ రాజకీయం మంచిదిగానే యెందుమూలంగా పరిణమించిందంటాను.

పెట్టుబడిదారీ సామాజిక వ్యవస్థను దగ్గరనుండి పరిశోధించుటకు బ్రిటను నాకు ఒక ప్రయోగశాల ( laboratory ) అయింది. బ్రిటీషు కార్మికుల స్థితిగతులు తెలుసుకోడానికి వారి ట్రేడ్ యూనియను సమావేశాలకు హాజరు కావడమే కాకుండా తూర్పు లండనులో నివసించే కొందరు వర్కర్ల యిండ్లకు వెళ్ళి పరిస్థితులు స్వయంగా తెలుసుకొనేవాడిని. లండను సమీపంలోని కొన్ని ఫ్యాక్టరీలకు వెళ్ళి పరిస్థితులను తెలుసుకొనేవాడిని.

నేను లండను వచ్చిన ఒక సంవత్సరానికే 1934 లో బ్రిటీషు పాలకులు, బ్రిటీషు శ్రామికుల మధ్య వైరుధ్యం కనువిప్పు అయింది. భారతదేశము నుండి ఇంగ్లాండు వచ్చేటప్పటికి ఒక మధ్యతరగతి విద్యార్థిగా జాతీయ చైతన్యము కలిగిన యువకుడుగా ఇండియాలోని బ్రిటీషు పాలకులు, భారత ప్రజలమధ్య వైరుధ్యంలో ఎదుగుతున్నాను. అయితే లండను చేరినతర్వాత 1934 కి బ్రిటీషు సాంఘిక విధానంలో "రెండుజాతులు" చూడగలిగాను, ఒకటి పాలకులజాతి, రెండు శ్రామికులజాతి, ఈ రెండింటి మధ్య

వైరుధ్యం, శ్రామికుల ఆందోళన పోరాటం నాకు స్పష్టం చేసాయి. 1934 కు నాకు మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల జీవిత పోరాటం. శ్రామిక విముక్తికై సోషలిస్టు సిద్ధాంత ప్రబోధం, అప్పుడప్పుడే వారి గ్రంధాలనుండి హృదయంలో నాటుకొంటుంది. ఈ దశలో లండనుకు జాతీయ ఆకలి యాత్ర పేరుతో (The National Hunger March on London) 1500 మంది శ్రామిక ప్రతినిధులతో, బ్రిటను లోని అనేక కార్మికవర్గ సంస్థల ప్రతినిధులతో బయలు దేరడం లండను హైడ్ పార్కులో పోలీసుల యీ కార్మిక ఊరేగింపుపై దండయాత్ర నన్ను బ్రిటనులోని శ్రామిక ఉద్యమంపై సానుభూతి కలుగచేసింది. బ్రిటీషు పెట్టుబడి దారీ విధాన నిర్మూలన శ్రామికుల హక్కుల రక్షణకై పోరాడే బ్రిటీషు కార్మికులకు, సామ్రాజ్యవాద పెత్తనంనుండి విముక్తికై పోరాడుతున్న భారత ప్రజలమధ్య రాజకీయ అవినాభావ సంబంధం అవగాహన చేసుకోడం జరిగింది.

అయితే లండనులోని నా భారతీయ యువక మిత్రులు కొందరు నాతో అంగీకరించేవారు కారు, వారి వాదన బ్రిటీషు ప్రజ ఏ వరకైనా గోకితే అతని చర్మంకింద సామ్రాజ్యవాద తత్వము సాక్షాత్కరిస్తుందనేవారు. బ్రిటీషు సామ్రాజ్యవాదము భారత ప్రజలను ఎలా దోపిడీ చేసుందో, బ్రిటీషు పెట్టుబడిదారీ వ్యవస్థ బ్రిటీషు కార్మికులను దోపిడి చేస్తుందని వాదించేవాడను.

మార్క్సిస్టు సిద్ధాంతంవైపు మొగ్గని బ్రిటనులోని ప్రముఖ రచయితలు శాస్త్రవేత్తలు కూడా బ్రిటీషు పెట్టుబడి దారీ వ్యవస్తను తీవ్ర విమర్శకు గురిచేసినవారే. ఇటువంటి వారి గ్రంథాలు, జార్జి బెర్నార్డుషా, సిడ్నీ బీట్రీసు వెబ్బులు, హెచ్. జి. వేల్సు, హెచ్. జె. లాస్కీ, డి. సి. బర్ను, జాన్ స్ట్రాచీ, బెర్ట్రాన్డ్ రసెల్సు మొదలగువారివి, కొందరు నా యువక మిత్రులచేత చదివించి బ్రిటనులోని అభ్యుదయకర భావాల యెడల మొగ్గు కలిగించేవాడను.

బ్రిటనులో రెండు జాతులు ధనికవర్గము, పేద శ్రామిక వర్గం గురించి ఒక శతాబ్దము క్రితము మార్క్సు వివరించడమే కాకుండా ఆయునకాలమందు 1845 లో బ్రిటీషు ప్రముఖుడు బెంజామిన్ డిస్రైలీ తన గ్రంథము "సిబిల్" మరో శీర్షిక "రెండు జాతులు" అని కూడ వివరించి బ్రిటను లోని ధనిక, పేద వర్గాలు రెండు జాతులుగా విభజించి వాట్ల మధ్య సంఘర్షణ వున్నదన్నాడు.

బ్రిటీషు చరిత్ర అర్థం చేసుకొనేటప్పుడు శ్రామిక ఉద్య మం ఎటువంటి పోరాటాలను సాగించిందో తమ జీవితహక్కుల రక్షణకు ఎటువంటి చారిత్రక ఘట్టాలు దాటిందో తెలుసు కోడము నాకెంతో ముందుముందు వుపయోగపడింది.

ఒక మనిషి తన జీవితకాలంలోని వాస్తవాన్ని తెలుసు కోడానికి తగిన మానసిక చైతన్యం కలిగి వుండాలి. నా యువక దశలో యీ చైతన్యానికి తహతహలాడాను. సాం ఘిక రాజకీయ పరిస్తితులు తోడ్పడ్డాయి.

# ఐరిష్ స్వాతంత్ర్యము

బ్రిటను లోపలవున్న పాలకవర్గానికి, శ్రామికవర్గానికి వైరుధ్యం కారణంగా గతంలో బ్రిటీషు వలస పెత్తనానికి ఐర్లండు ప్రజల స్వాతంత్ర్య ఉద్యమానికి సంఘర్షణ బయలుదేరి మొదటి ప్రపంచ యుద్ధం తరువాత బ్రిటీషు ప్రభుత్వం ఐరిష్ ఫ్రీ స్టేటును ఏర్పర్చి, అల్స్టర్ (Ulster) తమ గుప్పిట్లో పెట్టుకొన్నారు. భారత ప్రజల స్వాతంత్ర్య ఉద్యమానికి, ఐరిష్ ప్రజల స్వాతంత్ర్య ఉద్యమానికి సారూప్య ముండుటచే, ఐర్లండు బ్రిటనుకు సమీపంలో వుండుటచే నేను నా మిత్రుడు ఎస్. సి. ముఖర్జీ ఐరిష్ ఫ్రీ స్టేటు ముఖ్యపట్టణం డబ్లిన్ వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాము. 1936 ఆగష్టులో ఉత్తర, ఇంగ్లాండు లివర్‌పూల్ వెళ్ళి అక్కడనుండి డబ్లిన్ నగరం, స్టీమరులో చేరాము. అది ఒక రాత్రి ప్రయాణం, రాత్రి 10 గంటలకు లివర్‌పూల్‌లో స్టీమరు ఎక్కి, స్టీమరులో నిద్రపోయి ఉదయం 8 గంటలకు డబ్లిన్ పట్టణం చేరుకొన్నాము.

నేను, ముఖర్జీ డబ్లిన్‌లోని వివిధ చారిత్రక స్థలాలు చూడడము, ఐరిష్ ప్రజలతో మాట్లాడడము, వుత్సాహాన్ని కలుగజేసింది. ఐర్లండులో జాతీయ నాయకుడు డి వెలేరా నాయకత్వం కింద ఆయన రిపబ్లికన్ పార్టీ ఐరిష్ పార్లమెంటులో (డయల్) ఆధిపత్యంలో వున్నది.

నేను లండనులో అడుగుపెట్టిన సంవత్సర ప్రారంభములోనే (1932) డివెలీరా పార్టీ ఐరిష్ పార్లమెంటులో అధికారం లోకి వచ్చింది.

డివెలీరా తీవ్రజాతీయవాది. ఐర్లండు బ్రిటీషు కామన్ వెల్తునుండి విడిపోవాలని మితవాద ఐరిష్ జాతీయ నాయకులగు ఆర్దర్ గ్రిఫిత్, మైకెల్ కోలినులతో పోరాటం సాగించి పార్లమెంటులో 10 సంవత్సరాల తరువాత మెజారిటీ సంపాదించుకొని, ఇంగ్లాండుతో తెగతెంపులు చేసుకొనే ప్రాతిపదిక వేసుకొన్నాడు. బ్రిటీషు కామన్ వెల్తునుండి, ఐర్లండును తప్పించాడు. డివెలీరా ప్రభుత్వాన్ని ఇంగ్లాండు లొంగదీయ లేకపోయింది. బ్రిటీషు గవర్నరు జనరలు పదవి రద్దుచేసాడు. బ్రిటనుకు యివ్వవలసిన 5 మిలియన్ల పౌన్ల సాంవత్సరిక భూమిపన్ను రద్దుచేసాడు. ఐర్లండుపై ఆర్థిక ఆంక్షలు విధించినప్పటికీ, డివెలీరా నాయకత్వం క్రింద ఐరిష్ ప్రజలు బ్రహ్మాండమగు విశ్వాసాన్ని చూపి సహకరించారు.

భారత దేశ జాతీయవాదులకు డివెలీరా పోరాటము ఒక ఆదర్శవంతమైన జాతీయ పోరాటంగా బయలుదేరింది. అయితే డివెలీరా మాత్రము తన దేశ విముక్తికై పోరాటంలో అన్ని ఎత్తుగడలు ఉపయోగించాడు. అతని పోరాటం శాంతియుత పోరాటమేమీ కాలేదు, పార్లమెంటరీ వ్యవస్థను కూడా ఉపయోగించి చివరకు ఐరిష్ ప్రజల స్వేచ్ఛను సాధించుకొన్నాడు.

డీవెలీరా జీవితము జాతీయ పోరాట కృషి నన్నెంతో ఆకర్షించింది. ముఖర్జీ, నేను డబ్లిన్ నగరంలోని చారిత్రక స్థలాలన్ని చూచి, డబ్లిన్‌లో రిపబ్లికన్ పార్టీ నాయకులను, ఐరిష్ కమ్యూనిస్టు పార్టీ నాయకులను కలుసుకొన్నాము. ఐరిష్ ప్రజలు, రాజకీయ నాయకులు భారతీయ ప్రజలయెడల చాల అభిమానాన్ని, ప్రేమను చూపేవారు. భారత దేశం కూడా బ్రిటీషు వలస పెత్తందారీ విధానంనుండి విముక్తికై తహతహ లాడడము ఐరిష్ ప్రజల అభిమానానికి ప్రధాన కారణం. ముఖర్జీ, నేను డబ్లిన్ యూనివర్శిటీలో అక్కడి ప్రొఫెసర్లను, విద్యార్థులను కూడా కలుసుకొన్నాము. డబ్లిన్‌లో కొందరు స్నేహితులను సంపాదించుకొన్నాను. నేను లండను వచ్చిన తర్వాత కొందరు ఐరిష్ మేధావులతో వుత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడను.

ప్రముఖ నాటక రచయిత జార్జి బెర్నాడ్‌షా ఐర్లండు దేశస్థుడే. ఆయన నాటకాలు, రచనలు నేను లండనులో చదివాను. బెర్నార్డ్‌షా తన చిన్నవయస్సులోనే తండ్రి పోయినతోడనే తల్లితో కలసి లండనువచ్చి అక్కడ స్థిర నివాసము ఏర్పర్చుకొని, పేదరికం అనుభవించి, తల్లి సంగీత పాఠాలు నేర్పుతుంటే, తాను జర్నలిజం, నాటక విమర్శ కుడుగా, నాటక రచయితగా బ్రిటనులో ప్రఖ్యాతి సంపాదించాడు. ఆయన వ్యంగధోరణి ఘాటైన విమర్శలు, బ్రిటీషు పాలకవర్గంపై పెట్టుబడిదారీ వ్యవస్థపైన తీవ్ర

విమర్శలు నన్ను బాగా ఆకర్షించాయి. లండను నాటకశాలలో బెర్నాడ్‌షా నాటక ప్రదర్శనలు చూసి సంతోషించాను. అక్కడ నేను అప్పుడే తాను వ్రాసిన "రాళ్ల గుట్టపై కెక్కిండి" ( On the Rocks ) బ్రిటీషు సామ్రాజ్య వ్యవస్థపై విమర్శాత్మక నాటక ప్రదర్శనను చూసి ఆనందించాను. బెర్నాడ్‌షా తన రచనలో 1936 లో యిలా సగర్వంగా చెప్పుకొన్నాడు. "ముప్పది సంవత్సరాలు బ్రిటీషు వాళ్ళ బుర్రలో నాటుకొనేలాగ నేను చాల తెలివైన వాడుగా గుద్ది స్పష్టం చేసుకొన్నాను. ఇప్పుడు ఏ శక్తి కూడా దాన్ని మార్చడానికి వీలులేదు."

ఐరిష్ స్వాతంత్ర్య యోధుడు, డివెలీరా తన దేశ స్వాతంత్ర్య పోరాటంలో బ్రిటీషు పాలకుల ఆగ్రహానికి గురియై దేశద్రోహ నేరానికి బ్రిటీషు పాలకులచే ఉరిశిక్ష విధించబడినప్పటికి తాను అమెరికాలో జన్మించుటచే అమెరికన్ పౌరుడుగా ఆ శిక్ష తప్పి, ఐర్లండు జాతీయ విప్లవ నాయకుడుగా గుర్తింపు పొందాడు. వేరొకమూల జార్జి బెర్నార్డ్‌షా ఐర్లండులో పేదరిక జీవితంనుండి బయటపడి లండనులో స్వయంకృషితోను, తన మేధాశక్తితోను, బ్రిటీషు పెట్టుబడిదారీ పాలనా వ్యవస్థపై తన పదునైన వ్యంగపూరితమైన వ్యాస, నాటక రచనలతో, బ్రిటనులోను బయటా నిర్భయ అభ్యుదయకర రచయితగా పేరు ప్రఖ్యాతులు పొందారు.

# ఫేబియన్ సొసైటీ

నేను లండను చేరినతోడనే (1932_33) జార్జి బెర్నార్డ్ షాను తెలుసుకోవడం జరిగింది. అప్పటికే ఆయనకు 76 సంవత్స రాలు. ఫేబియన్ సొసైటీ స్థాపకులలో సిడ్నీ వెబ్బు, మరో ముగ్గురితో కలసి 1883 లో ఆ సొసైటీ స్థాపించబడి కాపిటలిజాన్ని వ్యతిరేకిస్తూ సోషలిజాన్ని ప్రచారం చేసే సంస్థగా వున్నది. సోషలిజం పార్లమెంటరీ పద్ధతిని స్థాపించ బడుతుందనే ధోరణి కలిగిన బ్రిటీషు మేధావులు వారు. బెర్నార్డుషా కంటే సిడ్నీ వెబ్బు 3 సంవత్సరాలు చిన్న.

1889 లోనే బెర్నార్డ్ షా, సిడ్నీ వెబ్, సిడ్నీ ఆలివర్, గ్రహమ్ వెల్లాస్, విలియమ్ క్లార్క్, హెర్బర్ట్ బ్లాంక్ కలసి సోషలిజం గురించి వ్యాస సంపుటి ఫేబియన్ సొసైటీ ఆధ్వర్యమున జరిపిన మీటింగుల వుపన్యాసాలు అచ్చు వేయించి ప్రచారం ప్రారంభించారు. అప్పటికే లండనులోను బ్రిటను ఇతర ప్రాంతాల్లోను కొన్ని వందల వుపన్యా సాలు ఇచ్చారు, బ్రిటీషు ట్రేడ్ యూనియను ఉద్యమ నాయకులకు, లేబరు పార్టీ కార్యకర్తలకు ఫేబియన్ సొసైటీ రచనలు ప్రచారమూ బ్రిటీషు పార్లమెంటరీ సోషలిస్టు ప్రచా రానికి వుపయోగమైంది. పారిస్ కమ్యూన్ గుణపాఠం ప్రథమ ఇంటర్నేషనల్ కౌన్సిలు నిర్మాణం, 19 వ శతాబ్దం చివర పాదంలో యూరపులో సోషలిస్టు పార్టీలు ఏర్పడటం,

ట్రేడ్ యూనియనులు, సహకార సంస్థలు బయలుదేరడం యూరపులోను, బ్రిటనులోను అభ్యుదయకర మేధావి వర్గానికి శ్రామికులనుండి బయలుదేరిన నాయకులకు మంచి ప్రోత్సాహాన్ని కలుగచేసిన కాలము, మరియు 19 వ శతాబ్దపు చివరిభాగము ఒక విధంగా శాంతియుత కాలం కూడాను.

కార్లు మార్క్సు ప్రఖ్యాత కమ్యూనిస్టు మానిఫెస్టో పత్రము, కాపిటల్ గ్రంథం ప్రభావం కూడా ఫేబియన్ సొసైటీపైన పడినప్పటికి, పెట్టుబడిదారీ వ్యవస్థ పోవాలనే ధోరణి కలిగినా, చరిత్రలో వర్గవైరుధ్యం పోరాటమును ఫేబియనులు గుర్తించలేదు. 19 వ శతాబ్దము మధ్యకాలములో (1848-71 లలో) బయలుదేరిన యూరపు విప్లవ పరిణామాల ప్రభావము బ్రిటనులో అభ్యుదయకర భావాలు కలిగిన సిడ్నీ వెబ్బు, బెర్నార్డుషా వంటి మేధావులు గుర్తించక తప్పలేదు.

జార్జి బెర్నార్డ్ షాకు కాలేజీ విద్య సాంప్రదాయపు డిగ్రీ చదువులు లేవు, తన స్వయంకృషివలన తన సూక్ష్మజ్ఞానాన్ని పెంపొందించుకోవడంలోనూ, బ్రిటీషు మ్యూజియం లైబ్రరీలో విశేష గ్రంథ పఠనంద్వారాను, ప్రతిదినం కొన్ని గంటలు విధిగా వ్రాయుటంద్వారాను, తన మేధాశక్తిని పెంపొందించుకొన్నారు. అయితే సిడ్నీ వెబ్బు లండనులో పుట్టి పెరిగి కాలేజీవిద్య, న్యాయశాస్త్ర తర్ఫీదు కాకుండా, బ్రిటీషు హోమ్ సర్వీసులో ఉద్యోగం నిర్వహించి సాంఘిక, ఆర్థిక సమస్యలపై విశేష పరిశోధనలు జరిపిన వ్యక్తి.

బెర్నార్డ్ షా, సిడ్నీ వెబ్బులు మధ్యతరగతి కుటుంబమునుండి బయలుదేరినా ప్రముఖ మేధావులుగా గుర్తింపబడేముందు సమాన అవకాశాలు కలిగినవారు కారు.

బ్రిటనులో అభ్యుదయకర మేధావి తరగతికి చెందిన కొందరిని పరిశోధించినప్పుడు వివిధ కోణాలనుండి వారి అభివృద్ధి నేను చూడగలిగాను.

1894 లో సిడ్నీ వెబ్బ రచించిన బ్రిటీషు కార్మిక ఉద్యమ నిర్మాణచరిత్ర ( History of Trade Unionism ) నేను 1934 లో చదివాను. విప్లవ నాయకుడు లెనిన్ తాను రష్యాలో జారిస్టు పాలకుల నిర్బంధంలో సైబేరియా ప్రవాసంలో వుండగా వెబ్ ట్రేడ్ యూనియను చరిత్రను రష్యన్ భాషలోకి తర్జుమా చేసారు. లెనిన్ ప్రఖ్యాత కార్లు మార్క్సు శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంతాలను లోతుగా పఠనంచేసి ప్రచారంచేసి ఆచరించారు.

రష్యాలో అక్టోబరు విప్లవ మూల పురుషుడగు లెనిన్ జారిస్టు పాలనను కూలద్రోసి నూతన సాంఘిక వ్యవస్తను నిర్మించినమీదట, " సోవియట్ కమ్యూనిజం ఒక నూతన నాగరికత ( Soviet Communism ; A New Civilisation ) " అనే గ్రంధాన్ని సిడ్నీ వెబ్బు, శ్రీమతి బీట్రిస్ వెబ్బులు నేను లండనులో ఉండగానే (1935) రచించారు. సిడ్నీ వెబ్బ ఆ గ్రంధాన్ని మార్కెట్టులో పెట్టకముందే నాకు అందచేసారు.

విప్లవ నాయకుడు, సోవియట్ రష్యా నిర్మాత లెనిన్ జనవరి 21, 1924 లో నిర్యాణం చెందారు. ఆయన జీవించి వుండగానే ఒక సంవత్సరం ముందు జనవరి 1923 లో "కాపిటలిష్టు నాగరికత శిధిలం" ( The decay of Capitalist Civilisation ) అనే 177 పేజీల గ్రంథాన్ని ఫేబియన్ సొసైటీ ఆధ్వర్యాన్ని సిడ్నీ బీట్రీస్ వెబ్బులు రచించారు. వెబ్బు రచించిన సోవియట్ కమ్యూనిజం చదివే ముందు పై పుస్తకాన్ని సేకరించి పరిశీలించాను. ఈ పుస్తకంలో కాపిటలిస్టు నాగరికత పేదరికాన్ని ఎలా పెంచుతుందో వెబ్బులు అంగీకరించినప్పటికి అది శిధిలమవుతుందని అంగీకరించినప్పటికి, రష్యాలో 1917 అక్టోబరు విప్లవ మహత్తర పాత్రను వెబ్బులు, ఫేబియన్లు గుర్తించలేదు. ఫేబియన్లు సోషలిజం సంస్కరణ తత్వముతో కూడినదని, శ్రామికవర్గం యొక్క విప్లవాత్మక పాత్రను అవగాహన చేసుకోలేదని కమ్యూనిస్టు ఇంటర్నేషనలు 1928 లో తన తీర్మానంలో విమర్శించింది. 1932 లో సిడ్నీ వెబ్బు ఆయనభార్య బీట్రీసు వెబ్బు బ్రిటీషు లేబరు పార్టీ నాయకుల అవకాశవాద రాజకీయాల యెడల విరక్తి చెందారు. 1932_1935 సంవత్సరాలలో రష్యాలో పర్యటించి వారి నూతన పుస్తకాన్ని రచించారు.

అయితే వెబ్బులు 1935 లో వ్రాసిన సోవియట్ కమ్యూనిజం "నూతన నాగరికత" అని మొదటి ప్రతిలో

ప్రశ్నార్థకం వేసుకొని రెండవ ప్రతి 1937 లో అచ్చువేసి నప్పుడు సోవియట్ కమ్యూనిజం నూతన నాగరికత అని అంగీకరిస్తూ ప్రశ్నార్థకము తీసివేసుకొని సవరణ చేసు కొన్నారు. 1937 న నేను లండనునుండి నా దేశం భారత దేశానికి చేరుకొన్నాను. రష్యాలోని సాంఘిక, ఆర్థిక, రాజ కీయ పరిణామాన్ని వెబ్బులు 1193 పేజీలలో వివరించి దానిని హర్షించి అది రచించిన 2 సంవత్సరాలకు 1937 ముద్రణలో నూతన నాగరికతగా నిర్ధారణ చేసుకొని తుదిలో 70 అదనపు పేజీలు వ్రాసారు.

భారతదేశం చేరుకొన్న సంవత్సరమే (1937) ఆ రెండవ ముద్రణ సిడ్నీ వెబ్బు "సోవియట్ కమ్యూనిజం" పుస్తకం కాకినాడకు దాని లండను పబ్లిషర్లు గొల్లాంట్సునుండి నాకు చేరింది. ఈ బ్రిటీషు ప్రముఖ మేధావుల కృషిని నేను అర్థం చేసుకొన్నాను.

కార్లు మార్క్సు యొక్క మాటలు "తత్వవేత్తలు ప్రపంచము గురించి వ్యాఖ్యానం మాత్రమే చేసారు. ముఖ్య మని దాన్ని మార్చాలి", లెనిన్ సాంఘిక నిర్మాణ సూత్రాలు, తన పుస్తకములో వివరించుకొన్నారు.

1934 లో బ్రిటీషు మేధావి హె. జి. వెల్సు ఆత్మకథ లండను దినపత్రిక డైలీ హెరాల్డులో వరుసగా వచ్చే వ్యాసాలను చదివేవాడిని. హె. జి. వెల్సు సామాన్య మధ్య తరగతి కుటుంబములో 1866 లో పుట్టి మొదట చిన్న

గుమాస్తా ఉద్యోగంలో ప్రవేశించి, తరువాత స్వయంకృషితో జీవశాస్త్రంలో పట్టభద్రుడై ప్రైవేటు టీచరుగా వృత్తి ప్రారంభించి చివరకు నవలా రచయితగా స్థిరపడ్డాడు. నవలా రచనలో పేరు సంపాదించి స్థిరపడి, శాస్త్రీయ, సాంఘిక సమస్యలను తన నవలలోనూ, యితర రచనల్లోను నిర్భయంగా చర్చించడమూ మొదలుపెట్టారు. ఈయన నవలలను నేను చదవలేదు, కాని ఆయన ఆత్మకథను పూర్తిగా చదివాను. వెల్సు దాపరికం లేకుండా వ్రాయడాన్ని నేను హర్షించాను. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత వెల్సు వంటి బ్రిటీషు మేధావులకు గుర్తింపు పెరిగింది. వీరు రాజకీయవాదులు కాకపోయినా, అభ్యుదయకర భావాలు కలిగి వుండడమూ, పాలకవర్గాలను ఆశ్రయించకుండా వుండడమూ, నిర్మొగమాటంగాను, నిష్కల్మషంగాను తమ భావాలను సుస్పష్టం చేసుకోడం వెల్సువంటి బ్రిటీషు మేధావులకు అలవాటు వచ్చింది. బ్రిటీషు కాపిటలిస్టు సమాజం దాని సామ్రాజ్యం యిటువంటి మేధావుల ధోరణులను అంగీకరించక పోయినా, జోలికి పోలేదు.

1931 లో వెల్సు వ్రాసిన "చరిత్ర రూపురేఖ" (The outline of History), 1932 లో వ్రాసిన "మానవజాతి పని, సంపద, సౌభాగ్యము" (The work, wealth and happiness of mankind) అనే పుస్తకం నేను లండను చేరినతోడనే (1933) లో చదివాను;

వెల్సు నవలలు తెలుసుకొన్నాను. ఇండియాకు వచ్చేముందు వెల్సు " రాబోయే పరిస్థితుల స్వరూపం " ( The shape of things to come ) దాని ఫిల్మ లండనులో చూచాను. అర్ధ శతాబ్దం క్రితం అంతరిక్ష యాత్రల గురించి వెల్సు జోస్యం చెప్పాడు. అప్పుడున్న కొంత శాస్త్ర సాంకేతిక పరి జ్ఞానాన్ని ఆధారం చేసుకొన్నారు. వెల్సు రష్యాలో విప్లవం తదుపరి లెనిన్ జీవితకాలంలో ఆయన్ను కలుసుకొని తదుపరి నేను లండనులో వుండగా రష్యాలో స్టాలిన్ ను కలుసుకొని రష్యాలోని మార్పును గుర్తించాడు.

ఇక రెండవ ప్రపంచ యుద్ధ సంక్షోభము యూరపు ప్రజల ఆలోచనా ధోరణిలో సంచలనం లేవదీసింది. ఆదశలో అభ్యుదయ భావాలు కలిగిన వృద్ధులగు బెర్నార్డ్ షా, వెబ్బులు, వెల్సు మొదలగు మేధావుల గ్రంధాలకు ప్రచారం బయలుదేరింది. వెల్సు కూడా ఫేబియన్ సొసైటీలో బెర్నార్డ్ షా తర్వాత చేరినవాడే, కాని వెబ్బులుకాని, వెల్సు కాని యిక వారి తరహా మేధావి వర్గం " మేము స్థిరపడ్డాం మేము పాలకవర్గాలను వారి అనుచర బృందాలను ఆశ్ర యించ నవసరం లేదు. మా భావాలను స్వేచ్ఛగా వెదజల్లు తాము. ఎవరు అంగీకరించినా, అంగీకరించకపోయినా మా భుక్తికి మా పలుకుబడికి లోటులేదు " అనే ధోరణిలో వ్యవహరించారు. నేను లండనులో వున్నకాలంలో యీ తరహా బ్రిటీషు మేధావి తరగతి స్వేచ్ఛకు నిర్మొగమాట ధోరణికి ఆకర్షింపబడ్డాను.

# లెనిన్ ఆదర్శము

నేను ప్రాథమిక విద్యా దశలో ఉండగా, బుద్ధ మహో శయుని జీవితము బోధనలు నాకు ఉత్తమ ప్రబోధాలైనాయని చెప్పాలి. అది నాకు మంచి పునాది. అదేకాలంలో గాంధీజీ జీవితం, స్వరాజ్య ఉద్యమం నన్ను ఆకర్షించి నాకు ప్రథమ రాజకీయ పాఠం ప్రారంభమైంది. సమాజంతో నేను ఎదుగు తున్నాను. నేను ఎదగడంతో సమాజం మారుతోంది. ఎదుగుతున్నకొద్దీ నేను జీవిస్తున్న కాలప్రభావం నాపై పడు తూంది. నా అవగాహన పెరుగుతూంది.

నా 21 వేట మార్క్సు, ఎంగిల్సు, లెనినుల గ్రంథాలు లండను నివాసములో (1933) లో నాకు పరిచయమయ్యాయి. అప్పుడు వారు జీవించిలేరు. వారి జీవితకృషి వారి గ్రంథాల నుండి వారి ప్రబోధాలు, పెట్టుబడిదారీ వ్యవస్థతో వారి పోరాటము, వారి కష్టాలు, వారి శిష్యులు, వారి విరోధులు, వారి ప్రబోధం గురించి పెట్టుబడిదారీ సామాజిక వ్యవస్థతో తీవ్ర వాదోపవాదాలు యివన్నీ నాకు రాజకీయ పాఠా లైనాయి. మార్క్సు, ఎంగిల్సు జీవితాలు శ్రామికవర్గ విముక్తికై శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంత ఆచరణకై అంకితమైంది.

మారుతున్న కాలాన్ని అర్థం చేసుకోడానికి, మానవ జాతి నూతన సాంఘిక వ్యవస్థ కమ్యూనిజానికై పోరాడ

దానికి మార్క్సు, ఎంగిల్సు శాస్త్రీక భౌతికవాదము చారిత్రక భౌతికవాదము నాకు పనిముట్లులుగా భావించుకొన్నాను. మార్క్సు, ఎంగిల్సు, లెనిన్‌లు నాకు రాజకీయ గురువులుగా భావించుకొన్నాను.

వ్లాదీమిర్ ఇల్యిచ్ లెనిన్ మార్క్సు ఎంగిల్సు సిద్ధాంతాలను ఆధారం చేసుకొని తర్కించి, పోరాడి తాను జీవిస్తున్న సామ్రాజ్యవాద దశకాలం (1870_1924) లో అక్టోబరు సోషలిష్టు విప్లవాన్ని తన బోల్షివిక్ సహచరులతో విజయవంతంచేసి సోవియట్ రాజ్యానికి అధిపతి అయ్యారు. నేను మహాత్మా గాంధీ అనుచరుడుగా నా 10 వ యేట ప్రారంభించినపుడు లెనిన్ రష్యాలో విప్లవ ప్రతీఘాతక శక్తులతో పోరాటం సాగించి, భూస్వామిక కాపిటలిష్టు వర్గాధిపత్యం లేని సోషలిస్టు రష్యాకు అధిపతిగా నిలబడ్డారు. నా 12 వ యేట ఆయన అస్తమించాడు. మరో 10 సంవత్స రాలకు లండను నివాసములో లెనిన్ జీవితము ఆయన గ్రంథాలు, ప్రబోధాలు ఆయన నిర్మించిన సోవియట్ రష్యా చరిత్ర అందుబాటైనాయి. సోషలిస్టు విప్లవాన్ని విజయ వంతం చేసిన, మార్క్సు, ఎంగిల్సుయొక్క ప్రథమ అను చరుడు లెనిన్ అనాలి. లెనిన్‌ను కూడా నేను ఆదర్శ పురుషుడుగా చేసుకొన్నాను.

లెనిన్ 1870 లో రష్యాలో జన్మించి, 1924 లో దివంగతులైనారు. ఆయన జీవించినది 54 సంవత్సరములు

ఎక్కువ కాలము కాదు. అక్టోబరు విప్లవ విజయంకొరకు జీవించాడు. లెనిన్ అన్న అలెగ్జాండరు ఇల్యీచ్ ఉల్యానావ్ 1887 లో "ప్రజల శాసనము" అనే పార్టీలో కృషిచేస్తూ రష్యా జార్ చక్రవర్తిని హత్య చేయడానికి ప్రయత్నించాడని జార్ ప్రభుత్వం ఉరితీసింది. తన చిన్న వయస్సులోనే లెనిన్ టెర్రరిజం మార్గంకాదని నిర్దేశించాడు. లెనిన్ విద్యార్థిదశలోనే జారిస్టు ప్రభుత్వం కజన్ విశ్వవిద్యాలయం నుండి బహిష్కరించింది, అయినా నిర్బంధాలకు సరకుచేయక తన విద్యను బయటనుండి కొనసాగించి న్యాయశాస్త్ర పట్టభద్రుడయ్యాడు, అన్నిటికంటె ఉత్తమ విద్య అగు మార్క్సిజాన్ని పఠనంచేసి తన 23 వ ఏట శ్రామికులకు సెంట్ పీటర్సుబర్గులో మార్క్సిస్టు సూత్రాల ప్రబోధం కొనసాగించాడు. తన 25 వ ఏట (1895) యూరపు దేశాలగు ఆస్ట్రియా, స్విట్జర్లాండు, బెర్లిన్, పారిస్‌లకు వెళ్ళి విప్లవ ప్రబోధ పత్రికలతో పరిచయం ఏర్పర్చుకొన్నాడు. తిరిగి 1895 లోనే సెంట్ పీటర్సుబర్గు చేరగా లెనిన్‌ను జారిస్టు ప్రభుత్వం అరెస్టుచేసి 2 సంవత్సరాలు జైలులో నిర్బంధించి, సైబీరియాకు 3 సంవత్సరాలు ప్రవాశిత నిర్బంధాన్ని చేసింది. 1898 లో లెనిన్ కృప్సకయాను పెండ్లిచేసుకొన్నాడు. ఈమె కూడా రాజకీయ నిర్బంధాలకు గురియై లెనిన్ జీవితంతో పెన వేసుకొని విప్లవ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

1900 సంవత్సరములో లెనిన్ యూరప్ దేశాలకు బయలుదేరి స్విట్జర్లెండు, ఫ్రాన్సు వెళ్ళి లండను సోషల్ డెమాక్రటిక్ కాంగ్రెసులో తన అనుచరులతో పాల్గొంటూ మార్క్సిస్టు సూత్రాల ఆధారంగా రాజకీయ కార్యకలాపాలు సాగించారు. ఇస్క్రా పత్రికను బయట కొంతకాలం నడిపి తరువాత Forward (ముందుకు సాగు) పత్రికను నిర్వహించింది రష్యాలోని విప్లవవాదులకు పంపించబడేవి. 1905 లో రష్యాలోని బూర్జువా ప్రజాస్వామిక విప్లవాన్ని బలపర్చారు.

మార్క్స్, ఎంగిల్సు ప్రబోధాలను ముందుకు తీసుకు పోయారు. 1916 లో ఆయన రచించిన "సామ్రాజ్యవాదము కాపిటలిజం యొక్క ఉచ్ఛదశ", (Imperialism, the Highest Stage of Capitalism.) సోషలిస్టు విప్లవానికి 20 వ శతాబ్దిలో ఒక మైలురాయిగా స్పష్టీకరణ చేసింది. శాస్త్రీయ భౌతికవాదము డైలెక్టికల్ భౌతికవాదమును తన 1908 గ్రంథములో Materialism and emperio-criticism ఆర్థిక, రాజకీయ, నైతిక, సామాజిక అభివృద్ధి గురించి చర్చించారు. "రాజ్యము, విప్లవం" గ్రంధములో (State and Revolution) వర్గాల అభివృద్ధి వర్గపోరాటము గురించి వివరించినది రష్యన్ విప్లవవాదులను చైతన్యవంతులుగా చేసింది.

మొదటి ప్రపంచ యుద్ధం (1914) ప్రారంభం కాగానే లెనిన్‌ను ఆస్ట్రియా గవర్నమెంటు అరెస్టుచేసి 10 రోజులలో విడుదలచేసింది. 1917 ఫిబ్రవరిలో మెన్షివిక్కుల ఆధిపత్యంలో

బూర్జువా డెమాక్రటిక్ విప్లవాన్ని అక్టోబరులో సోషలిస్టు విప్లవంగా తన బోల్షివిక్కుల సహకారంతో విజయవంతంగా నిర్వహించారు. తదుపరి లెనిన్ జీవించిన 7 సంవత్సరాలలో సోవియట్ రాజ్యాంగానికి రూపురేఖలు దిద్ది ప్రపంచములో మొదటిసారిగా పెట్టుబడిదారుల, భూస్వాముల పెత్తనంలేని శ్రామికవర్గ రాజ్యాన్ని పెంపొందించారు. మార్క్సు, ఎంగిల్సు సిద్ధాంతాలను ఆచరణరూపంలోకి తెచ్చిన ప్రపంచ విప్లవవీరుడు.

శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంతీకులు మార్క్సు, ఎంగిల్సు, లెనిన్‌లు నూతన మానవ సాంఘిక నిర్మాణానికి గుడ్డిభక్తిని ప్రోత్సహించడానికి కాదు. తమ పరిశోధనలు, తమ కార్యాచరణ, తమ కాలంలో స్థితిగతులపైన ఆధారపడి అవి నూతన సమాజ నిర్మాణానికి కార్యాచరణకు మార్గదర్శకమని హెచ్చరింపబడింది.

మనిషికి మంచి జీవితము కలుగచేయడానికి మానవ సమాజము మారాలి. ఇది ఊహాప్రపంచములో నిర్మాణమయ్యేదికాదు. భావాలశక్తి చెప్పదగిన దైనప్పటికి, అది ఆచరణలో నిజస్వరూపం కావాలి. ఫ్యూడలు సమాజం మారి కాపిటలిస్టు సమాజము ఉద్భవించడము, ఆ సమాజంలోని పీడితవర్గాల కదలిక, అభివృద్ధి అయిన ఉత్పత్తి శక్తుల పురోగమనం, ఫ్యూడలు ఆధిపత్యాన్ని విచ్ఛిన్నం చేసింది. కాపిటలిస్టు సమాజం ఆవిర్భావం ఫ్యూడలు వ్యవస్థనుండి విముక్తిఅయినప్పటికి రానురాను కాపిటలిస్టు

వర్గము దాని వ్యవస్థ జీతపు కూలీలను, అణగుననపున్న వారిని పీడించే వ్యవస్థగా తయారైంది. ఒకమూల మనుష్యుల అవసరాలు తీర్చే ఆహారము, అవసర సరకుల ఉత్పత్తి బ్రహ్మాండముగా పెరుగుతుంటే స్వార్థవర్గాల స్వప్రయోజనానికై వ్యత్యాసాలు సృష్టించడము పేదరికం, దోపిడీ కొనసాగడము యివి పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యాప్తి చెందింది. అణగద్రొక్కబడే మనుష్యులనుండి నూతన శ్రామికశక్తి ఉద్భవించి మనిషిని మనిషి పీడించని వర్గ రాహిత్య సమాజ నిర్మాణానికి దారితీయాలి. ఈసూత్రము లెనిన్ జీవితంలో ఆచరణాత్మకమైంది. పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధిచెంది సామ్రాజ్యవాద వ్యవస్థకు చేరి దాని అంతరంగిక వైరుధ్యాలవలన యుద్ధ సంక్షోభము లేవదీసి శ్రామిక వర్గ విప్లవంతో వర్గరాహిత్య సోషలిస్టు సమాజానికి దారి తీస్తుందని కార్లు మార్క్సు నిర్వచన పరిశోధన నిజమైంది.

అయితే యివి ఏదో దారితప్పిన సంఘటనలు కావు. నూతన సమాజ నిర్మాణానికి కృషి చేస్తున్న విప్లవ కార్మిక శక్తికి అవకాశాన్ని గుర్తించాలి. కాపిటలిస్టు సమాజం యొక్క శిథిలదశను గుర్తించాలి.

అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ బ్రిటీషు సామ్రాజ్యవాద దేశానికి నా రాక దాని సంక్షోభ పరిశీలన నా విశాల దృక్పదానికి దారితీసింది. మార్క్సు, లెనిన్‌ల జీవితం వారి సిద్ధాంత పోరాటం నన్ను ధైర్యవంతుని చేసాయి. గతంలో

మానవుడు చేసినకృషి, సామాజిక జీవనపోకడ, మార్క్స్ లెనిన్‌లను అవగాహన చేసుకోవడంలో మానవుని భవిష్యత్తు మానవునిచేతుల్లో వున్నదని గుర్తించాను. అప్పటి కాలంలో పెట్టుబడిదారీ వ్యవస్థ మారదనే సిద్ధాంతీకులను, వర్గపీడనతో దాన్ని నిలబెట్టాలనే పాలకవర్గాలను సరకు చేయకుండా నూతన సామాజికశక్తిని గుర్తించి పెట్టుబడిదారీ సమాజం శిథిలమై దాని స్థానంలో సోషలిజం తప్పదని మార్క్స్, లెనిన్‌లు జరిపిన పోరాట పాఠాల అధ్యయనం నాకు ముందుముందు మార్గదర్శకమైంది.

మనిషి అభ్యున్నతిపై సృష్టిని, విశ్వాన్ని దానిరహస్యాలను అవగాహన చేసుకోగలుగుతాము. వర్గపీడనలో మనిషి నివసిస్తూ కష్టభూయిష్టమైన సామాజిక వ్యవస్థనుండి విముక్తి కానిదే మానవుని అత్యద్భుతమైన ఆలోచన నిర్మాణప్రతిభ ముందుకు రాలేదు. శాస్త్ర సంకేతిక పరిజ్ఞానమంతా మనిషి కృషినుండి ఉద్భవించింది. ఇది వృథా కాకూడదు. సంకుచితం కాకూడదు అనే విశ్వాసానికి నేను వచ్చాను.

లండను నివాసంలో నాకు అందుబాటుకాని పుస్తకం లేదు. ఒకమూల బ్రిటీషు మ్యూజియం బ్రహ్మాండమగు లైబ్రరీకి హేమ్‌స్టెడ్ హీత్ ప్రాంతములోని లైతాసె రోడ్డు నివాసంనుండి నేను ప్రతిరోజు ఉదయాన్ని ట్యూబ్‌రైలులో (భూమి అడుగునుండి నడిచేది) మ్యూజియం వీథిలోని గ్రంథాలయానికి వెళ్ళి శాస్త్రీయ, చారిత్రక, ఆర్థిక, రాజ

కీయ గ్రంధాలు చదివేవాడను. నాకు విజ్ఞానము యెడల పునాదికి అది వుపయోగపడింది. ఇక అదే కాలంలో 1936 లలో లండనులో గొల్లాంక్సు పబ్లిషర్లు వామపక్ష పుస్తక క్లబ్బు అనే పుస్తక విక్రయ సంస్థ ఏర్పర్చి సిద్ధాంత సమస్యలు, ఆధునిక రాజకీయ సమస్యలపై ప్రతినెల కొన్ని గ్రంధాలు అచ్చువేసి క్లబ్బు మెంబర్లకు చౌకధరకు అంద చేసేవారు. దానిలో చందాదారునిగా చేరి చాల పుస్తకాలు కొన్నాను. కొన్ని యిప్పటికీ వున్నాయి. కొన్ని పోయాయి.

మనుష్యులను అర్దం చేసుకోడానికి మనుష్యులు వ్రాసిన పుస్తకాలు ఒక సాధనం. జీవశాస్త్రము, చరిత్ర, తత్వ శాస్త్రము, మానసిక శాస్త్రము ఆర్ధిక రాజకీయ శాస్త్ర ములు, శాస్త్రజ్ఞుల ప్రజాస్వామికవాదుల విప్లవ వీరుల జీవిత చరిత్రలు మొదలగు గ్రంధాలు ఆధునిక విజ్ఞానంతో కూడిన వ్యాసాలతోనున్న గ్రంధాలు ఖగోళశాస్త్రమునుండి జీవ శాస్త్రమువరకు గల పాఠాల పుస్తకాలు నేను సేకరించు కొన్నాను. నాకు తోడుగా వున్నాయి. ఈ పుస్తకాలన్నీ కూడా నేను 1937 లో ఇండియాకు వచ్చినప్పుడు తెచ్చు కొన్నాను. నా రాజకీయ ఒడుదుడుకులతో పాటు నా పుస్త కాలు కూడా కొన్ని స్థానం తప్పిపోతుండేవి. నా రాజ కీయ జీవిత పరిస్థితులనుబట్టి నా పుస్తకాలన్నీ దాచుకోడం సాధ్యమయ్యేదికాదు. ముందుముందు పాలకవర్గ పోలీసులు నా మీద దాడితో పాటు నా పుస్తకాలపైనకూడా దాడి

చేసేవారు. అవి వాళ్ళకు అర్థంకాక విడచిపెట్టేవారను కొంటాను. నాతోపాటు పుస్తకాలు కొన్ని నిర్బంధరోజుల్లో నా రహస్య స్థావరాలకు, జైలు నిర్బంద మప్పుడు జైలుకు కూడా ముఖ్యమైనవి తీసుకు వెళ్ళేవాడిని. బయటకు వచ్చినప్పుడు జైలు ముద్రతో తిరిగి నాతో వచ్చేసివి.

నేను నేర్చుకొన్న విద్య, సముపార్జించుకొంటున్న విజ్ఞానము నాకు ఆదర్శమైన ఉత్తమ పురుషులు మూలంగా నేను జీవిస్తున్న సామాజిక వ్యవస్థను నా 24 వ వత్సరంలో ప్రశ్నిస్తున్న విమర్శిస్తున్న ఖండిస్తున్న యువకునిగా తయారైనాను. ఒకమూల నా దేశంలోని ప్రాశ్చాత్య పీడన, దేశ నైతిక దుస్థితి, దానిని ఎదిరిస్తున్న స్వాతంత్ర్య శక్తులు, వేరొకమూల అభివృద్ధిచెందిన కాపిటలిస్టు బ్రిటనులో ఆంతరంగిక వైరుధ్యాలు, యూరపులోని ముస్సోలినీ ఫాసిజం, జర్మనీ హిట్లరిజం, జపాను నియంతృత్వం, యుద్ధతంత్రాలు మానవజాతి ప్రమాదం గురించి ఆలోచించేటట్లు చేసాయి. నేను లండనులో వున్న 1933_1937 సంవత్సరాలలో ఒకమూల ప్రపంచ ఆర్థిక సంక్షోభం వేరొకమూల యూరపులో ఫాసిస్టు విజృంభణ బయలుదేరిన కాలం.

# నా 24 వ ఏట

మొదటి ప్రపంచ యుద్ధము సమాప్తమైన ఆరు సంవత్సరాలకు ఇటలీలో ముస్సోలినీ ఫాసిస్టు నియంతృత్వం బయలుదేరింది. రష్యాలోని అక్టోబరు విప్లవం యూరోపు లోని శిధిలమగుతున్న కాపిటలిస్టు పరిపాలనలకు భీభత్సవం కలుగచేసి ఫాసిజాన్ని నియంతృత్వాలను ప్రోత్సహించడం ప్రారంభమైంది. ముస్సోలినీ బయలుదేరిన మరో దశాబ్దానికి పైన జర్మనీలో హిట్లరు నాజీజం తలెత్తింది. మొదటి ప్రపంచ యుద్ధం పరిణామమే ఫాసిజం నాజీజం యొక్క విజృంభణ

జర్మనీలో హిట్లరు నియంతృత్వం ఆర్యమజాతి అహంకారాన్ని కూడా లేవనెత్తింది. జర్మనీలోని యూదు జాతులవారిని అణగద్రొక్కడం మూలంగా హిట్లరు ప్రముఖ ప్రపంచ ప్రఖ్యాతి శాస్త్రజ్ఞుడు ఐన్‌స్టైన్ తన మాతృభూమి అగు జర్మనీనుండి తరిమివేసాడు నేను లండనులో వుండగా ఐన్‌స్టైన్ జర్మనీని విడచి లండను వచ్చారు. లండను ఆల్బర్టు హాలులో ఐన్‌స్టైన్‌కు జరిగిన బ్రహ్మాండమగు మహా సభకు నేను హాజరైనాను.

ప్రముఖ రాజకీయవేత్తలు, శాస్త్రజ్ఞులు ఆ సమావేశంలో మాట్లాడి జర్మనీనుండి హిట్లరు ఐన్‌స్టైన్ వెలి

కారణమని తీవ్ర విమర్శలు చేసారు. నేను అంతకుముందే ఐన్‌స్టైన్ జీవిత చరిత్రను లుయిూన్ గ్రంథాలయంలోని శాస్త్రజ్ఞుల గ్రంథాలనుండి తెలుసుకొన్నాను. ఆయన భావాలను నేను తెలుసుకోనేవాడను.

ఆయనకు జర్మనీనుండి బయటకు వచ్చేటప్పటికి 55 సంవత్సరాల వయస్సు. ఆయన తదుపరి అమెరికాలో తన స్థిరనివాసం ఏర్పర్చుకొన్నారు. ప్రముఖ ఫిజిక్స్ శాస్త్రజ్ఞుడు; ఆయన రిలెటివిటీ సిద్ధాంతము ( Theory of Relativity ) భౌతిక శాస్త్రములోనూ, ఫిజిక్స్‌లోనూ నూతన భావాలను కలుగచేసింది. స్పేస్ ( Space ), టైము చలనం ( Motion ) పదార్థం, క్రాంతి ( Light ), భూ ఆకర్షణ ( Gravity ) ల గురించి నూతన శాస్త్రీయ దృక్పథాన్ని ఐన్‌స్టైన్ సిద్ధాంతం లేవదీసింది. ఐన్‌స్టైన్ తన జీవితాన్ని శాస్త్రపరిశోధనకు వినియోగించిన శాస్త్రీయ విప్లవ భావాలుకలిగిన జర్మను ప్రముఖ పుత్రుడు. సుమారు 100 సంవత్సరాల క్రితం జర్మను ప్రముఖ పుత్రుడు కార్లు మార్క్సును తన మాతృభూమినుండి తరిమివేయుబడి, లండనులో నివాస మేర్పర్చుకొని అక్కడే ఆయన జీవిత కృషి కొనసాగించాడు. తదుపరి 1934 లో ఐన్‌స్టైన్ హిట్లరు కాలంలో తన జర్మనీనుండి వెలివేయుబడి అమెరికాలో నివాస మేర్పర్చుకొని 1955 లో పరమపదించారు.

ప్రపంచాన్ని అర్థం చేసుకోడానికి లండనులో నా నివాసము వుపయోగపడింది. అక్కడ నా కాలాన్ని విలాసాలకు వుపయోగించలేదు. ప్రాశ్చాత్య పెట్టుబడిదారీ సమాజానికి వ్యామోహాం చెందలేదు. ధనార్జనకు తాపత్రయపడలేదు. నా ఆలోచనలు సక్రమంగా వుంటే ముందు నా జీవితం ఏమైనా ఫరవాలేదనే తాత్విక చింతనలో వడ్డాను.

ప్రపంచములోని వివిధ శక్తుల మధ్య సంఘర్షణ చూడగలిగాను, యిప్పటికి కూడా ఆ శక్తుల వారసత్వమే వుంది. అయితే పరిపూర్ణ మానవత్వము ఆవిర్భవించడానికి మానవజాతిలోని వుత్తమ శక్తులు పోరాటాన్ని సాగిస్తూనే వున్నాయి. ఇక కాపిటలిస్టు సామ్రాజ్యవాద శక్తులు ప్రపంచాన్ని తమ గుప్పిట్లో పెట్టుకోడానికి యుద్ధ తంత్రాన్ని పూనుకొన్నాయి. ఈ విధానం 30 లలో నాకు యూరపులోని సంఘటనలు స్పష్టం చేసాయి. జర్మనీలో హిట్లరు ఫాసిజం కి సంవత్సరాలలోనే ఒక ప్రమాదకరమైన శక్తి అయింది. 1936 లో రైన్‌లాండ్ భూభాగంలోకి దౌర్జన్యంగా సైన్యాన్ని మళ్ళించి ఆక్రమించుకోడం జరిగింది. యూరపులోని రాజకీయ శక్తులమధ్య ఒక భీభత్సవాన్ని కలుగచేసింది.

ముస్సోలినీ 1936 లో ఆఫ్రికాలోని పురాతన రాజ్యము ఇథోపియాపై దండయాత్ర చేసి ఆక్రమించుకొని

ఇథోఫియా రాజగు హెయిలీ సెలాసినీ తరిమివేసాడు. హెయిలీ సెలాసీ 1936 లో లండను వచ్చాడు. బ్రిటీషు ప్రభుత్వం ఆయనకు ఆశ్రయు మిచ్చింది.

హెయిలీ సెలాసీ లండను వచ్చినప్పుడు నేను ఆయనను తెలుసుకొన్నాను. ఇథోఫియాలో హెయిలీ సెలాసీది ఫ్యూడలు రాజరికము. రెండవ ప్రపంచ యుద్ధం తదుపరి ముస్సోలినీ ఇటలీ ఓటమితో, బ్రిటీషు పాలకులు హెయిలీ సెలాసీని తిరిగి ఇథోఫియాలో అధికారంలో పెట్టేరు. 1974 లో హెయిలీ సెలాసీ రాజరికం పతనమై నూతన ప్రభుత్వం ఏర్పడింది.

1936 లో స్పెయిన్ వామపక్ష ప్రభుత్వం ఏర్పడింది యూరప్పులో యిదొక అభ్యుదయకర పరిణామంకింద నేను నా మిత్రులు లండనులో గ్రహించాము, స్పెయిన్ లో కెబిలిరా మంత్రివర్గ సభ్యులు లండను వచ్చినప్పుడు వారిని కలుసుకొన్నాను. స్పెయిను వెళ్ళి అక్కడి పరిస్థితులు అవగాహన చేసుకోవాలని లండనులోని మా సోషలిస్టు స్టడీ సర్కిలు సభ్యులు కొందరము కార్యక్రమం వేసుకొన్నాము. అందరమూ ఒకేసారి వెళ్ళడానికి అనుకూలం కాలేదు. అయితే స్పెయిను ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి మొరాక్కోలోని ఆ ప్రభుత్వ మిలటరీ అధికారి జనరలు ఫ్రాంకో తిరుగుబాటు లేవదీసాడు. మా మిత్రులు స్పెయినులో ఆ తిరుగుబాటు సమయంలో చిక్కుకొని బ్రిటీషు పౌరులగుటచే, అక్కడి బ్రిటీషు

దాత్యకార్య అధికారులు వీరిని యుద్ధనౌకలో బ్రిటను తీసుకువచ్చారు. మా మిత్రులు స్పెయినులోని అనుభవాలు మాకు వివరించారు. ఆ కాలంలో స్పెయిను ప్రజల వీరోచిత పోరాటం నిర్మాణం చూచే అవకాశం నాకు చిక్కలేదు. అయితే స్పెయిను శ్రామిక ఉద్యమాలు ఫ్రాంకో తిరుగుబాటును అణగద్రొక్క లేకపోయారు. ఫ్రాంకోకు జర్మనీ ఇటలీ ఫాసిస్టు పాలకవర్గాలు ఆయుధ సరఫరా మిలటరీ సహాయం పూర్తిగా చేసి స్పెయినులోని వామపక్ష ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి పూనుకొంది.

మొదటి ప్రపంచ యుద్ధం తరువాత ఏర్పడిన నానా జాతి సమితి (League of Nations) ఫాసిస్టు యుద్ధ తంత్రాన్ని ఎదుర్కోడానికి సరియగు పనిముట్టుగా లేదు. బ్రిటీషు ప్రభుత్వం కూడా యిందుకు కారణమా. పరోక్షంగా ఫాసిజాన్ని బ్రిటీషు పాలకవర్గం బలపర్చిందని నేను నా మిత్రులము బ్రిటనులో విమర్శిస్తూ చర్చలు జరిపాము.

స్పెయిన్‌లో ఏర్పడిన వామపక్ష ప్రభుత్వాన్ని హతవం చేయడానికి తిరుగుబాటును లేవదీసిన సేనానాయకుడు ఫ్రాంకోను, అతన్ని బలపరుస్తున్న జర్మను ఇటలీ ఫాసిస్టు శక్తులను ఎదుర్కోడానికి, ప్రపంచంలోని శ్రామికవర్గ ఉద్యమాలు ఒక అంతర్జాతీయ బ్రిగేడ్‌ను ఏర్పర్చి దానిలో వాలంటీర్లుగా బ్రిటనునుండి అభ్యుదయకాములు చేరి ఆ దేశానికి వెళ్ళారు. కొందరు ఆ పోరాటంలో తమ ప్రాణాలు

త్యాగం చేసారు. నాకు తెలిసిన బ్రిటీషు ప్రముఖ యువక రచయిత రాల్ఫ్ ఫాక్సు లండనునుండి స్పెయిన్ వెళ్ళి ఆ పోరాటంలో తన ప్రాణాలు అర్పించాడు.

1936లో స్పెయిన్ ప్రభుత్వాన్ని ఫాసిస్టులు కూలద్రోస్తుంటే అబిసీనియాను ఇటలీ ఆక్రమించుకొంటుంటే, బలమైన బ్రిటీషు ఫ్రెంచి పాలకవర్గాలు యీ ఫాసిస్టు విజృంభణాన్ని లీగ్ ఆఫ్ నేషన్సు ( League of Nations ) ద్వారా ఆంక్షలు విధించి ఫాసిస్టు శక్తులను అరికట్టేబదులు "జోక్యం చేసుకో కూడదు" ( Non-intervention ) అనే సిద్ధాంతాన్ని లేవదీసారు. ఫాసిజం కమ్యూనిజంతో ఢీకొని యూరప్‌లో కమ్యూనిజం వ్యాప్తి కాకుండా కాపాడుతుందనే సామ్రాజ్య వాదపు భ్రమలో వున్నారు.

అయితే బ్రిటనులోను, యూరపులోను ఫాసిజం మూలంగా సంభవించే యుద్ధ ప్రమాదాన్ని, చైతన్యపూరిత శ్రామికవర్గం మేధావితరగతి, లేబరు పార్టీలోని వామపక్ష కమ్యూనిస్టులు, మొదట గ్రహించిన శక్తులు. ఆ కాలంలో యూరపులోని హిట్లరు, ముస్సోలినీ నియంతృత్వాలతో పాటుగా దూరప్రాచ్యంలోని జపాను మిలిటరిజం తోడైంది. వీరి ధ్యేయాన్ని, స్నేహాన్ని బెర్లిన్-రోమ్-టోకియో ఆక్సిస్ అనేవారు. దీన్ని సోవియట్ రష్యా ఒక్కటే ప్రభుత్వపరంగా యీ ప్రమాదాన్ని గ్రహించింది. బ్రిటను యూరపు సామ్రాజ్యవాద శక్తులు బెర్లిన్ - రోమ్ -

టోకియో కలయిక ( axis ) సోవియట్ రష్యాపై దాడికి ఉపయోగపడుతుందని ఆశతో వుండేవారు. ఫాసిస్టు శక్తులు, ఒకమూల సామ్రాజ్యవాద శక్తులమధ్య వేరొకమూల సోవియట్ రష్యామధ్య ఒకరిపై ఒకరికి అనుమానాలు తీవ్రతరం చేయడానికి పూనుకొంటూ ఫాసిజం అందరినీ యుద్ధంలోకి యీడ్చే ప్రమాదంలోనే పెట్టింది.

నేను నా మిత్రులమూ లండనులో బహిరంగ సమావేశాల్లో, చర్చల్లో మా సోషలిస్టు స్టడీ సర్కిల్‌తో పాటు సోవియట్ రష్యాను బలపర్చేవారము. భారతదేశంలో కూడా సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ వ్యవస్థ పోవాలి కాబట్టి సోవియట్ ప్రభుత్వం అప్పుడు సామ్రాజ్యవాదానికి దేశీయ పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకం కనుక సోవియట్ రష్యా ప్రభుత్వాన్ని మేమూ బలపర్చేవారమూ. అయితే కొందరు మా యువక విమర్శకులు మమ్ములను "స్టాలినిస్టు"లని వ్యంగంగా పిలిచేవారు. అప్పుడు స్టాలిన్ అధికారంలో రష్యాలో వున్నాడు కాబట్టి కమ్యూనిస్టులలోనే మరోవర్గం స్టాలిన్ పాలనను వ్యతిరేకించేది; ట్రాట్స్కీని బలపర్చేవారు ట్రాట్స్కీయిస్టులని వాడుకగా పిలిచేవారు. లండనులోను యూరపులోను సోవియట్ రష్యా అభిమానులు, ట్రాట్స్కీ పార్టీ అభిమానులమధ్య తీవ్ర విభేదాలు చర్చలు జరిగేవి. అంతర్జాతీయంగా మూడవ ఇంటర్నేషనల్ సోవియట్ రష్యాకు అనుకూలంగా ఆయా దేశాల్లో కమ్యూనిస్టు పార్టీలుగానూ,

ట్రాట్స్కీయిజం పేరుతో నాలుగవ ఇంటర్నేషనలుగా ఆకారవంతంగా బయలుదేరాయి. ట్రాట్స్కీల వాదన ప్రపంచమంతటా సోషలిస్టు విప్లవం బయలుదేరితేనే రష్యాలో సోషలిస్టు వ్యవస్థ నిలబడుతుందని, స్టాలిన్ నాయకత్వంలో బ్యూరోక్రసీ బలపడిందని స్టేట్ కాపిటలిజం సాగుతుందని విమర్శలు చేసేవారు.

రష్యాలో సోషలిస్టు సమాజ నిర్మాణం సాధ్యమవుతుందని సోవియట్ వాదనను నేను అంగీకరించేవాడను. అందుచే స్టాలిన్ విధానం నియంతృత్వముకాదని నేను నమ్మేను. సోవియట్ రష్యా మూలంగా సామ్రాజ్యవాదానికి ఒక ఛాలెంజి అని అందుచే సోవియట్ రష్యా బలహీన పడకూడదనే కోరేవాడను. అయితే ఆ కాలంలో మూడవ ఇంటర్నేషనల్ (యిప్పటికి అది రద్దయింది) సోవియట్ ప్రభుత్వం, సామ్రాజ్యవాదానికి అంతర్జాతీయ దేశీయ కాపిటలిజానికి బద్ధవిరోధి. ప్రాశ్చాత్య దేశాల్లో వున్న మధ్య తరగతి జాతీయ భావాలు కలిగిన యువకులను సోవియట్ ప్రభుత్వ విధానం ఆకర్షించేది అని చెప్పాలి. అయితే మార్క్సిజం ఒక పిడివాదన కాకూడదు మూఢనమ్మకాల సంకుచిత తత్వం కాకూడదు. వర్గరాహిత్య సామాజిక నిర్మాణానికి మార్క్సిస్టు సిద్ధాంతము ఒక పనిముట్టు.

1936 రష్యాలో స్టాలిన్, ప్రభుత్వంలోను పార్టీలోను, ఒక బలమైన స్థానాన్ని కలిగి వున్నాడు. సామ్రాజ్యవాదానికి

వ్యతిరేకంగా సోవియట్ రష్యాను నేను బలపర్చడం ఒక మూలసూత్రమైంది. అందుచే దాని నాయకుడగు స్టాలిన్ సమర్ధించడం ఆ నాడు సహజమైంది. మరో 16 సంవత్సరాలకు (1953) స్టాలిన్ మరణంతో రష్యాలోని కమ్యూనిస్టు పార్టీ స్టాలిన్ విధానాలు కొన్ని సోషలిస్టు ప్రజాస్వామ్య పద్ధతులకు విరుద్ధమైనవని వ్యక్తి ఆరాధనాతత్వాన్ని పెంపొందించిందని రష్యన్ నాయకుడు కృశ్చేవ్ నాయకత్వంలో విమర్శలు బయలుదేరాయి. వ్యక్తి ఆరాధనా తత్వం భారత కమ్యూనిస్టులలో కూడ ప్రవేశించడం మూలంగా ఆ పార్టీ నాయకత్వాలు కేడర్లలో బానిస మనస్తత్వాన్ని రేకెత్తించడాన్ని నేను ముందుముందు విమర్శించాను.

నేను బ్రిటనులో వుండగా యిద్దరు బ్రిటీషు ప్రధాన మంత్రులు మారారు. లేబరుపార్టీ నాయకుడు రామ్సే మెక్‌డొనాల్డు ప్రధాని కావడం తదుపరి 1935 లో కాన్సర్వేటివ్ పార్టీ నాయకుడు స్టాన్లీ బాల్డ్విన్ ప్రధాన మంత్రి కావడం, ముగ్గురు బ్రిటీషు రాజులు మారడం జరిగింది. బ్రిటను పైకి శాంతిగా కనబడినప్పటికి దాని లోలోపల తీవ్ర సంచలన సంఘటనలున్నాయి. బ్రిటీషు రాజు పంచమ జార్జి 1935 లో నేను లండనులో వుండగానే మరణించాడు. అతని కొడుకు ఎడ్వర్డు 1936 లో బ్రిటీషురాజు కావడం, అతను వాలిస్ వార్‌ఫీల్డు సింప్సను

అనే ఆమెను పెండ్లాడడానికి నిశ్చయించుకొన్నమీదట, స్టాన్లీ బాల్డ్విన్ కాన్సర్వేటివ్ ప్రభుత్వం అభ్యంతరాన్ని లేవదీసింది. బ్రిటీషు ప్రభుత్వానికి క్రిష్టియన్ మాతాభిపతు లకు అభ్యంతరం బ్రిటీషురాజు గౌరవం గురించికాదు కాని, బ్రిటీషు రాజరిక తంతు పెట్టుబడిదారుల రాజ్యాధిపత్యానికి ఒక ఆర్భాటం కావాలి. ఇక బ్రిటీషురాజు కుటుంబీకులకు బ్రిటీషు రాజరిక వారసత్వం పోతుందని భయం కూడా కారణమైం దనాలి.

మిసెస్ సింప్సను అమెరికన్ స్త్రీ. అంతకుముందే యిద్దరిని పెండ్లాడి యిద్దరికీ విడాకులు యిచ్చింద. 1931 లో ప్రిన్సు ఆఫ్ వేల్సుగా వున్న ఎడ్వర్డును కలుసుకోడం జరి గింద. 1936 లో సింప్సను తన రెండవ భర్తనుండి విడా కులు పొందింది. ఎడ్వర్డు తండ్రి 1935 లో చనిపోయినతోడనే ఎడ్వర్డు రాజు కావడం, సింప్సనును 1936 లో పెండ్లి చేసుకోడానికి నిశ్చయించుకోడంతో బ్రిటనులో పత్రికలకు పండడి బయలుదేరింది. ఎడ్వర్డు సింప్సనును పెండ్లిచేసు కోడంవలన బ్రిటీషు ప్రజలకు లాభ నష్టమేమీ వుండవుకాని, బ్రిటీషు కాపిటలిస్టు సామ్రాజ్య ఆధిపత్యానికి కాని పరువుకై తాపత్రయం.

అందుచే బాల్డ్విన్ ప్రభుత్వం సింప్సనును పెండ్లాడితే ఆమెను బ్రిటీషురాణిగా గుర్తించడానికి వీలు లేదనడంతో ఎడ్వర్డు అంగీకరించలేదు. తనకు రాజరికపదవి లేకపోయినా

ఫరవా లేదు కాని సింప్సనుమాత్రము పెండ్లాడుతానని ఎడ్వర్డు పట్టుబట్టాడు. బాల్డ్విన్ ప్రభుత్వం ఎడ్వర్డు నిర్ణయంతో అంగీకరించక పోవడంతో, బ్రిటీషు రాజు ఎడ్వర్డు తన రాచరిక పదవిని త్యజించుకొన్నాడు. అతని తమ్ముడు ఆరవ జార్జి బ్రిటీషు రాజు చేయబడ్డాడు. [ఎడ్వర్డుకు సింప్సను భార్యగా లభించింది. అతని తమ్మునికి సింహాసనము దొరికింది. బ్రిటీషు పాలకవర్గ కాన్సర్వేటివ్ పార్టీ తమ దేశ రాచరికాన్ని యిలా సర్దుబాటు చేసుకొంది. అయితే దాని సామ్రాజ్య వ్యవస్థకు యిదేమీ సమస్య కాదు. ఆ రోజుల్లో లండనులో వున్న భారతీయ యువకులు నెల రోజులు ఎడ్వర్డు సింప్సను వ్యవహారం వార్తా పరంపరలతో ఒక సరదా ఉదంతంగానే పరిగణించారు. లండనులో నాకు యిల్లుయిచ్చి వంటచేసి భోజనం పెట్టే ముసలమ్మ మిసెస్ సాండర్సను ఎడ్వర్డు ఉదంతం గురించి తన ఉద్దేశం ప్రశ్నిస్తే "ఆ గొడవ మన కెందుకులే" అని దాటవేసింది. ఇక తమ దేశంలో రాచరిక తతంగం వాళ్ళ వ్యవహారాల్లో ప్రభుత్వం జోక్యం లేకుండా బ్రిటీషు రాజరికాన్ని రద్దు చేసుకొని బ్రిటను రిపబ్లిక్ అయితే మంచిదికదా అంటే దానికి అంగీకరించలేదు. మిసెస్ సాండర్సు కాన్సర్వేటివ్ పార్టీని బలపర్చేది.

ఆ కాలంలోనే లండనులో బస్సు కార్మికుల బ్రహ్మాండ సమ్మె పోరాటాన్ని చూడగలిగాను. బస్సు కార్మికుల కోర్కె

ఒక అరగంట పని తగ్గించాలని దాన్ని యాజమాన్యం అంగీకరించకపోతే లండను ట్రాన్సుపోర్టు కార్మికుల సమ్మె అద్భుతమైన నిర్మాణ శక్తితో విజయవంతమై తమ కోర్కెను సాధించుకోగలిగారు. విశాలమగు లండను నగరంలో వేలకొలది శ్రామికులసమ్మె నేను ఇండియా బయలు దేరేముందు ట్రేడ్ యూనియను ఉద్యమంయొక్క పోరాట శక్తిగా తెలుసుకొన్నాను.

బ్రిటనులో, మార్క్సు నిర్వచనం ప్రకారం సామాజిక వ్యవస్థలో శ్రామిక ఉద్యమంయొక్క వర్గ నిర్మాణశక్తి, వారి పోరాటాలద్వారా పెట్టుబడిదారీ వ్యవస్థకు ఒక చాలెంజిగా తెలుసుకొన్నాను. అయితే బ్రిటీషు రాజకీయ రంగంలో లేబరు పార్టీ ట్రేడ్ యూనియనులను చేతుల్లో పెట్టుకొంది. లేబరు పార్టీకి కమ్యూనిజం గమ్యస్థానంకాదు. సంస్కరణ తత్వంతో కూడిన సోషలిజం గురించి చెబుతూ, పెట్టుబడిదారీ వర్గంతో, రాజీ తత్వంతో కూడినది. ఇందులో ట్రేడ్ యూనియను ఉద్యమంలో కార్మికుల హక్కుల ఆందోళనకు, వారి ఉద్యమ నిర్మాణాన్ని పెంపొందించుకొంటూ, సమ్మె పోరాటాలను లేవదీస్తూ తద్వారా బ్రిటీషు కార్మికుల అభిమానాన్ని పెంపొందించు కొంది; బ్రిటీషు కమ్యూనిస్టు పార్టీ కార్మికుల్లో చొరబడకుండా ట్రేడ్ యూనియన్లలో ఆంక్షలుపెట్టి తమ పెత్తనాన్ని చెలాయించుకొంది. నేను సిద్ధాంతరీత్యా

లండనులో జరుగుతున్న ట్రేడ్ యూనియను కార్య కలాపాలను తెలుసుకొన్నప్పటికీ, కార్మికవర్గంలో ప్రవే శించిన సంస్కరణ శక్తుల ప్రమాదాన్ని గుర్తించలేదు ఇండియా వచ్చినతర్వాత లేబరులో ప్రవేశించిన కాంగ్రెసు పార్టీ లేబరు సంస్కరణ తత్వాము కమ్యూనిస్టు పార్టీ ట్రేడ్ యూనియను నాయకుల లేబరు సంస్కరణ తత్వాము అనుభవంలో చూడగలిగాను. అయితే స్వాతంత్ర్యానికి పూర్వము దాని ప్రమాదం అంత దుర్దశ కాలేదు

లండను విడిచిన తదుపరి బ్రిటీషు ట్రాన్సుపోర్టు కార్మి కుల సమ్మె పోరాట అనుభవం నేను ముందుముందు ఆంధ్రలో శ్రామిక ఉద్యమ నిర్మాణానికి, సమ్మె పోరాటంద్వారా కార్మికుల ఐక్యత, వర్గ చైతన్యం సోషలిస్టు సిద్ధాంత ప్రచారానికి ఉపయోగించానని చెప్పాలి.

బ్రిటనులో లేబరు ఉద్యమ చరిత్ర అవగాహన చేసు కొన్నాను. నేను లండను చేరకముందు వందసంవత్సరాలక్రితం ట్రేడ్ యూనియను ఉద్యమంలో కార్మికులు నిర్బంధాలకు గురి అవుతూ పోరాటన్ని సాగించారు. ఆ దేశంలో ట్రేడ్ యూనియన్లకు గుర్తింపు 1871-75 లోనే బయలుదేరింది 1906 లో సమ్మెహక్కు ట్రేడ్ తగాదా చట్టకింద పాలక వర్గాలు గుర్తించాయి. 1927 లో బ్రిటనులో బ్రహ్మాండ మగు వర్కర్ల జనరలు సమ్మె తదుపరి పాలకవర్గాలు కార్మికుల సమ్మెలు నిషేధానికి పూనుకొన్నాయి. ప్రభుత్వ

రంగంలోని ట్రేడ్ యూనియన్లకు బ్రిటీషు వర్కర్ల పెడతే పనులతో భాగం కాకుండా రాజకీయాల్లో జోక్యం లేకుండా నిషేధించాయి. లేబరు పార్టీ ఎన్నికల్లో పాల్గొనే శక్తిని దెబ్బ తీయడానికి ట్రేడ్ యూనియన్లు "రాజకీయ విరాళా లను" పాలకవర్గం నిషేధించింది.

ట్రేడ్ యూనియన్లతో నాయకులను నిర్బంధించ డానికి వంద సంవత్సరాల పూర్వమున్న నిర్బంధ చట్టాలను బ్రిటీషు పాలకులు బ్రిటనులో ప్రయోగించారు. అయినా బ్రిటీషు లేబరు పార్టీ పలుకుబడి బలం ట్రేడ్ యూని యన్లలో బాగానే పెరిగింది.

లండనులో నేను పాలకవర్గాల ఎత్తుగడలను తెలుసు కొనడమే కాకుండా ఇండియాలో బ్రిటీషు, కాంగ్రెసు దాని అనుచర పాలకుల నిర్బంధాలను మరింతమరింత తెలుసు కొన్నాను. వాట్ల అనుభవాలు పొంద తప్పదు అయ్యాను.

నేను లండనులో ఉండగా (1932-1937) బ్రిటీషు పాలకులు బ్రిటీషు కార్మికులయెడల భారత ప్రజలయెడల అవలంభిస్తున్న వైఖరి వేరుగా కనపడినా లక్ష్యం ఒక్కటే. బ్రిటీషు కార్మికులకు ఆర్థిక సంస్కరణలు కొద్దికొద్దిగా నిరుద్యోగ భృతి మప్పు చూపిస్తు వారి నాయకులగు రామ్సే మెగ్‌డొనాల్డు వంటి లేబరుపార్టీ నాయకులను పదవితో లోబర్చుకొని బ్రిటీషు కార్మిక ఉద్యమం యొక్క లక్ష్యమగు సోషలిస్టు ధ్యేయాన్ని తప్పించడానికి ఎత్తుగడలు ప్రయో

గింపబడినట్లు, భారత జాతీయ ఉద్యమాన్ని తాత్కాలికంగా సంతృప్తి పర్చడానికి రాజ్యాంగ సంస్కరణల చూపిస్తు భారతదేశంపై బ్రిటీషు పెత్తనం నిలబెట్టుకోడానికి ఎత్తు గడలుకూడా నేను చూడగలిగాను.

1933 లో బ్రిటీషు ప్రభుత్వము భారత దేశంలో రాజ్యాంగ సంస్కరణలకై ఒక శ్వేత పత్రాన్ని తయారు చేసింది. ఆ శ్వేత పత్రము సైమన్ కమీషను రిపోర్టును ఆధారం చేసుకొని, లండను రౌండు టేబిలు కాన్ఫరెన్సులో భారత రాజకీయ నాయకులగు మహాత్మా గాంధీజీతో సహా సంప్రదింపులు సాగించి, కాంగ్రెసుపై నిర్బంధాన్ని కొంత ప్రయోగించి, చివరకు 1935 భారత పాలన ఆక్టు (Government of India, Act, 1935) బ్రిటీషు ప్రభుత్వం ప్రవేశపెట్టింది

ఈ రాజ్యాంగ చట్టాన్ని బ్రిటీషు పాలకులు భారత ప్రజల కన్నీళ్లు తుడవడానికి తయారుచేసిందిగానే నేను లండనులో వున్న నా యువక రాజకీయ విద్యార్థులము భావించాము. భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యము రావాలని భారతదేశంలో సోషలిస్టు వ్యవస్థ ఏర్పడాలనే మాలోని అభ్యుదయ భావాలుగల యువకుల ఆకాంక్ష. భారత జాతీయ కాంగ్రెసుకూడా సంపూర్ణ స్వాతంత్ర్యానికే తీర్మానించినప్పటికి బ్రిటీషు పాలకవర్గంతో రాజీకి దిగుతుందనేభీతి మాలో లేకపోలేదు.

1848 లో ఫ్రెంచి విప్లవము కాలంలో ప్రఖ్యాత కమ్యూనిస్టు మానిఫెస్టోను రచించిన ప్రపంచ శ్రామికవర్గ నాయకుడు కార్లు మార్క్సు అప్పటి భారతదేశంలో పరిపాలన గురించి తన వ్యాఖ్యలను న్యూయార్కు డైలీ ట్రిబ్యూనల్‌కు ఫ్రెంచి విప్లవము ప్రారంభించిన 5 సంవత్సరాల తదుపరి వరుసగా 8 వ్యాసాలు వ్రాసారు. ఇండియాలో ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ గుత్తాధిపత్యాన్ని పొందడం అంతర్యుద్ధాలను రేకెత్తించడం ద్వారా, దేశాన్ని ఆక్రమించడానికి దండయాత్రలు, దోపిడీలు చేయడం, విప్లవ పరిస్తితులను అణగద్రొక్కడం కరువు కాటకాలకు ప్రజలను గురిచేయడం ఘోరపరిణామాలు లేవనెత్తి అప్పటి భారత సాంఘిక ఆర్ధిక వ్యవస్తను చిన్నాభిన్నం చేసిందని వ్రాసాడు.

అయితే బ్రిటనులోని బూర్జువా పాలకవర్గానికి, భారతదేశాన్ని కొల్లగొడుతున్న ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీకి మధ్య వైరుధ్యం ఆయన పరిశోధించారు. భారతదేశాన్ని కొల్లగొడుతున్న బ్రిటీషు వ్యాపావర్గం 18 వ శతాబ్దపు ఆఖరిరోజుల్లో 1783 లో ఇండియా బిల్లు బ్రిటీషు పార్లమెంటులో ప్రవేశపెట్టి బ్రిటీషు ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్ల పెత్తనాన్ని రద్దుచేయడానికి బ్రిటీషు ప్రధాని ఫాక్సు నాయకత్వం పూనుకొన్నప్పుడు ఫాక్సు ప్రభుత్వాన్ని ఈస్టిండియా కంపెనీ గుత్తాధిపత్యం ఓడించడం జరిగింది.

ఇండియాలో సాంఘిక పారిశ్రామిక విప్లవ పరిణామం చెందకుండా, దాని పాతకాలపు సాంఘిక పునాదులను ప్రోత్సహిస్తూ బ్రిటీషు దోపిడీవిధానం కొనసాగడానికి, ఈస్టిండియాకంపెనీ గుత్తాధిపతులు బ్రిటీషు బూర్జువా పాలకులు రాజీలుపడుతూ చివరకు ఏకం కావడం చరిత్రలో స్పష్టమైంది.

కార్లు మార్క్సు కమ్యూనిస్టు మానిఫెస్టోను తయారుచేసిన మరో పది సంవత్సరాలకు ఇండియాలో సిపాయి తిరుగుబాటు ఈస్టిండియా కంపెనీ పాలనపై బయలుదేరడం భారతదేశం సరాసరి (1858) బ్రిటీషు పాలకవర్గం కింద మారడం జరిగింది. ఇక ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ బ్రిటీషు బూర్జువా వర్గంలో లీనమయింది. పోతే భారతదేశంలో తమ సామ్రాజ్య పరిపాలన వ్యవస్థకు తోడుగా వుండడానికి అనుకూల శక్తులను ప్రోత్సహిస్తూ బ్రిటీషుపాలకులు ప్రయోగం మొదలుపెట్టారు.

భారతదేశం పూర్తిగా వ్యవసాయిక దేశంగానే సాగుతూ, గ్రామీణపేదలు భూమిపై హక్కు లేకుండా మధ్య దళారీల భూస్వామికవర్గాలచే దోపిడీ గావింపబడి, ముడిపదార్థాలు పెట్టుబడిదారీ వర్గాలకు చౌకగా లభ్యం కావడానికి, సామ్రాజ్యవాద వ్యవస్థ దాని లాభాలు పొందడానికి భారతదేశంలో బ్రిటీషు సామ్రాజ్యవ్యవస్థ రాజ్యాంగము నిర్మించుకొంటూ వచ్చింది.

గతంలో బ్రిటీషు ఆక్రమణదారులు వారిముందు మొగలు సామ్రాజ్యవాదులు అసమర్ధ పరిపాలన చెలరేగక ముందు భారత గ్రామీణ ప్రజలు భూమిని సమిష్టిగా వ్యవసాయం చేసుకొని, వృత్తులు విభాగించుకొని గ్రామీణ ఆర్ధిక వ్యవస్తను కొనసాగించుకోడం, "భూమి వ్యక్తిగత ఆస్తికాకుండా (Private Property) వుండడము" భారత ఖండములోను, ఆసియాలోను ఒక ప్రత్యేకత అని కార్లు మార్క్సు తన వ్యాసాల్లోను, తన మిత్రుడు ఫ్రెడరిక్ ఎంగిల్సుకు వ్రాసిన జాబులలోనూ 1853 తరుపరి వ్రాసారు.

భారత ఖండంలో వివిధ ప్రాంతాల్లో, వివిధ భాషల్లో, వివిధ మతాల ప్రభావంతో తమ సాంఘిక ఆర్థిక గ్రామీణ సముదాయాలు కొనసాగుతూ, వివిధ రాజరికాలు, తరుపరి యింగ్లీషు వ్యాపార కంపెనీ సాగించే దాడులు, దోపిడీలకు గురైై కూడా పాతకాలపు జీవిత వ్యవస్తనుండి బయటపడలేదు. అక్కడక్కడ పాలక వ్యవస్తపై తిరుగు బాటులు సాగినా, మోసంతోను, కౄరత్వంతోను, ఆయా పాలకులు రక్తపాతంచేసి అణగద్రొక్కారు.

మార్క్సు వ్రాసిన అప్పటి ఇండియాలో పరిస్తితి యింగ్లీషు ఈస్టిండియా కంపెనీ ఆధిపత్యం దాని స్తానంలో బలపడజేసిన బ్రిటీషు పార్లమెంటులోని పాలక వర్గం పాలన మార్పులు తెచ్చింది. నేను లండనులో చేరిన కాలానికి బ్రిటీషు పాలకవర్గం భారత భూస్వామిక పెట్టుబడి

దారీ వర్గాలతోను, జాతీయ బూర్జువా వర్గంతోను రాజీపాలన సాగించడానికి 1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టాన్ని తెచ్చిపెట్టింది.

నాకు ఇరువది నాలుగు సంవత్సరాల వయస్సు ప్రారయ్యేటప్పటికి బ్రిటీషు పాలకులు రాజ్యాంగ సంస్కారణాల పేరుతో భారతదేశంపై తమ ఆధిపత్యాన్ని కొనసాగించుకోడానికి మరో పన్నాగం ప్రారంభించారన్నమాట. ఆ వయస్సుకు నేను విశ్వసించింది మానవుల భవిష్యత్తు, నాదేశ ప్రజల భవిష్యత్తు శాస్త్రీయ కమ్యూనిస్టు సామాజిక ఆర్థిక రాజకీయ వ్యవస్థలోనే నిర్ధారణ కావాలని కోరాను. అయితే చరిత్రలోని మలుపులు ఘటనలు అవగాహన చేసుకోడానికి సంకోచించలేదు. ఉత్తమ మేధావుల రచనలనుండి సేకరించవలసిన విషయ పరిజ్ఞానాన్ని పొందుపర్చుకొన్నాను.

ఆ రోజుల్లోనే లండనులోని పామీదత్తు బ్రిటీషు కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతీకుడు భారతదేశ రాజకీయ పరిస్థితులపై బాగా అధ్యయనం చేసాడు. భారతదేశం గురించి ఒక పుస్తకాన్ని రచించడానికి పూనుకొన్నాడు. మా సోషలిస్టు స్టడీ సర్కిలులో పాల్గొనే నామిత్రుడు సేన్ లండనులో నివాస మేర్పర్చుకొని గ్రంథ విక్రయశాల నిర్వహిస్తుండగా ఆయనవద్దనుండి కావలసిన పుస్తకాలు భారతదేశపు వ్యవహారాలపై పామీదత్తు కొనేవాడు. పామీదత్తు

పుస్తకం " నేటి భారతదేశం ", నేను ఇండియావెళ్ళి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో నిమగ్నమైనప్పుడు రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన తర్వాత (1940) లో అచ్చైయింది.

నేను లండనులో వుండగానే 1937 ఫిబ్రవరిలో ఇండియాలో గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టుకింద రాష్ట్రాలకు ఎన్నికలు జరిగాయి అప్పటికి సంకుచిత ఓటింగు పద్ధతిపైనే 11 రాష్ట్రాలకు ఎన్నికలు జరిగాయి. అందులో 5 రాష్ట్రాలలో జాతీయ కాంగ్రెసు మెజారిటీ సాధించింది. అప్పటి రాష్ట్రాలన్నిటిలోని 1585 సీట్లలో సామ్రాజ్య వ్యతిరేక కాంగ్రెసు 657 సీట్లు గెల్చుకొంది. బ్రిటీషు పాలకుల మద్దతు పార్టీలన్నీ 634 సీట్లు గెల్చుకొన్నారు. ముస్లిం లీగు ముస్లిం యిండిపెండెంట్లు మొత్తం 236 సీట్లు గెల్చుకొన్నారు. ఎంత వన్నాగంతో సాధించినా 1935 రాజ్యాంగ చట్టం బ్రిటీషు పాలకులకు అనుకూలంగా సాగలేదు. బ్రిటీషు పాలకుల కింతవున్న అప్పటి రాష్ట్రాలు పెద్దవి. భారత ఉపఖండము బ్రిటీషు పాలనకింద కలసివున్నది.

1936 లో జాతీయ కాంగ్రెసు సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థగా వుండేది. సోషలిస్టులు, కమ్యూనిస్టులు కాంగ్రెసులోనే వుండేవారు. మహాత్మాగాంధీజీకి కాంగ్రెసులో అప్పుడు 4 అణాలు సభ్యత్వంకూడ లేదు కాని జాతీయ కాంగ్రెసు పార్టీ సంపూర్ణ నాయకత్వం ఆయన చేతుల్లో

వుంది. గాంధీజీ నాయకత్వంయొక్క ప్రత్యేకత బ్రిటీషు సామ్రాజ్యవాదుల భారత రాజ్యాంగ వ్యవస్థలో, 1935 చట్టం ముందు, పాల్గొనకుండా దానిముందూ ఎన్నికలు బహిష్కరించడం మూలంగా జాతీయ ఉద్యమంలో అవకాశవాదం లేకుండా పోరాట సంస్థగా బలపడింది. అయితే కాంగ్రెసు నాయకులు సి. ఆర్. దాస్, మోతీలాల్ నెహ్రూలు గాంధీజీతో బేధించి బ్రిటీషుపాలకుల శాసన కౌన్సిలులలో పాల్గొనుటకు ఎన్నికల్లో పోటీ చేయాలని స్వరాజ్యపార్టీని ముందు నిర్మించారు. తరువాత గాంధీజీ నాయకత్వం కిందే చేరారు. ఇక 1935 చట్టంకింద ఎన్నికల్లో పాల్గొనడానికి కాంగ్రెసు గాంధీజీ అనుమతిని పొంది రాష్ట్రాలలో గెలిచింది. కాని 1935 చట్టంకింద ఫెడరల్ భాగాన్ని కేంద్రంలో నిర్మాణాన్ని కాంగ్రెసు వ్యతిరేకించింది.

ముందుగానే ఢిల్లీ కేంద్ర సెంట్రల్ అసెంబ్లీలో పాతచట్టం ప్రకారం 144 స్థానాల్లో కాంగ్రెసు గెలిచిన స్థానాలు 44 వున్నాయి. బలమైన ప్రతిపక్షంగానే కేంద్ర అసెంబ్లీలో కాంగ్రెసు రాణించింది. కేంద్ర, అసెంబ్లీ నిర్మాణము 1919 మాంట్ ఫర్డ్ సంస్కరణలకింద ఏర్పడింది. దానిలో కాంగ్రెసు ప్రతిపక్షంగా బ్రిటీషు పాలనలో వ్యవహరించింది. ఇక 1935 చట్టంకింద రాష్ట్ర శాసనసభలో మెజారిటీ సంపాదించిన రాష్ట్రాలలో బ్రిటీషు గవర్నర్ల కింద రాష్ట్ర ముఖ్యమంత్రి వర్గాలను నిర్మాణంచేసి బ్రిటీషు గవర్నర్లకింద పని ప్రారంభించింది.

---

దేశద్రోహ నేరంకింద ప్రముఖ సోవియట్ కమ్యూనిస్టులగు పైటకోవ్, సెరిబ్రయటకోవ్, రాడక్, సాకోలింకోన్ మరి యితరులపైన విచారణ ప్రారంభమైంది. అంతకుముందు 1934 లో లెనిన్‌గ్రాడ్‌లోని సోవియట్ కమ్యూనిస్టు నాయకుడు కిరోవ్‌ను హత్యా సందర్భములోను తదుపరి దేశద్రోహ నేరంకింద వందపైగా వ్యక్తులపైన జరూరు విచారణ ప్రారంభించి స్టాలిన్ ప్రభుత్వం వారికి మరణశిక్షలు విధించింది.

రష్యాను విప్లవం తదుపరి (1917) సోవియట్ యూనియను అత్యద్భుతంగా నిలకడ సాధించుకొన్న దనుకొన్న కాలంలో 20 సంవత్సరాలకు 1937 లో దేశద్రోహనేరంకింద విప్లవంలో పాల్గొన్న కమ్యూనిస్టులను ప్రాశ్చాత్య దేశాల్లోవున్న స్టాలిన్ ప్రత్యర్థి ట్రాట్స్కీ అనుచరులని జర్మనీ, జపాను పాసిస్టు శక్తులతో లాలూచీదారులని విచారణలు జరిపి మరణ శిక్షలు విధించడము సోవియట్ అభిమానులనుకూడా డోకలవరపర్చింది.

రష్యాను విప్లవ విజయానికి నేను ఆకర్షితుడనుకావడం మూలంగా మార్క్సిస్టు, లెనిన్ సిద్ధాంత అనుచరుడుకావడం మూలంగా నేను సోవియట్ రష్యాలోని యీ విచారణలు ఖండించాను. తదుపరి స్టాలిన్ నాయకత్వం ఆ కాలంలోని ప్రత్యర్థివర్గాన్ని పూర్తిగా నిర్మూలించడానికి అధికార దుర్వినియోగం చేసిందని అనుమానించాను.

స్టాలిన్ తదుపరి అధికారంలోకి వచ్చిన కృశ్చెవ్ మొదలగు రష్యను నాయకులు కూడా స్టాలిన్ వ్యక్తి

కష్టభూయిష్టమో నా కప్పుడు తెలియదు. అలా తెలియక పోవడమే నాకు ముందుముందు మేలు అయిందని చెప్పాలి.

స్వార్థము అవకాశవాదం అవినీతితో కూడిన వర్గాల జీవితాలయెడల నేను వ్యతిరేకిని. ఎందుచేతనంటే మానవ జీవితము చాల పవిత్రమైనదని నా ఆలోచన. ఆ అంచనాలో ఆ పవిత్రతను కలుషితంచేసే శక్తులయెడల నాకు విపరీత మైన వైరుద్యం, కాని ఆచరణలో దాన్ని విచ్ఛిన్నంచేసే శక్తిని ప్రదర్శించానో లేదో చెప్పలేను.

దానినుండి బయలుదేరే సంఘర్షణలో పడ్డాను. నాకు ఆంతరంగిక సంఘర్షణ తక్కువేమీకాదు. ఆంత రంగిక సంఘర్షణ బాహ్యసంఘర్షణతో ముడిలేకపోతే, నిస్తబ్దత బయలుదేరుతుంది. నేను నిస్తబ్దతను కోరలేదు.

నాకు 25 సంవత్సరము పూర్త య్యేటప్పటికి ఇంగ్లాండు యాత్ర పూర్తయినట్లే. సామ్రాజ్యవాదమూ ఉచ్ఛదశనుండి పాసిస్టు నియంతృత్వముగా యూరపులో బయలుదేరింది. ప్రపంచ యుద్ధానికి దారి తీస్తున్న ప్రమాదంలో పడింది. ప్రపంచం యుద్ధప్రమాదంలో పడకుండా నివారించాలనే ఉత్తమ మానవశక్తులు తీవ్రమైన ఆందోళనలో వున్నాయి. యిక ఇండియావంటి వలసదేశాల్లో విదేశీ పాలనాధి పత్యమూ సన్నగిల్లే దశకూడ ప్రారంభమైంది.

ఇక లండనులో నాకు కలిగిన స్వేచ్ఛ ఆధారంగా మానవ వ్యవహారాల పరిశోధన నా జీవితంలో ప్రధాన

భాగముగా వ్యాపకమై యిక ఇండియాకు బయలుదేరడానికి సిద్ధమయినాను.

ఇక నా ప్రయాణ ఖర్చులకు మాత్రము అవసరమగు డబ్బు మిగుల్చుకొన్నాను. అయితే ప్రయాణము యూరపు నుండి, రష్యానుండి రైలు ప్రయాణంచేసి వ్లాడివస్టాకునుండి సముద్ర ప్రయాణంద్వారా ఇండియా చేరాలని ప్లాను వేసుకొన్నాను. అందు అవసరమగు సమాచారాన్ని సేకరించుకొన్నాను. అది 1937 సంవత్సరం అర్ధభాగం.

లండనునుండి పారిస్ వచ్చి అక్కడనుండి బెర్లిన్ బయలుదేరి పోలెండులో వార్సాకు చేరి అక్కడనుండి మాస్కో చేరాలనుకొన్నాను. మాస్కోనుండి సైబీరియా రైలుద్వారా రష్యాదాటి సముద్రంపై స్టీమరు ప్రయాణం చేసి మద్రాసు చేరాలనే ప్లాను వేసుకొన్నాను. యూరపు ప్రయాణానికి నా పాస్‌పోర్టు సరిపోతుంది, యిక రష్యాలో ప్రయాణం చేయడానికి, లండనులోని రాయబారి కార్యాలయానికి వెళ్ళి వీసాకు దరఖాస్తుచేసాను.

నేను యూరపునుండి సోవియట్ రష్యామీదుగా ప్రయాణంచేసి దూరప్రాచ్యంలోని వ్లాడివోస్టాకు పోర్టుకు చేరి అక్కడినుండి స్టీమరుమీదుగా ఇండియాకు చేరాలని ప్రయాణ కార్యక్రమం వేసుకొన్న కాలములో (1937) యూరపు ఒక అగ్నిపర్వతంగా హిట్లరిజంకింద యుద్ధానికి తయారవుతూంది. ఇక సోవియట్ రష్యాలో

దేశద్రోహ నేరంకింద ప్రముఖ సోవియట్ కమ్యూనిస్టులగు పైటకోవ్, సెరెబ్రియకోవ్, రాడక్, సొకోలింకోవ్ మరి యితరులపైన విచారణ ప్రారంభమైంది. అంతకుముందు 1934 లో లెనిన్‌గ్రాడ్‌లోని సోవియట్ కమ్యూనిస్టు నాయకుడు కిరోవ్‌ను హత్య సందర్భములోను తదుపరి దేశద్రోహ నేరంకింద వందపైగా వ్యక్తులపైన జరూరు విచారణ ప్రారంభించి స్టాలిన్ ప్రభుత్వం వారికి మరణశిక్షలు విధించింది.

రష్యను విప్లవం తదుపరి (1917) సోవియట్ యూనియను అత్యద్భుతంగా నిలకడ సాధించుకొన్న దనుకొన్న కాలంలో 20 సంవత్సరాలకు 1937 లో దేశద్రోహ నేరంకింద విప్లవంలో పాల్గొన్న కమ్యూనిస్టులను ప్రాశ్చాత్య దేశాల్లో వున్న స్టాలిన్ ప్రత్యర్థి ట్రాట్స్కీ అనుచరులని జర్మనీ, జపాను ఫాసిస్టు శక్తులతో లాలూచీదారులని విచారణలు జరిపి మరణ శిక్షలు విధించడము సోవియట్ అభిమానులనుకూడా కలవరపర్చింది.

రష్యను విప్లవ విజయానికి నేను ఆకర్షితుడను కావడం మూలంగా మార్క్సు, లెనిన్ సిద్ధాంత అనుచరుడు కావడం మూలంగా నేను సోవియట్ రష్యాలోని యీ విచారణలు సమర్థించాను. తదుపరి స్టాలిన్ నాయకత్వం ఆ కాలంలో తన ప్రత్యర్థి వర్గాన్ని పూర్తిగా నిర్మూలించడానికి అధికార దుర్వినియోగం చేసిందని అనుమానించాను.

స్టాలిన్ తదుపరి అధికారంలోకి వచ్చిన క్రుష్చెవ్ మొదలగు రష్యను నాయకులు కూడా స్టాలిన్ వ్యక్తి

పూర్తి కాలేదు. మరో నెల టైము తీసుకోనేటట్లు కన పడింది

అప్పటికి నావద్ద ఇండియా ప్రయాణానికి సరిపడు డబ్బు మాత్రమే వున్నది. లండనులో నెలరోజుల ఖర్చు అంటే అది ఇండియాకు స్టీమరు ప్రయాణానికి సరిపడే డబ్బు. నేలమీద ప్రయాణం కొంచెము ఎక్కువ ఖర్చు అవుతుందని నా అంచనా. ఆగష్టు 1937 నాటికి నేలమీద ప్రయాణానికి నా ఏర్పాట్లన్నీ పూర్తికాని పరిస్థితుల్లో అదనపు ఖర్చులకు అదనపు డబ్బు యింటివద్దనుండి రప్పించాలి. ఇక లండనునుండి బయలుదేరేముందు అది చేయ తలచలేదు. లండను బయలుదేరినప్పుడు నాకు డబ్బుకు లోటు లేకపోయినా, అక్కడి నా ఖర్చులు కూడా చాల క్లుప్తంగానే చేసేవాడినని చెప్పాలి.

లండనులో వుండగా నా తండ్రి వ్యాపారం ఆయన ఆర్జన గురించి పట్టించుకోలేదు. నిజానికి నా అవసరానికి ఆయననుండి డబ్బు తీసుకోవడమే తప్ప వృధాగా ఖర్చులకు పూనుకోలేదనే నేను చెప్పాలి. అయితే నేను యింటికి బయలుదేరే ఒక సంవత్సరం ముందు (1936) నా తండ్రి వ్యాపారము సన్నగిల్లిందనే సూచనలు ఆయన సరకులు ఎగుమతిచేసే నికల్సు అండ్ నికల్సు కంపెనీ లండను వ్యాపారులు చెప్పడం జరిగింది. అసలు నాతండ్రి వ్యాపార విషయా లేమీ ఎప్పుడు చెప్పలేదు వ్రాయలేదు కూడాను,

ఒకసమస్య. ముఖ్యంగా కమ్యూనిస్టు గ్రంథాలు ఇంగ్లాండులో సులువుగా కొనవచ్చు, చదవవచ్చు, అప్పుడు ఇండియాలో నిషేధింపబడిన గ్రంథాలు. బ్రిటీషువాళ్ళ దేశంలో వున్న స్వాతంత్ర్యము, ఇండియాపై వాళ్ళు ఆధిపత్యం చెలా యిస్తున్న భారతప్రజల దేశంలోనే, భారతప్రజల స్వేచ్ఛ అపహరించారు. అయితే 1937 లో కాంగ్రెసుపార్టీ రాష్ట్ర లలో గెల్చినప్పటికి బ్రిటీషు గవర్నర్ల ఆధిపత్యంకింద గతంలో నిషేధింపబడిన కమ్యూనిస్టు గ్రంథాలు నిషేధం లోనే, నేను యింటికి బయలుదేరే కాలానికి, వున్నాయి.

బ్రిటనులో వామపక్ష పుస్తక క్లబ్బును స్థాపించి అప్పటికి ఆధునికమయిన గ్రంథాలను దాని మెంబర్లకు చౌకగా లభ్యంచేసే పబ్లిషరు గొల్లాంక్సుతో సంప్రదించి అందులో ముఖ్యమగు గ్రంథాలను ఇండియాలోని స్థానిక భాషలలో ముఖ్యంగా తెలుగుభాషలో అచ్చువేయించుటకు ఆంధ్రలో తెలుగు ప్రజలకు అందుబాటుచేసే ఏర్పాటు గురించి మాట్లాడాను. అది నేను పుస్తక వ్యాపారదృష్ట్యా కాదు. నేను చూచింది తెలుగు ప్రజలకు రాజకీయ, శాస్త్రీయ, విజ్ఞాన గ్రంథాలను చౌకగా లభ్యంచేసే దృష్టితో గొల్లాంక్సుతో మాట్లాడాను. అయితే గొల్లాంక్సు వ్యాపారి, ఎంత వామపక్ష పుస్తకాలను అచ్చువేయిస్తున్నా వ్యాపార కంపెనీలు వ్యాపార కంపెనీలే. అప్పటికే ఇండియాలోని ప్రభుత్వాన్ని సమర్థించడానికి

గొల్లాంక్సుకు సాహసం లేదు. ఇండియాలోని పాలన వ్యవహారంబట్టి తన పుస్తకాల వ్యాపారాన్ని ప్రభుత్వం సాగనివ్వదనే భయం వెలిబుచ్చాడు. బ్రిటీషు రాజకీయ సంస్కరణాల మూలంగా కొంత పరిస్థితులు మారినా గొల్లాంక్సుకు మాత్రం నమ్మకం సరిపోలేదు అది కొంత వాస్తవం కూడాను. నేను 1937 సెప్టెంబరులో ఇండియాలో దిగేటప్పటికి, నా పుస్తకాల పెట్టెలన్నీ జాగ్రత్తగా స్టీమరులో వేరే ఎడ్రసుకు పంపినా, కొద్దిపుస్తకాలు అనుమానం లేనివి అందులో ముఖ్యంగా సిడ్నీ బీట్రీస్ వెబ్బులు రచించిన సోవియట్ కమ్యూనిజం — వారిరచన ప్రమాదమేమీ కాదు — ఇండియాలో ఆ పుస్తకం అమ్మడు అవుతున్న రోజులవిల, ఆ పుస్తకాన్ని నా సరకులన్ని సోదాచేసినప్పుడు పోలీసులు స్వాధీనం చేసుకొన్న వృదంతం నాకు ముందుముందు అర్ధమైంది. గొల్లాంక్సు నిజానికి ప్రమాదమైన పబ్లిషర్ కాదు, అయినా అతనికి ఆరోజుల్లోనే సంకోచం బయలుదేరిందంటే వేరే చెప్పనక్కర్లేదు.

20 శతాబ్దంలో మూడవభాగం పూర్తయి నాలుగవ శతాబ్దము కీలకకాలము. రాజకీయ ఆర్థిక సామాజిక విధానాలకు మార్పుకాలము. నేను జూలై నెల (1937) లోనే లండనునుంచి యూరపునుండి నేలమీదుగా రష్యాదాటి రైలు ప్రయాణంగురించి కాగితాలు ఏర్పాట్లు పూర్తిచేసు కొనే ప్రయత్నాలు నెలరోజులు దాటాయి, కాని ఏర్పాట్లన్నీ

పూర్తి కాలేదు. మరో నెల టైము తీసుకోనేటట్లు కన పడింది

అప్పటికి నావద్ద ఇండియా ప్రయాణానికి సరిపడు డబ్బు మాత్రమే వున్నది. లండనులో నెలరోజుల ఖర్చు అంటే అది ఇండియాకు స్టీమరు ప్రయాణానికి సరిపడే డబ్బు. నేలమీద ప్రయాణం కొంచెము ఎక్కువ ఖర్చు అవుతుందని నా అంచనా. ఆగష్టు 1937 నాటికి నేలమీద ప్రయాణానికి నా ఏర్పాట్లన్నీ పూర్తికాని పరిస్థితుల్లో అదనపు ఖర్చులకు అదనపు డబ్బు యింటివద్దనుండి రప్పించాలి. ఇక లండనునుండి బయలుదేరేముందు అది చేయ కలచలేదు. లండను బయలుదేరినప్పుడు నాకు డబ్బుకు లోటు లేకపోయినా, అక్కడి నా ఖర్చులు కూడా చాల క్లుప్తంగానే చేసేవాడినని చెప్పాలి.

లండనులో వుండగా నా తండ్రి వ్యాపారం ఆయన ఆర్జన గురించి పట్టించుకోలేదు. నిజానికి నా అవసరానికి ఆయననుండి డబ్బు తీసుకోవడమే తప్ప వృధాగా ఖర్చులకు పూనుకోలేదనే నేను చెప్పాలి. అయితే నేను యింటికి బయలుదేరే ఒక సంవత్సరం ముందు (1936) నా తండ్రి వ్యాపారము సన్నగిల్లిందనే సూచనలు ఆయన సరకులు ఎగుమతిచేసే నికల్సు అండ్ నికల్సు కంపెనీ లండను వ్యాపారులు చెప్పడం జరిగింది. అసలు నాతండ్రి వ్యాపార విషయాలేమీ ఎప్పుడు చెప్పలేదు వ్రాయలేదు కూడాను,

మిగతావారు ఎవరూ మా తండ్రి ఎగుమతుల వ్యాపారానికి అవాంతరం ఏమి వచ్చిందో లండనులో వుండగా నాకు తెలియచేయలేదు. అయితే నేనుమాత్రం నికల్సు అండ్ నికల్సు కంపెనీ లండనులో నాకు నెలవారీ యిచ్చే 30 పౌనుల (యింగ్లీషు డబ్బు) పంపవద్దని చెప్పాను. నావద్ద నున్న నిల్వవున్న డబ్బు ఖర్చు పెట్టుకొన్నాను. నా తండ్రి తాను ఇండియాలో ఒక గుత్తవ్యాపారి కంపెనీ అగు యింగ్లీషు వ్యాపారసంస్థ, ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ తో పోటీగా దక్షిణాదిని ఎరువులు వ్యాపారం ప్రారంభించడంతో ఆ గుత్త ఇంగ్లీషు వ్యాపార సంస్థ దాని స్తోమత ఆర్థిక బలాన్ని వుపయోగించి మా తండ్రి వ్యాపారాన్ని స్తంభింపచేసిందని ఇండియా చేరినతరువాత తెలుసుకొన్నాను. అయినా నన్ను ధనార్జనలో పడమని కోరలేదు. నా తండ్రి తన స్వయంశక్తితో ముందుముందు పూర్వపుస్థాయి కాకపోయినా తన ఎగుమతుల వ్యాపారాన్ని, ఎరువుల అమ్మకాన్ని నిలబెట్టుకొన్నారు. నా రాజకీయ కార్యకలాపాలకు అడ్డుపెట్టలేదు.

ఆగస్టు 1937 లో ఆస్ట్రేలియన్ స్టీమరు ఒరాంటిస్‌లో నా ప్రయాణానికి కొలంబోకు టిక్కెట్టు కొన్నాను. అనవసర ఖర్చులు లేకుండ లండనునుండి బయలుదేరి 26 మైళ్ళలోనున్న టిల్‌బరీ డాక్సులో స్టీమరు ఒరాంటిస్ ఎక్కాను. ఇక్కడనుంచి స్టీమరు ప్రయాణమూ కొలంబోకు

మూడు వారాలు సాగుతూంది. స్టీమరు టిల్‌బరీ డాక్సు నుండి జిబ్రాల్టరులో ఆగగా మధ్యధరా సముద్రములో ఫ్రెంచిరేవు టులోను ఆగి తదుపరి ఇటలీ రేవు పట్టణం నేపుల్సులో ఆగి పోర్టుసెడ్ మీదుగా సూయజ్ కాలువ నుండి అరేబియా సముద్ర ప్రయాణంనుండి అప్పటి సిలాన్ (శ్రీలంక) ముఖ్యపట్నం కొలాంబో చేరుతుంది.

నేను లండను విడిచేటప్పటికి మరో 2 సంవత్సరాలలో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. అప్పటికే బ్రిటీషు ఆధీనంలోవున్న జిబ్రాల్టర్ రేవు వున్న స్పెయిన్ దేశంలో ఫ్రాంకో తిరుగుబాటు అంతర్యుద్ధం బయలుదేరింది. స్టీమరు ఆగినప్పుడు జిబ్రాల్టర్ రేవు పట్టణంలో దిగి ఆ కొండమీదనుంచి నగరాన్ని పరిశీలించాను. తదుపరి ఇటలీ దేశపు రేవు నేపుల్సులో దిగి ఆ పట్టణం అంతా చూచాను. ముసోలినీ ఇటలీలో నియంతృత్వాన్ని కొనసాగిస్తూ ఆఫ్రికాలోని అబిసీనియా (ఇథోఫియా) ను ఆక్రమిస్తున్నాడు.

యూరపు సామ్రాజ్యవాదం ప్రపంచమంతటా వ్యాపించడమూ, ఆఫ్రికా ఖండాన్ని పంచుకోడం నేను జ్ఞప్తికి తెచ్చుకొన్నాను. ఈ సామ్రాజ్యవాదం స్థిరంకాదనే విశ్వాసంతోనే దానిని ఎదుర్కొనే స్థిరసంకల్పుడుగానే నేను యింటికి చేరుకొంటున్నాను. అయితే మరో పది సంవత్సరాలు నేను బ్రిటీషు సామ్రాజ్యవాద వ్యవస్థను నా దేశం

లోని అన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులతో కలసి ఎదుర్కోవడంలో కష్టభూయిష్టాలను అనుభవించడము నా భారతదేశం 1947 ఆగస్టుకు స్వాతంత్ర్యము సముపార్జించుకోడము నా జీవితకృషిలో ఒక దశ సాఫల్యమూ, కాని ప్రపంచముతో సామ్రాజ్యవాదవ్యవస్థ త్వరితంగా అంతమయి పెట్టుబడిదారీ దోపిడీ విధానము దానితో అంతమయి కమ్యూనిజంవైపు నా దేశమేకాకుండా మానవాళి అంతా పురోగమించాలనే మహత్తర ఆశయం నా జీవితకాలమంతా దీక్షాకాలమంటాను. నా 25 సంవత్సరాల తర్ఫీదుకాలమూ వృధాకాలేదంటాను. ముందుకాలానికి పునాది అయింది.

నా స్టీమరు ప్రయాణంలో నాతో ప్రయాణం చేస్తున్న ఇంగ్లీషు కుటుంబము ఒకటి పరిచయమయింది. వారు తండ్రి తల్లి యిద్దరు పిల్లలు, ఒక అమ్మాయి, ఒక అబ్బాయి వున్నారు. ఆ ఇంగ్లీషు కుటుంబము న్యూజీలాండుకు వలస పోతున్నారు. (వారి పేర్లు నాకు యిప్పుడు జ్ఞాపకంలేదు.) అసలు ఉత్తర ఇంగ్లాండు నివాశితులు నిరుద్యోగం మూలంగాను న్యూజీలాండులో నూతన జీవితానికి బ్రిటీషు వలసదారులకు అవకాశమూంటుందనే కోరికకొద్దీ తరలిపోతున్నారు. ఆ కుటుంబపెద్ద అభ్యుదయకర భావాలుకల వ్యక్తిగా మా చర్చలలో వ్యక్తమయింది. ఆ కుటుంబము నా భావాలు తెలుసుకొని సన్నిహితమయినారు. అతను నన్ను ప్రశ్నిస్తే భారతదేశంలో నాబోటి యువకులందరికీ నా భావాలే

తుంటాయా అని ప్రశ్నించాడు. అది అంత సులువైన విషయం కాదన్నాను.

నాతో స్టీమరులో ప్రయాణం చేస్తున్న ఒక ఆస్ట్రేలియన్ పౌరుడు నాకంటే బాగా పెద్దవాడు (అతని పేరు పిటో అని ఒక జ్ఞాపకం) 50 సంవత్సరా లుంటాయి. నాకు పరిచయమయ్యాడు. అతడు ఆర్థిక శాస్త్రవేత్త అన్నాడు. ఏదో ఒక చిన్న గ్రంథము వ్రాసాడు. ఆస్ట్రేలియా కూడా బ్రిటీషు కామన్ వెల్తులో వున్నదే. న్యూజీలాండు కామన్ వెల్తులో కొన్నిలక్షల పౌరులుంటే ఆస్ట్రేలియాలో దానికి నాలుగురెట్లు జనాభా వుంటుంది. ఈ రెండు దేశాలు బ్రిటీషు వాళ్లు వలసపోయిన దేశాలు. మొదట్లో ఆస్ట్రేలియా బ్రిటను లోని పెద్ద నేరస్తులకు ఒక సెటిల్ మెంటు అయినా బ్రిటీషు జాతులు స్థావరం ఏర్పర్చుకొని, ఆస్ట్రేలియాలోని ఆదిమ జాతులను లొంగదీసి పారద్రోలి ఆ ఖండమంతా కూడా తమకు అభివృద్ధి చేసుకొన్నారు. బ్రిటీషు నావికుడు కెప్టెన్ కుక్ ఆస్ట్రేలియాను కనుగొన్న (1770 లో) 50 సంవత్స రాల తరువాత బ్రిటీషు అధీనంలో పడి బ్రిటీషు నేరస్తులకు స్థావరమై మరో 50 సంవత్సరాల తర్వాత ఫెడరల్ ఆస్ట్రేలియాగా అభివృద్ధి చెంది బ్రిటీషు కామన్ వెల్తుగా రాజ్యాంగం పొందింది.

నాకు పరిచయమైన ఆస్ట్రేలియన్ పిటో భారత దేశం కూడా ఆస్ట్రేలియావలె కామన్ వెల్తులో భాగమవు

టుందని డొమినియన్ స్టేటసు పొందునని జోస్యం చెప్పటం మొదలుపెట్టాడు. భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యం పొందాలని భారత ప్రజల ఆకాంక్ష అని నేను నొక్కి చెప్పాను. బ్రిటీషురాజు ప్రతినిధి వైస్‌రాయ్‌గా బ్రిటీషు గవర్నరు జనరలుగా భారతదేశంపై రుద్దడం భారత ప్రజల స్వేచ్ఛకు అభివృద్ధికి అనుకూలమయిందికాదని నేను వాదించాను.

మా స్టీమరు ప్రయాణంచేస్తూ పోర్టుసెడ్ (ఈజిప్టు) చేరకముందు ఒక ఈజిప్షియను ప్రయాణీకుడు స్టీమరులో కొందరు స్నేహితులు కలసి ఒక పెద్ద టేబిల్‌వద్ద విన్నరు ఏర్పాటుచేసి నన్నుకూడా యీ విందులో చేరమని కోరితే మర్యాదకు అంగీకరించాను. అందులో పాల్గొన్నవారు ఇంగ్లీషు పౌరులు, ఈజిప్షియన్లు, ఆస్ట్రేలియన్లు, భారతీయులు, సిలాన్ (శ్రీలంక) దేశస్థులు మొదలగువారు వున్నారు

ఒరాంటీస్‌లో ప్రయాణం చేస్తున్న ఎక్కువమంది బ్రిటీషు పాలనకింద వున్నవారు. అందులో ముఖ్యంగా ఇంగ్లాండులో ఏడ్వర్డురాజు మిసెస్ సింప్సను పెండ్లాడానికి బ్రిటీషు రాజరికాన్ని విడనాడుకొన్న తర్వాత 1936 లో అతని సోదరుడు ఆరవజార్జి, బ్రిటీషు సింహాసాన్ని అధిష్టిస్తున్న కాలంలో ఆ రాజరిక ఉత్సవాన్ని చూడడానికి వచ్చిన వారే. తమ తిరుగు ప్రయాణంలో కొందరు మా స్టీమరులో వున్నారు. ఉమ్మడి విందు కార్యక్రమాన్ని పూనుకొన్న

ఆ ఈజిప్టు పౌరుడు ఈజిప్టులో ఒక ఉన్నత అధికారి అని నేను విన్నాను కాని అతనిపేరు చెప్పలేదు. పిండుత్తో పాటు నూతన బ్రిటీషురాజుకు అభినందన సూచనగా అందరూ నిలబడి గౌరవవందన (toast) పూనుకొన్నారు. నేను కూర్చున్నాను కాని నిలబడలేదు. ఆ ఈజిప్టు దేశస్థుడు తదుపరి నేను ఎందుచేత బ్రిటీషురాజుయెడల గౌరవము చూపలేదని ప్రశ్నించాడు. భారత ప్రజల దారిద్ర్యానికి, బానిసత్వానికి బ్రిటీషుపాలన కారణము కనుక దానికి చిహ్నమగు బ్రిటీషురాజును గౌరవించడమంటే నా భారత ప్రజలను కించిత్తుపర్చడమవుతుందని నా భావము అన్నాను. ఆ ఈజిప్టు పౌరుడు మొఖము చిట్లించుకొన్నాడు.

భారతదేశంవలె ఈజిప్టుకూడా పురాతన నాగరికత కల దేశము అయితే చారిత్రకంగా చాల దాడులకు గురై పోయింది. ప్రాశ్చాత్య దండయాత్రలకు రోమనులనుండి ఒలీవరయూాక్ కఫలనుండి ఒట్టొమన్ టర్కులనుండి చివరకు బ్రిటీషు సామ్రాజ్యవాదులచే ఈజిప్టు పీడింపబడుతూంది. బ్రిటీషు సామ్రాజ్యవాదులకు అనుకూలురగు, ఈజిప్షియన్లు యితరులు నాతో ప్రయాణం చేస్తున్నవారిలో వున్నారు. బ్రిటీషు సామ్రాజ్యవాద అనుకూల వ్యక్తులయెడల నాకు మానసికంగా సిద్ధాంతరీత్యా వ్యతిరేకత.

నా స్టీమరు పోర్టుసెడ్ దాటి, సూయజ్ కాలువ దాటి ఎర్ర సముద్రంలో ప్రవేశించినపుడు ఒక మధ్యాహ్నం

భోజనాలు పూర్తిచేసి మేము కబుర్లు చెప్పుకొంటున్న సమయంలో ఆకస్మికంగా స్టీమరు వార్నింగు సైరన్ అన్ని మూలలనుండీ మోగింది. ఆ వార్నింగు సైరన్‌కు ప్రయాణీకులందరు లైఫ్ బెల్టులు తగిలించుకొని సిద్ధంగా వుండాలి. వెంటనే అందరమూ కాబిన్‌లోకి వెళ్ళి రక్షణ బెల్టులు పెట్టుకొని డెక్ మీదకు వచ్చాము. ప్రమాదం ఏమిటో ఆతురతతో వున్నాము.

ఒరాంటిస్ స్టీమరులోని ఒక వ్యక్తి సముద్రంలో పడిపోయాడని మేమంతా డెక్కుమీదకు వెళ్ళినతోడనే వెల్లడైంది. స్టీమరునుండి ఎలా పడిపోయాడా అని మాకు అనుమానం వేసింది. ప్రయాణం చేస్తున్న వారిలో ఏ దేశస్థుడు పడిపోయాడో తెలియలేదు. ఒరాంటిస్ వంటి ఒక పెద్ద ప్రయాణీకుల స్టీమరు సముద్రంలో సాగుతూ అన్ని సదుపాయాలున్న ఒక పెద్ద హోటలు వంటిది కాని దానినుండి పడిపోవడము ఉంటుందని నేను అనుకోలేదు.

అయితే ప్రయాణీకు లెవ్వరూ కంగారుపడకుండా అందరూ ఒక వరుసలో డెక్ మీద సమీకరింపబడ్డారు. స్టీమరు ప్రయాణీకులకు ఒక శిక్షణగా ప్రమాదమనుకొన్న సమయంలో ఒక ప్రాక్టీసు అనుకొన్నాను.

ఈ సంఘటన జరిగినతోడనే తరువాత స్టీమరు అధికారులు ఏమిచేస్తారా అని మాకు ఆశ్చర్యం కలిగింది.

అప్పటికే ఈ ప్రయాణం రెండు వారాలు సాగింది. మరో వారం ప్రయాణ మున్నది, యిప్పటివలె విమాన

ప్రయాణాలున్న రోజులుకావు, యిప్పటి విమాన ప్రయాణంలో బొంబాయినుండి లండనుకు 8 గంటలు ప్రయాణం మాత్రమే.

ఎన్ని సదుపాయాలున్నా ప్రయాణంలో విసుగుచెందిన ప్రయాణీకులకు మనిషి నీటిలో పడిపోవడం ఒక వింతను లేవదీసింది.

స్టీమరు సముద్రంలో ఆగి వెనక్కు కదలడం మొదలు పెట్టింది. ఎక్కడ మనిషి పడిపోయాడో సముద్రంలో స్టీమరులోని నావికులు గుర్తు పట్టారన్నమాట వెనక్కు పోయి ఆగి స్టీమరునుండి ఒక పడవను దింపి సముద్రంలో పడిపోయిన మనిషిని పైకి తెచ్చారు. ఆ మనిషిని ప్రాణంతోనే తీసుకు వచ్చారు. అతడు సముద్రంలో పడి పోయి మునిగిపోకుండా యీదుతూ రక్షణ వచ్చేవరకు నిల వొక్కకొన్నాడన్నమాట. అతడు వంట విభాగంలో పనిచేసే వ్యక్తి అలసిపోయినవాడట రాత్రి నిద్రలేని కారణంచేత పైభాగంలో కూర్చునివుండగా కళ్లు తిరిగి నీటిలో పడిపోయాడని మా ప్రయాణీకులకు తెలిసింది. సముద్రంలో పడిపోయిన అతడు మంచి యీతగాడు, శ్రమజీవి. ప్రయాణీకులకు భోజనం తయారుచేయడానికి అతను యజమానుల చాకిరీకి అవసరం. నావికులు అతన్ని నీటినుండి పైకి తెచ్చారు, యిక చికిత్స పొందాడు. అతడు ప్రాణంతో తేలి, మేము కొలంబో చేరేవరకు అతడు వంటపాకము తయారుచేసాడు. తదుపరి నాకు తెలియదు.

అయితే నా 25 వట, యీ ప్రయాణంలో సంఘటనే నా జీవిత యాత్రలోని ఒక పాఠానికి సమన్వయం చేసుకొంటున్నాను. నేను యీ మానవ సామాజిక మహా సముద్రంలో పడిపోయినవాడనే, కాని నేను అలసటతో, చాకిరీ భారంతో పడిపోయినవాడనుకాను. నా శక్తికొద్దీ సర్వం తెలుసుకొనే యీ సముద్రంలో పడిపోయాను. ఆ శ్రామికుడిలాగే యీ సముద్రంలో మునిగిపోలేదు. నేను గజయీతగాడనే, ఇక తప్పదనే యీదుతున్నాను. నా జీవితం కొరగానిదిగా చూచుకోడంలేదు. అందుచే యీ మహాసముద్రంలో తేలుతూ సాగుతున్నాను.

అయితే స్టీమరుపైనున్న జనులు " అయ్యో! పాపము. పైకి వచ్చేయి. విందులు వినోదాలు యీ పెద్ద పడవపైన వున్నాయి. మాతో భాగస్వామి కావయ్యా " అని నీటిలో కొట్టుకొంటున్న నన్ను పైనుండి ఆహ్వానిస్తున్నట్లున్నది.

నేను ఈదుతూ, మునుగుతూ, పైకితేలుతూ " ఓ జనులారా! ఏం, పరవాలేదు. మన సమాజంలో జీవితమే ఒక సముద్రంలో ఈతవంటిది. తేలి ఒడ్డుచేరితే గమ్యస్థానం చేరినవాడనవుతాను, లేకపోతే మునిగిపోతాను. మరొకడు యీది ఆశయ ఒడ్డు చేరుకొంటాడు." అన్నట్లు యీదుతున్నాను.

నేను సాగుతున్న మహాసముద్రంలో పెద్దచేపలు చిన్న చేపలను తినివేస్తున్నాయి కదా! చిన్నచేపలు వందలు

వేలకొలది ప్రాణాలను కాపాడుకొంటూ తమజాతి అంతం కాకుండా రక్షించుకొంటున్నాయి. ఈ విశాలమగు మహా సముద్రాల్లో తిండికి కొదువా? అడ్డులూ ఆటంకాలు ఏమి వుండవుకదా! చిన్నదీ పెద్దదీ యీ నిరంతర ప్రవాహపు జలాల్లో బ్రతికేవికదా! పెద్దవి చిన్నవాట్లను రక్షించాలికదా! వాట్లను భక్షించడము దేనికి?

ఈ మహా ప్రవాహంలో కెరటాలతో సముద్ర అల్ల కల్లోలంతో, ఉప్పెనలతో పెద్ద నీటిజంతువులు, పెద్దచేపలు నాశనమవుతున్నాయి. మిగిలేది చిన్నచేపలేకదా! ఈ మహా సముద్రంలో అల్లకల్లోలాలు, జలప్రళయాలు చిన్నవాట్లకు రక్షణకదా! అన్నీ నాశనమైతే యిక యీ సృష్టిలోని మహాసముద్రంలో నీటిప్రాణికి తావే వుండదు.

నా పూహాజనితమైన సముద్ర ఈతలో మనుష్యులను హెచ్చరిస్తూ "ఓ మానవులారా! బలమైనవాళ్ళు బలహీనులను బక్షించకండి, భూమి చిన్నది, సృష్టి విశాలమైంది, జ్ఞానంకలిగిన మానవజాతి ఉన్నత నాగరికతను వర్గ రాహిత్యమై సమానత్వం కలిగిన నూతన జీవితానికి అంకితముకండి. పీడించడం, దోపిడీచేయడం, సమాజాన్ని మోసగించడం మీ వాక్కు అంటే, మాయ స్వార్ధాన్ని సాగిస్తుంటే విప్లవ కల్లోలాలు బయలుదేరుతాయి, దోషులు జవాబు దారీ అవుతారు అని హెచ్చరిస్తూ మానవ మహా సముద్రంలో నా ఈత కొనసాగుతూంది.

సుమారు అర్ధ శతాబ్దం క్రితంగల నా మానసిక ప్రవృత్తిని వివరిస్తున్నాను. మానవ గమ్యస్థానం విషయమై అప్పటినుండి యిప్పటికి నాకు సందేహంలేదు కాని యీ లోగా సంభవించిన మార్పులు, యుద్ధాలు, విప్లవాల గుణ పాఠాలన్నీ కూడా మానవజాతికి సంపూర్ణ ఫలితాలను కలుగచేయలేదు.

అయితే అర్ధశతాబ్దం తరువరి నేను వ్రాస్తున్న (1986) కాలానికి కూడ ప్రపంచములోని సామ్రాజ్యవాద శక్తులు మరో ప్రపంచ మహాసంగ్రామానికి సిద్ధంగావున్నట్లే అనాలి. 1937 కంటే నేటి పరిస్థితి మహా భయంకర మయిన దశ అనాలి. రెండవ ప్రపంచ యుద్ధం ముగింపు (1945) హీరోషీమా, నగసాకాలలో హైడ్రజను బాంబు ప్రయోగంతో వేల ప్రజలు ప్రాణాలు కోల్పోవడం నేడు అగ్రరాజ్యాల చేతుల్లోవున్న అణుబాంబుల విధ్వంశక శక్తి ముందు అది తుప్పిగంతులకింద లెక్క చేయాలి. నేటి అణ్వాయుధాల యుగంలో మహా ప్రపంచయుద్ధం సంభవిస్తే భూమిమీద మానవజాతి అంతా సర్వనాశనమైపోయే ఘోర ప్రమాదమున్న కాలము.

నా స్టీమరు కొలాంబో రేవు చేరుకొంటుంది. అప్పటి సిలోన్ దీవి (యిప్పుడు శ్రీలంక) బ్రిటీషు పాలకుల అధీనం లోనే వుంది. లండను బయలుదేరేటప్పుడు నేను బొంబాయి రేవులో 1932 లో స్టీమరు ఎక్కాను.

ఇంటికి వచ్చేటప్పుడు 1937 సెప్టెంబరులో కొలాంబో రేవు పట్టణంలో దిగాను. నాతో పాటు కొంతమంది ఆస్ట్రేలియన్‌లు కూడా దిగారు. కొలాంబో హోటలులో ఒక రోజు వుండి మరుచటిదినాన్ని రైలులో తలైమన్నారు వెళ్ళి అక్కడనుంచి లాంచిలో ధనుష్కోడిలో దిగుటకు నాకు టిక్కెట్టు వున్నది.

సిలోన్, ఇండియాలు బ్రిటీషు సామ్రాజ్యవాదుల చేతుల్లో వున్న దేశాలే. అయితే యిది చిన్న ద్వీపము. దీని జనాభా 1937 లో 53 లక్షల పైగా వుండేటుంది. ఇప్పటికి (1976) శ్రీలంక జనాభా సుమారు 1½ కోట్లు వున్నది. అప్పటి మొత్తం భారతఖండం జనాభా 35 కోట్లు. పాకిస్తాన్ పోయినా యిప్పటికి ఇండియా జనాభా 68 కోట్ల పైగా వుంది. సిలోన్ చరిత్ర భారత ఖండముతో ముడిపడి వున్నది. 2,500 సంవత్సరాల క్రితము ఉత్తర భారతమునుండి బయలుదేరిన జాతులు అప్పటి సిలోన్‌లోని వద్దా జాతులను లోబర్చుకొని బౌద్ధ మతస్థులగు సింహళీయులుగా స్థిరులయ్యారు. 480 సంవత్సరాల క్రితము పోర్చుగీసు వలస పాలకులు సిలోన్ చేరి 150 సంవత్సరాలు స్థావరాలు ఏర్పర్చుకొని పెత్తనం సాగించారు. తదుపరి బ్రిటీషు వలస పాలకులు పోర్చుగీసువారిని తరిమివేసి, సిలోన్‌ను సుమారు 200 సంవత్సరాల క్రితము మద్రాసు ప్రెసిడెన్సీలో (అప్పటి ఉమ్మడి రాష్ట్రంలో) కలుపుకొన్నారు. మరో అర్థ సంవత్సరాలకు

కి ప్రత్యేక బ్రిటీషు కాలనీగా మారడానికి ప్రత్యేక బ్రిటిషు సయామాకం బ్రిటీషు పాలకులు ఏర్పర్చి, మూడు ంవత్సరాలకు బ్రిటీషు వలస పాలకులు కాండీరాజును హిష్కరించేసి సిలోన్ నుండి తరిమివేసి సిలోన్ అంతటి బ్రిటీషు ఆధిపత్యం సాగించారు.

1937 లో నేను కొలాంబోలో ఉన్నప్పుడు సిలోన్ షు గవర్నర్ క్రింద వుండి 50 మంది సభ్యులు కలిగిన స్టేట్ కౌన్సిలు గవర్నరు ఆధిపత్యంలో పాలనవుంది. జనాభా 70 శాతం సింహాళీజాతీయులు సుమారు శాతం తమిళులు. తమిళులు ఎక్కువమంది పనుల ి సిలోన్ వలనవచ్చినవారు. ఇక బ్రిటీషు పాలనలో పొందిన మధ్యతరగతి తమిళులు, వ్యాపారస్తులు సిలోన్‌లో నివాసం ఏర్పర్చుకోడం, బ్రిటీషు పాల చేతుల్లో ఇండియా, సిలోన్ లుండుటవలన తమ ఆధిపత్యాన్ని కొనసాగించుకోడానికి రెండు జాతులను వర్గం వృసరించి ఉనారు.

నేను కొలాంబోలో గ్రహించింది అక్కడి మధ్య పౌరులు ఆంగ్లేయుల అలవాట్లు భారతీయులకంటే వగా అలవర్చుకొన్న వారుగా కనపడ్డారు. నేను ందులో వుండగా సింహాళ మధ్యతరగతి ధనికులకు యువక విద్యార్థులను కలుసుకోడం జరిగింది. లో రాజకీయ చైతన్యముకలిగిన యువకులు ట్రాట్స్కీ

సిలోన్ ప్రత్యేక బ్రిటీషు కాలనీగా మారడానికి ప్రత్యేక గవర్నరు నియామకం బ్రిటీషు పాలకులు ఏర్పర్చి, మరో 13 సంవత్సరాలకు బ్రిటీషు వలస పాలకులు కాండీరాజును పదవీభ్రష్టుని చేసి సిలోన్ నుండి తరిమివేసి సిలోన్ అంతటి పైనా బ్రిటీషు ఆధిపత్యం సాగించారు.

1937 లో నేను కొలాంబోలో ఉన్నప్పుడు సిలోన్ బ్రిటీషు గవర్నరుక్రింద వుండి 50 మంది సభ్యులు కలిగిన ఒక స్టేట్ కౌన్సిలు గవర్నరు ఆధిపత్యంలో పాలనవుంది. సిలోన్ జనాభా 70 శాతం సింహాళజాతీయులు సుమారు 22 శాతం తమిళులు. తమిళులు ఎక్కువమంది పనుల గురించి సిలోన్ వలసవచ్చినవారు. ఇక బ్రిటీషు పాలనలో తర్ఫీదు పొందిన మధ్యతరగతి తమిళులు, వ్యాపారస్తులు కూడా సిలోన్‌లో నివాసం ఏర్పర్చుకోడం, బ్రిటీషు పాలకుల చేతుల్లో ఇండియా, సిలోన్ ఉండుటవలన తమ పాలనాధిపత్యాన్ని కొనసాగించుకోడానికి రెండు జాతులను పాలకవర్గం ప్రయోగించడినారి.

నేను కొలాంబోలో గ్రహించింది అక్కడి మధ్య తరగతి పౌరులు ఆంగ్లేయుల అలవాట్లు, భారతీయులకంటే ఎక్కువగా అలవర్చుకొన్న వారుగా కనపడ్డారు. నేను ఇంగ్లాండులో వుండగా సింహాళ మధ్యతరగతి ధనికులకు చెందిన యువక విద్యార్థులను కలుసుకోడం జరిగింది. అందులో రాజకీయ చైతన్యముకలిగిన యువకులు ట్రాట్స్కీ-

కమ్యూనిస్టు భావాలు కలవారు. ఆయువకులే సింహళములో తదుపరి సమ సమాజ పార్టీ (ట్రాట్స్కీ గ్రూపు) ఏర్పాటు చేసుకొన్నారు. అయితే బ్రిటనులో వామపక్ష భావాలు కలిగిన భారత విద్యార్థులు ముప్పై దశకంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీకి అనుకూలురు; అది మూడవ కమ్యూనిస్టు యింటర్ నేషనలుకు చెందినది. ట్రాట్స్కీకి చెందిన కమ్యూనిస్టు ఉద్యమం నాలుగవ కమ్యూనిస్టు యింటర్ నేషనలుకు చెందింది.

మీరట్ కమ్యూనిస్టు కేసులో బ్రిటీషు పాలకులు ట్రేడ్ యూనియను నాయకులకు శిక్ష విధించి, బాల్య దశలో నున్న భారత కమ్యూనిస్టు పార్టీని నేను ఇంగ్లాం డులో వుండగానే నిషేధించింది.

నేను కొలంబోనుండి ధనుష్కోడి చేరుకోడంతో భారత భూభాగంపై సుమారు $4\frac{1}{2}$ సంవత్సరాల తర్వాత నా యువక దశలో స్వదేశానికి వచ్చానన్నమాట. తలై మన్నారునుండి లాంచీలో చేరేటప్పటికి యింకా భారతభూమి మీద అడుగు పెట్టేలోగానే నన్ను "ఆహ్వానించినవారు" పోలీసు ఉద్యోగులు. వాళ్ళ "ఆహ్వాన కార్యక్రమం" నా పుస్తకాలు తనిఖీ చేయడానికి వచ్చారు. నా దగ్గరకూడా ఎక్కువ పెట్టెలులేవు. ఒక బట్టలపెట్టె మరొక చిన్న పెట్టె కూడా వున్నాయి. నా దేశం వచ్చేటప్పటికి పోలీసులు వెంటబడడం, ప్రారంభమైందా అనుకొన్నాను.

కాన్ని పోలీసుల స్వాధీనం కాకుండా యీ శ్రద్ధ ముందు గానే తీసుకొన్నాను. కమ్యూనిజానికి సంబంధించిన పుస్తకాలే ముఖ్యంగా నిషేధంలో ఆ రోజుల్లో ఇండియాలో వుంటాయని వూహించాను. ముఖ్యంగా కమ్యూనిస్టులు వ్రాసిన పుస్తకాలు, సోవియట్ రష్యాలో అచ్చయిన కమ్యూనిస్టు సిద్ధాంత గ్రంథాలు ఆ రోజుల్లో భారత దేశంలో అవస్త్రకానికి అరుదు, నిషేధముకూడా. నిజానికి సుభాష్‌చంద్ర బోసు వ్రాసిన "ఇండియన్ పోరాటం" (Indian Struggle) అనే పుస్తకమూ భారత దేశంలో అప్పుడు నిషేధింపబడింది. అది బోసుయొక్క జీవితచరిత్రకు సంబంధించినది, ఆయన రాజకీయ భావాలను ప్రతిబింబించేవి. బోసు కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ప్రబోధించినవాడు కాదు. దేశ స్వాతంత్ర్యం గురించి రాజీధోరణికి వ్యతిరేకి. ఆయన పుస్తకం 1936 లో యింగ్లాండులో అచ్చైయింది. నేను దానిని చదివాను. సుభాష్‌చంద్రబోసును 1936 లో బ్రిటీషు పాలకులు భారత దేశంనుండి బహిష్కరించారు. ఇంగ్లాండు కూడా ప్రవేశించడానికి ఆయనకు అనుమతి ఇవ్వలేదు. బోసు పుస్తకం ఇంగ్లాండులో కొని యిటికి తెచ్చాను. ఆ పుస్తకం పోలీసుల చేతిలో పడకుండా సేయితర పుస్తకాలన్నిటితో వేరే ఎడ్రసుకు పంపాను.

నా మిత్రుడు బండి రామమోహనరావు నా కంటే ముందు ఇండియాకు వచ్చాడు. వచ్చినతోడనే మద్రాసులో

న్యాయవాద వృత్తిలో ప్రవేశించాడు. తరువాత ఆయన జిల్లా మున్సిఫ్ ఉద్యోగంలో ప్రవేశించి జిల్లా జడ్జి పదవి నిర్వహించి రిటైరైనారు. ఆయన తండ్రి మద్రాసు ప్రభుత్వంలో పెద్ద ఉద్యోగి, ఇనస్పెక్టరు జనరలు ఆఫ్ రిజిస్ట్రేషను ఉద్యోగంలో వున్నారు. ఆయన బ్రిటీషు పాలకులకు నమ్మకమైన ఉద్యోగి. అందుచే ఆయన ఎడ్రసుకు నా మిత్రుడు రామమోహనరావుకు నా పుస్తకాల పెట్టెలు పంపితే సురక్షితంగా నా పుస్తకాలన్నీ నాకు దక్కుతాయని లండనులో అనుకొనే స్టీమరు కంపెనీకి ఆ ఎడ్రసుకు బట్వాడా చేయుటకు ఏర్పాటు చేసుకొన్నాను.

అయితే నాకూడా మాత్రం సిడ్నీ బీట్రిస్ వెబ్బుల సోవియట్ కమ్యూనిజం మచ్చుకుమాత్రం తెచ్చుకొన్నాను. అది పోలీసుల చేతుల్లో పడింది. సిడ్నీ బీట్రిస్ వెబ్బులు కమ్యూనిస్టులు కారు. మార్క్సిస్టు వర్గపోరాట సిద్ధాంతాన్ని పూర్తిగా అంగీకరించినవారు కాదు. అయితే రష్యాలో విప్లవము దాని పరిణామం సోవియట్ విధానం మెచ్చుకొనేవారు దాన్ని వ్రాసారు. ఆ పుస్తకం నా దేశంలో పోలీసులు నిషేధమనుకొన్నారంటే పాతకాలపు ధోరణులు అప్పటికీ నాటుకొనే వున్నాయనాలి.

నేను ధనుష్కోడి ఎక్స్‌ప్రెస్‌నుండి మద్రాసులో దిగినతోడనే నా తండ్రి నన్ను స్టేషనులో కలుసుకొన్నారు. నా తమ్ముడు సి. ఎస్. మూర్తి ఆయనతో కాకినాడనుండి వచ్చాడు.

---

నా పెట్టెలు తనిఖీచేసి నావద్దనున్న నిషేధపు పుస్త కాలు స్వాధీనం చేసుకోడానికి ఆర్డరు పై వచ్చామని పోలీసు అధికారి చెప్పాడు. "ఎవరు మీకు ఆర్డర్లు యిచ్చారు, ఏవి నిషే ధపు పుస్తకాలు" అని ప్రశ్నించాను. జిల్లాకలెక్టరు ఆర్డరు పైన వచ్చామని ఆ ఆర్డరు నాకు చూపించారు. నిషేధపు పుస్తకాలు వివరాలున్నాయని అవి ఏవో తనకు తెలుసునని జవాబు చెప్పారు. నా పెట్టెలు తీసి చూపించాను. నా వద్ద ఎక్కువ పుస్తకాలు లేవు కాని అందులోవున్న సిడ్నీ, బీట్రిస్ వెబ్బుల పుస్తకమూ వాళ్ళను ఆకర్షించింది. దాని పేరు "సోవియట్ కమ్యూనిజం" అని వుండడమూతో దానిని తీసారు. ఆ పుస్తకంతీసి దానిని స్వాధీనం చేసుకొంటున్నా మన్నారు. ఇంకేమీ అక్కర్లేదా అన్నాను. మన దేశంలో యీ పుస్తకం నిషేధింపబడిందని ఎలాగు చెబుతారు అన్నాను. నిషేధపు పుస్తకాల లిష్టు చూపిస్తారా అన్నాను. తమకు అనుమానంవేసిన పుస్తకం స్వాధీనం చేసుకో వచ్చునని, తరువాత పరిశోధనపై అది నిషేధం కాకపోతే తిరిగి కలెక్టరునుండి నాకు పంపివేయబడుతుందని అన్నారు.

"మీకు ఆ శ్రమ లేకుండానే, ఒక విషయం చెప్ప దలచాను, యీ రాష్ట్రంలో యిప్పుడు అధికారములోవున్న కాంగ్రెసు పార్టీ కేంద్రనాయకుడు జవహార్‌లాల్ నెహ్రూ వెబ్బుల "సోవియట్ కమ్యూనిజం" పుస్తకం చదివా నని అది అద్భుతమయిన పుస్తమని ఆయన వ్యాఖ్యానం

లండనులో వుండగానే పత్రికల్లో చదివాను. నేటి పాలకుల నాయకుడే యీ పుస్తకం మెచ్చుకొంటే మీ పోలీసు లేమిటి యిది నిషేధమంటున్నారు" అన్నాను. "అది మాకు తెలియదు మా బాధ్యత మేము నెరవేరుస్తున్నాము" అని పోలీసు అధికారి చెప్పగా యీ పుస్తకం నా వద్దనుండి మీరు స్వాధీనం చేసుకొన్నట్లు రసీదు యిస్తారా అని అడిగాను. వెంటనే ఆ అధికారి అలా రసీదు యిచ్చాడు, యిక ధనుష్కోడి మద్రాసువెళ్ళే రైలు ఎక్కాలి, నన్ను యింతే సేపు యిక్కడ ఆపారు, బండి దొరుకుతుందా అని పోలీసులను అడిగాను. అందులో ఒకరు నాతో వస్తున్నారని యింకా బండికి టైమువున్నదని జవాబు చెప్పారు. నాకేమీ తోడు అక్కర్లేదు. మద్రాసులో దిగినతోడనే నా తండ్రి స్టేషనులో కలుసుకొంటారని అన్నాను. మీకు తోడుకాదు మా డ్యూటీ మేము చేసుకొంటాము అన్నాడు పోలీసు అఫీసరు. ఇక నా దేశంలో పోలీసులు నన్ను "కనిపెట్టి" "వెంటాడడం" మొదలుపెట్టారనుకొన్నాను. నా దేశంలో యిలా నాస్వేచ్ఛ ప్రారంభమయింది.

నా పుస్తకాలన్నీ నా యింటి అడ్రసుకు పంపమని స్టీమరు కంపెనీని కోరలేదు. రెండు పెద్ద పేకేజీ పెట్టెల పుస్తకాలను నేను ప్రయాణంచేసిన స్టీమరు కంపెనీకి వ్రాసి, వాట్లను మద్రాసు ఎడ్రసుకు పంపమని నేను లండనులో బయలుదేరేటప్పుడే వేరే అడ్రసుయివ్వడం జరిగింది. నాపుస్త

# సంసారం ప్రారంభం:

## శ్రామిక ఉద్యమం — యుద్ధం

## (1937 - 1939)

(౦)

నేను కమ్యూనిస్టు సిద్ధాంత ప్రబోధకుడుగా రావడం సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వ్యవస్థకు విరోధిగా నా దేశానికి చేరుకొన్నాను. పాలకవర్గాలకు యిదొక ఛాలెంజి. ఎటువంటి చిక్కులు నన్ను ఆవరించనున్నాయో నాకు అప్పుడు స్పష్టంగా అంచనా లేదు కాని, చిక్కులు తప్పవనే దశలోనే పడ్డాను. అయితే నా ఆత్మ సంతృప్తి మాత్రము ఒక ఉత్తమమైన వ్యాపకంలోనే పడ్డాను అనుకొన్నాను. ఈ వ్యాపకంలో వ్యక్తి ఆశలు పెట్టుకోలేదు. ఈ సమాజం మారాలి అని నేను నమ్మిన సిద్ధాంతము నేను విడవదలచలేదు. వర్గాలులేని సమాజంగాను, మనిషిని మనిషి దోపిడీ చేయని సమాజంగాను, కమ్యూనిస్టు వ్యవస్థగా మారాలనేదే నా ధ్యేయం.

నేను మద్రాసులో 1937 సెప్టెంబరులో దిగేటప్పటికి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ప్రముఖ కాంగ్రెసు నాయకుడు సి. రాజగోపాలాచారి నాయకత్వంకింద రాష్ట్ర ప్రభుత్వం కొనసాగుతూంది. ఆక్టింగు గవర్నరు సర్ కె. వి. రెడ్డి నాయుడు, జస్టిస్ పార్టీ నాయకుడు, బ్రిటీషు పాలకులు

తర్ఫీదుచేసిన బ్యూరోక్రసీ కింద కాంగ్రెసుపార్టీ మంత్రివర్గం అప్పుడు పని చేస్తుందన్నమాట. అది ప్రమాదకరమైన పరిస్థితి; పదవులుండవచ్చు కాని ప్రజాజీవితం బాగుపడడం కష్టం. అవసరమైతే ప్రత్యక్షంగానో లేక పరోక్షంగానో బ్రిటీషు పాలకవర్గం అధికారాన్ని చెలాయిస్తుంది. కాంగ్రెసు పార్టీని, బ్రిటీషు తాబేదార్లను, పెట్టుబడిదారీవర్గాలను కూడ గట్టుకోవాలని బ్రిటీషు పాలకుల ఎత్తుగడ రాజకీయం.

నిజమే జాతీయ కాంగ్రెసు నాయకులు బ్రిటీషు పాలకవర్గంకింద, గాంధీజీ నాయకత్వంకింద అప్పటికి 17 సంవత్సరాలు నిర్బంధాలు అనుభవించిన మీదట, సంపూర్ణ స్వాతంత్ర్యం తమ ధ్యేయ మన్నప్పటికీ, 1935 భారత రాజ్యాంగ చట్టంకింద, బ్రిటీషు అధిపతుల వుచ్చు చట్రంలోకి రాజీగానే దిగారు.

నేను లండనులో వుండగానే 1935 భారత రాజ్యాంగ చట్టం పరిణామాల ప్రభావం అర్థం చేసుకొన్నాను. కాంగ్రెసు పార్టీ అధికారంలోకి వచ్చినంతమాత్రాన్న నా దేశంలో సామాన్య ప్రజానీకం అధికారంలోకి వచ్చిందని వారికి ఆర్థిక సమానత్వం లభించినట్లు కాని కాదని, నేను విమర్శించాను. ఈ దశలో భారతదేశంలోని శ్రామిక వర్గం రాజకీయ చైతన్యం పొంది ఒక స్వతంత్ర్య శక్తిగా బలపడడంద్వారా సామ్రాజ్య వాదాన్ని పూర్తిగా ఓడించడమూ జరుగుతుందని నేను నమ్మాను.

ఇక్కడ యీ సందర్భంలో ఒక విషయాన్ని కూడా ముందుగానే కొంత వివరించాలి. నేను స్టేషను విడిచిన తోడనే నా పుస్తకాన్ని పోలీసులు ఎలా స్వాధీనం చేసుకొని నా దేశంలో నా స్వేచ్ఛ బహు పరిమితమనుమా అని 1937 లోనే నాకు ఎలా చాటారో, మరొక సంవత్సరానికి కాకినాడలో శ్రామికవర్గాన్ని సమైక్యపరుస్తూ వారి రాజకీయ చైతన్యానికి, వారి ఆర్థిక హక్కుల సాధనకు సమ్మె పోరాటాలు సాగిస్తున్నప్పుడు రాజాజీ కాంగ్రెసు ప్రభుత్వం మమ్మల్ని అరెస్టుచేసి 1938 లోనే మొదటిసారిగా జైలు జీవితం చవి చూపడం కూడా జరిగింది. నా దేశంలోని అప్పటి పాలకవర్గంతో ప్రథమంగా అనుభవం నా సిద్ధాంతాన్ని కూడా రుజువుచేసింది. వీట్ల వివరాలు ముందు సంఘటనల్లో విపులీకరిస్తాను.

మద్రాసునుండి నా తండ్రి, నా తమ్ముడు మూర్తితో కలసి రైలులో కాకినాడకు బయలుదేరాము. ఇంటికి బయలుదేరడం నాకు ఆనందంగానే వుంది. ఇంటికివచ్చిన తోడనే నా తల్లిని, నా భార్యను, ఆమె తల్లిని, తమ్ములను, మా తమ్ముల్ల నందరినీ చూస్తాననే ఉత్సాహం లోపల వున్నది. నా రైలు సామర్లకోట చేరేటప్పటికి ముందుగానే స్టేషనువద్ద ప్లాటుఫారంమీద నా భార్య తమ్ముళ్లు 7 గురిలో నలుగురు 11 సంవత్సరాలున్న సాంబశివరావు, 9 సంవత్సరాలున్న మల్హారావు, 7 సంవత్సరా

ఉన్న వెంకటేశ్వరరావు, 5 సంవత్సరాలున్న నరసింహ మూర్తులు ఆహ్వానించారు. నా భార్య వీళ్ళందరిలోకీ పెద్దది. వాళ్ళ అక్కవద్దకు తీసుకు వెళ్ళడానికి వచ్చా రనుకొన్నాను. నేను ఇంగ్లాండు 5 సంవత్సరాలముందు బయలుదేరేటప్పుడు చిన్నపిల్లలుగా వారింటివద్ద నాచుట్టూ చేరేవారు.

నా తమ్ముళ్లు 6 గురిలో సూర్యనారాయణమూర్తి, సత్యనారాయణమూర్తి యిద్దరు తప్ప మిగతా 4 గురు అంత చిన్నవాళ్ళే. అప్పటి వాళ్ళ చిన్నవయస్సులో నా వ్యాపకమేమిటో వాళ్ళకు తెలియదు. వాళ్ళు ఎదుగుతున్నకొద్దీ నాపై పాలకవర్గము ఆంక్షు, నిర్బంధము అవగాహన చేసుకోగలిగారు.

వీరు ఎదుగుతుండగా సుమారు 5 సంవత్సరాలు నేను రాజకీయ శిక్షను పొందడం వీరి చదువు సంధ్యలు పూర్తయ్యే వరకు 14 సంవత్సరాలు నేను దేశంలో పాలక వర్గంతో పడుతున్న రాజకీయ సంఘర్షణలో జైళ్లు, రహస్య జీవిత అనుభవాలు పొందడమూ, పదేపదే పోలీసులు మేమున్న ఇండ్లపైన దాడులు జరపడంకూడా చూడ గలిగారు, ఇదంతా నేను కోరుకొన్నదే అనుకొనేవారనుకొంటాను.

ఇక నా సంసారం ప్రారంభం కావాలి. నా భార్యకు 18 సంవత్సరాలు, నాకు 25 సంవత్సరాలు. మా దాంపత్య జీవితంలో పిల్లల పుట్టుక యిక త్వరగానే ప్రారంభమయింది.

నా కుటుంబం నాకు తప్పింది. సంసార అనుభవం ప్రపం చాన్ని అర్థం చేసుకోడానికి ఉపయుక్తమయిందనాలి. ఇక శ్రామికవర్గాన్ని నా కుటుంబంగా చేసుకొని దాని విముక్తికై కృషిచేయడానికి నిర్ణీతమయిన సిద్ధాంతాన్ని స్వీకరించడమూ అదృష్టమయింది. ఇంగ్లాండు వెళ్ళడం భారత ఫ్యూడలు వ్యవస్థనుండి బయటపడి, సామ్రాజ్యవాద దశలో మధ్య తరగతి వర్గాల అణకువ మనస్తత్వంనుండి విడుదలై నూతన సామాజిక నిర్మాణానికి కమ్యూనిజం స్వీకరించడానికి అవ కాశం కలిగింది. నేను జీవిస్తున్న సమాజంలో నాబోటి యువకులకు స్వేచ్ఛాధోరణివుంటే యిదె మార్గప్రయోజులు.

నా భార్య మాణిక్యాం స్కూలులో చదువు మాత్రమే కాని కాలేజీ ప్రవేశించలేదు. పూర్వకాలపు కొన్ని పౌరాణిక గ్రంథాల సారాంశము తప్ప ఆధునిక గ్రంథాలు చదవలేదు తన తమ్ములు తల్లి దగ్గరుండి వారి కుటుంబానికి ఒకతే ఆడపిల్లకనుక వారికి తోడుగా వుండడమూ, మాకు పెండ్లైనప్పటినుంచి తాను తప్పకుండా చదివేది నా ఉత్తరాలు మాత్రమే అనాలి. తన వ్రాత అంతా నాకు ఉత్తరాలు వ్రాయడం మాత్రమే. ప్రతి వారం ఇంగ్లాండునుండి నేను ఉత్తరాలు వ్రాసేవాడిని. వాట్లలో నా సిద్ధాంతాన్ని తెలిపేవాడిని కాని సంసార పక్షములో తెలిపేవాడిని. పెండ్లి అయిన 2 సంవత్సరాలకే దూరంగా వెళ్ళినమీదట, త్వరలోనే మనమూ కుటుంబమూ

పెడతాము కదా అని ఓదార్చేవాడిని. నా సిద్ధాంతాన్ని తనకు వారసత్వం చేసుకొన్నది కాని దాని లోతుపాతులు అవగాహన చేసుకొన్నదనుకోను.

పాలకవర్గాలు నన్ను నిర్బంధంలో పెట్టినప్పుడు జైళ్ళ నుండి, అజ్ఞాతవాసంలో పడ్డప్పుడు రహస్య కేంద్రాల నుండి జాబులు వ్రాసేవాడినికూడా. అప్పుడుకూడా నా భార్యకు ధైర్యం చెప్పేవాడిని. నా భార్యయెడల నిర్లక్ష్యంకాని కఠినవైఖరికాని అవలంభించలేదనే చెప్పాలి. మా దాంపత్యమూ అన్యోన్యంగానే కొనసాగింది.

ఇంగ్లాండులో వుండగానే ఇండియాలోని కాంగ్రెసు సోషలిస్టు పార్టీ (1934) నిర్మాణమయినతోడనే బొంబాయి లోని దాని "కాంగ్రెసు సోషలిస్టు" యింగ్లీషు వారపత్రికకు వ్యాసాలు వ్రాసేవాడిని. కమ్యూనిస్టు పార్టీ ఇండియాలో అప్పుడు బాల్యావస్థలో వున్నరోజులు. కమ్యూనిస్టు భావాలుకల వారు నిషేధంలో వున్న ఆ పార్టీసభ్యులు కాంగ్రెసు సోషలిస్టు పార్టీగా వ్యవహరించేవారు నెహ్రూ సన్నిహితుడు జయప్రకాశ్ నారాయణ సోషలిస్టు పార్టీ జనరల్ కార్యదర్శి.

కాకినాడలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రచారకులుగా డాక్టరు వీరయ్య, లేటు కంభంపాటి సత్యనారాయణ (సీనియరు) లేటు మహీధర జగన్మోహనరావులు నాకు పరిచిత మయినారు. వారితో రాజకీయ పరిస్థితులు చర్చించాను.

నేను కాకినాడచేరిన కొద్దినెలలకు 1938 ఫిబ్రవరికి అప్పటి సెంట్రల్ ప్రావిన్సులోని హరిపుర గ్రామంలో అఖిల భారత కాంగ్రెసు మహాసభ జరిగింది. ఆ మహాసభకు వెళ్ళి రాజకీయ వర్గాలను కలుసుకోవాలని పూనుకొన్నాను.

అఖిలభారత కాంగ్రెసు మహాసభను నేను మొదట చూచినది కాకినాడలో 1923 లోనే, నాకు అప్పుడు 11 సంవత్సరాల వయస్సు. అప్పుడు గాంధీజీ బ్రిటీషు పాల కులచే నిర్బంధంలో వున్నారు. తిరిగి నా 26 వ వయస్సులో హరిపుర కాంగ్రెసు మహాసభకు హాజరైనాను. ఇప్పుడు గాంధీజీ నాయకత్వంకింద కాంగ్రెసు రాజ్యాధికారంలోకి వచ్చింది. అన్ని రాజకీయ పార్టీల నాయకులను కలుసుకో డానికి అవకాశం కలుగుతుందని, నేను పరిస్థితులను అవ గాహన చేసుకోడానికి కాంగ్రెసు మహాసభకు హాజరు కావడం మంచి అవకాశమనుకొని హరిపుర వెళ్ళాను. ప్రయాణానికి నావద్ద వెంటనే డబ్బు లేకపోతే నా ఉంగరం అమ్మివేసి బయలుదేరాను.

1938 హరిపురా కాంగ్రెసుకు సుభాష్ చంద్రబోసు అధ్యక్షులు, ఆయనను నేను చూడడం ప్రథమం. మరో సంవత్సరానికి 1939 లో త్రిపురా కాంగ్రెసు మహాసభకు సుభాష్‌చంద్రబోసు కాంగ్రెసు అధ్యక్షపదవికి పోటీచేసి గెలిస్తే గాంధీజీ ఆయన వామపక్షం మూలంగా వ్యతిరేకించారు. అందుచే బోసు కాంగ్రెసు అధ్యక్షపదవికి రాజీనామాచేసారు.

1939 సెప్టెంబరులో ఆయనను కాకినాడ విద్యార్థి ఉద్యమ సభకు ఆహ్వానించాము. ఆయన మా యింట్లో నా అతిథి. సుభాష్ చంద్రబోసు నా అతిథిగా వున్న రోజుల్లోనే రెండవ ప్రపంచ యుద్ధం యూరపులో ప్రారంభమైంది. తదుపరి ఆయన రహస్య జీవితంలోకి వెళ్ళి జపానుతో కలసి బర్మానుండి భారత జాతీయ సైన్యాన్ని నిర్మించి దాని సేనానాయకుడై బ్రిటీషు పాలకులపై యుద్ధాన్ని ప్రకటించారు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయిన తర్వాత బ్రిటీషు పాలకులు నాపై యుద్ధ వ్యతిరేక ప్రచార నేరాన్ని మోపి అరెస్టుచేసి నవంబరు 1939 సం॥లో నన్ను జైళ్ళో నిర్బంధించారు ప్రపంచ యుద్ధం తీవ్రంగా సాగుతున్న కాలంలో సెప్టెంబరు 1941 లో నేను మరో నలుగురు రాజకీయ ఖైదీలము కలసి జైలుగోడకు కన్నంపెట్టి బయట పడి రహస్య జీవితం ప్రారంభించాము. వాట్ల వివరములు ముందు పేజీల్లో వస్తాయి.

ఆంధ్ర ప్రాంతంనుండి బయలుదేరిన కాంగ్రెసు సోషలిస్టు, కమ్యూనిస్టు రాజకీయవాదులను హరిపురలో కలుసుకొన్నాను. అఖిల భారత కాంగ్రెసులో యీ గ్రూపులన్నీ సభ్యత్వాలలోనే వున్నాయి. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ అఖిల భారత కాంగ్రెసులో ఒక భాగంగానే సాగించి.

హరిపురా కాంగ్రెసు మహాసభ కాలానికి జాతీయ కాంగ్రెసు బ్రిటీషు పాలనకింద బ్రిటీషు పాలకులు అమలు

చేస్తున్న రాజ్యాంగంలో పాలకవర్గ సంస్థగా ప్రథమంగా రూపొందంది. కాంగ్రెసు పుట్టినతర్వాత 7 రాష్ట్రాలలో పాలిస్తున్న పెద్దకాంగ్రెసు సంస్థగా హరిపుర సమావేశం ప్రథమం అనాలి. దాని నాయకులగు మహాత్మా గాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోసు, వల్లభాయి పటేల్, రాజేంద్ర ప్రసాద్, అబుల్‌కలామ్ ఆజాద్, రాజ గోపాలాచారి, పట్టాభి సీతారామయ్య, ప్రకాశం పంతులు మొదలగు జాతీయ కాంగ్రెసు నాయకులను ఒకచోట చూడడం జరిగింది. తదుపరి మరో 2 సంవత్సరాలకు (1940 ఆఖరు నెలల్లో) రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభ మయినతోడనే, రాష్ట్రంలోని కాంగ్రెసు మంత్రివర్గాలు అధికారంనుండి తొలగిన తర్వాత, నేను, రాష్ట్రంలోని ఆంధ్ర, తమిళ, కేరళ కాంగ్రెసు నాయకులగు పట్టాభి సీతారామయ్య, కళా వెంకట్రావు, అయ్యదేవర కాళేశ్వర రావు, కామరాజు నాడార్, మాధవ మీనన్ మొదలగు వారు కలసి వెల్లూరు జైలులో బ్రిటీషు పాలకులచే డిటెన్యూలుగా నిర్బంధితులు కాబడ్డాము. వివరాలు ముందు పేజీలో వస్తాయి.

హరిపురలో వివిధరాష్ట్రాలలోని కొందరి కాంగ్రెసు నాయకులతోను సోషలిస్టు నాయకులతోను చర్చించాను. సీనియర్ కంభంపాటి సత్యన్నారాయణ అప్పుడు రాజ మండ్రిలో నడుస్తున్న నవశక్తి పత్రికలో సబ్ ఎడిటరుగా

పనిచేస్తూ కాంగ్రెసు మహాసభకు ఆ పత్రికా ప్రతినిధిగా వచ్చారు. నేను అఖిల భారత కాంగ్రెసు మహాసభలో స్వేచ్ఛగా ప్రవేశించడానికి అన్ని విషయాలు తెలుసుకోడానికి పత్రికా ప్రతినిధిగా మద్రాసులోని జనవాణి దినపత్రికకు కాంగ్రెసు మహాసభ వ్యాసాలు వ్రాసి పంపుటకు దాని నుండి అనుమతి పత్రాన్ని పొందాను. ఆ పత్రిక నాకేమీ ఫీజు యివ్వనక్కర్లేదని నా వ్యాసాలుమాత్రం ఏమీ మినహా యింపులు లేకుండా అచ్చుకావాలని కోరాను. అందుకు ఆ పత్రిక సంపాదకులు అంగీకరించారు. 1938 లో హరిపుర కాంగ్రెసు మహాసభ పురస్కరించుకొని తెనుగులో సుమారు అరడజను వ్యాసాలు రాజకీయపరిస్థితి వివరిస్తూ మద్రాసు జనవాణి దినపత్రికలో అచ్చైనాయి. సుమారు అర్ధశతాబ్దం కావడం మూలంగాను, నేను చాల రాజకీయ ఒడుదుడుకు లలో పడుటవలనను అప్పటి నా వ్యాసాలు యిప్పటివరకు భద్రం కాలేదు. జాతీయ కాంగ్రెసు నాయకత్వం రాష్ట్రా లలో మంత్రివర్గాలను ఏర్పర్చినప్పటికీ, బ్రిటీషు పాలక వర్గంతో సంఘర్షణతో నేపున్నది.

హరిపుర కాంగ్రెసు సమావేశ (1938) కాలానికి జాతీయకాంగ్రెసు ఒక పార్టీగా కాక ఉద్యమంగావున్న ఆఖరి రోజులు. కాంగ్రెసులో మితవాదశక్తులు రాజీవాదులు ఎక్కువగా వున్నారు. అయినా అతివాద ఉద్యమాలకుచెందిన ట్రేడ్ యూనియను నాయకులు కర్షక ఉద్యమ నాయకులు,

కాంగ్రెసు సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెసు అతి వాదులు వున్నారు. ఇవన్నీ కాంగ్రెసులో సభ్యత్వం కలిగి అప్పటి అఖిల భారత కాంగ్రెసు కమిటీలో సభ్యులుగా కూడా వున్నారు. ఆయా ప్రాంతంలో ప్రజా సంస్థలలో పలుకుబడి మూలంగా వీరు కాంగ్రెసు కమిటీలకు ఎన్నిక కావడం, మితవాద కాంగ్రెసు నాయకులకు సామ్రాజ్య వాద అనుకూల శక్తులకు వ్యతిరేకులే అనాలి.

1938 నాటికి జాతీయ కాంగ్రెసు సంస్థకు, ముస్లిం లీగ్ పార్టీకి భేధాభిప్రాయా లున్నప్పటికి రెండు సంస్థల పలుకుబడి దేశంలో వున్నది. ముస్లిం ఓటర్లు మెజారిటీగా వున్న చోట్ల ముస్లిం లీగు విజయం సాధించింది. అస్సాం, సింధు రాష్ట్రాలలో కాంగ్రెసు ముస్లింలీగులు కలసి మిశ్రమ మంత్రివర్గాలను ఏర్పాటు చేసుకొన్నాయి. బ్రిటీషు సామ్రాజ్యవాదం కాంగ్రెసు, ముస్లింలీగులమధ్య విభేదాలు పెంచాలని పన్నాగాలున్నప్పటికీ, హరిపుర కాంగ్రెసు మహా సభ కాలానికి తీవ్రదశలో లేదనాలి.

ఇక జాతీయ కాంగ్రెసులోనే మితవాద పక్షము, వామ పక్షాల మధ్య సిద్ధాంత ఎత్తుగడల భేదాలున్నాయి. కార్మిక సంఘాలు, రైతు సంఘాలు అప్పటికి అభివృద్ధి ప్రారంభిస్తున్నప్పటికీ, సోషలిస్టు కార్యకర్తల నాయకత్వంలో వున్నాయి. బొల్షెవిస్టులో వున్న కమ్యూనిస్టు పార్టీని అంతకుముందే బ్రిటీషు పాలకులు నిషేధించినప్పటికి వా-

పునాదులు శ్రామిక వర్గంలోనే వున్నది. యిక జాతీయ కాంగ్రెసులోని వామపక్షవర్గము కార్మికుల రైతుల ఉద్యమాలతో సంబంధాలు కలిగివున్నారు. కాంగ్రెసు వామ పక్షం జాతీయ కాంగ్రెసులో సుమారు 40 శాతం కమిటీలో ప్రాతినిధ్యం వుండడమూ మూలంగానే వామపక్షానికి చెందన జాతీయ కాంగ్రెసు నాయకుడు సుభాష్ చంద్రబోసు అధ్యక్షునిగా ఎన్నిక కాగలిగాడు. బోసు బ్రిటీషు పాలకవర్గంతో రాజీలేని పోరాటాన్ని కోరాడు. ఇది పసి కట్టి కాంగ్రెసు మితవాదులు బోసు రెండవసారి త్రిపుర కాంగ్రెసుకు అధ్యక్షుడుగా రాకుండడానికి, పట్టాభి సీతా రామయ్యాచే పదవికి పోటీపెట్టించి, బోసు గెలవడంతో కార్య క్రమాన్ని స్తంభింపచేయుడానికి పూనుకోవడంతో సుభాష్ చంద్రబోసు అధ్యక్ష పదవికి రాజీనామాచేసి, వామపక్ష కాంగ్రెసువాదులతో పార్వర్డు బ్లాకును స్తాపించారు. బోసు బయటకు వెళ్ళడం మితవాద కాంగ్రెసు నాయకులకు స్వేచ్ఛను కలుగచేసింది. గాంధీజీ, నెహ్రూను బలపరుస్తూ జాతీయ కాంగ్రెసులోని సెంట్రిస్టు వర్గాన్ని మితవాద శక్తు లకు తోడుచేసారు. అప్పటికి రాష్ట్రాలలో వున్న అధికార కాంగ్రెసు అవకాశవాద శక్తులను బలపర్చుకోడానికి వారి పురకాలానికి ఒక సదవకాశంగానే వున్నది.

వామపక్ష శక్తులకు సిద్ధాంత పరిజ్ఞానానికి యీ కాలము మంచి సదవకాశం కూడాను. ఆంధ్రలోని కొందరు

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యకర్తలను షారిపురలో కలుసుకొన్నాను. మీరట్ కేసు తరువాత భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ నిషేధించడము మూలంగా కమ్యూనిస్టు భావాలు కలిగిన వ్యక్తులు ఆంధ్రలోను యితరచోట్ల కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో చేరారు. మార్క్సిస్టు-లెనినిస్టు పరిజ్ఞానానికి అప్పటికి భారతదేశంలో కావలసిన గ్రంథాలు లేవు. అదీకాక అందుబాటైన గ్రంథాలు కొన్ని తర్జుమాలు చేసుకొన్నారు. ఆ తర్జుమాలకు కూడా తగిన శాస్త్రీయ స్థాయిలేదు.

వామపక్ష కాంగ్రెసు కార్యకర్త తరువాత సోషలిస్టు అయిన అన్నాప్రగడ కామేశ్వరరావు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఆధ్వర్యంకింద గుంటూరు జిల్లా మంతెనవారిపాలెం గ్రామంలో ఆర్థిక రాజకీయ వేసవి పాఠశాల హారిపుర కాంగ్రెసు అయినతోడనే ఏర్పాటు చేయుటకు ప్రూను కొన్నాడు. నేను బ్రిటనులో వుండగానే బ్రిటీషు కమ్యూనిస్టు పార్టీ నాయకులు హారీపాలిట్, పామీదత్తు, బెన్ బ్రాడ్లేలనుండి భారతదేశంలో కమ్యూనిస్టు సెల్లులు అక్కడక్కడ వున్నాయని తెలుసుకొన్నాను. హారిపురలో కొందరు కమ్యూనిస్టులను కలుసుకొన్నాను. అన్నాప్రగడ కామేశ్వరరావుతో ఆంధ్రలోని యువకులకు సిద్ధాంత పరిజ్ఞాన ఆవశ్యకతకై చర్చించినమీదట, మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలలో మార్క్సిస్టు సిద్ధాంతానికి సంబం

ధించిన రాజకీయ శాస్త్రాన్ని నెలరోజుల స్కూలులో 1938 వేసవి నెలలో ప్రబోధిస్తానని చెప్పాను దానికి అతను సంతోషించాడు. మంతెనవారిపాలెంలో ఇంగ్లీషువచ్చిన యువకులకు ఇంగ్లీషులోను, మిగతా వారికి తెలుగులోను బోధించడానికి ఏర్పాటు చేస్తున్నామన్నాడు. ఇంగ్లీషు వచ్చినవారికి నేను మార్క్సిస్టు తత్వ శాస్త్రాన్ని, ఆర్థిక శాస్త్రాన్ని బోధించుటకు అంగీకరించాను. హరిపుర కాంగ్రెసు అయినతర్వాత మరో మూడు నెలలకు మంతెనవారిపాలెం ఆంధ్ర యువకులకు రాజకీయ ప్రబోధానికి బయలుదేరాలి.

లండను నుంచి వచ్చినతోడనే నాలుగు నెలలకు తర్వాత కాకినాడనుండి హరిపుర కాంగ్రెసుకు వెళ్ళడం అక్కడ సుమారు వారంరోజులు తర్వాత తిరిగి నాలుగు నెలలకు మంతెనవారిపాలెం స్కూలులో రాజకీయ పాఠాలు తెలుగు యువకులకు ప్రబోధించడానికి మరో నెలరోజులు మంతెనవారిపాలెంలో మకాం పెట్టడం నాకు తీరుబడి లేకుండానే పని కలిగింది.

నా రాజకీయ సిద్ధాంతంగురించి నా భార్య మాణిక్యాంబతో చర్చించాను. ఈదేశంపై బ్రిటీషు పాలకులు పెత్తనం చేయడానికి నైతిక హక్కు లేదని యీ విశాల భారత దేశ ప్రజల స్వాతంత్ర్య సముపార్జనకై పోరాడాలని తదుపరి ప్రజలు సామ్యవాదంవైపు పురోగమించాలని వివరించాను. మార్క్సుయొక్క జీవిత చరిత్ర ఇంగ్లీషులోనిది తెలుగులో

తర్జుమా చేసి వివరించాను. నా సిద్ధాంతముయొక్క లోతు పాతు ఎంతవరకు అర్థం చేసుకొన్నదో నేను పరీక్షించలేదు కాని, నాతో రాజకీయ జీవితంలోని కష్టాలు పంచుకోవడంతో బాగానే అర్థం చేసుకొన్నదని వివరించక తప్పదు. ప్రజానీకానికి మంచిరోజులు వస్తే మాకు మంచిరోజులు అని మాత్రం మేము అంగీకరించుకొన్నాము.

నేను లండనునుండి స్టీమరు ఎక్కేటముందు 1937 లో ఆంధ్రలో కొత్తపట్నంలో ఒక రాజకీయ పాఠశాల ఎన్నికల గెలుపు వుత్సాహంలో అతివాద కాంగ్రెసు వాదులు, కాంగ్రెసు సోషలిస్టులు ఏర్పాటు చేశారని విన్నాను. కాని అప్పుడు అధికారంలో వున్న తాత్కాలిక జస్టిస్ పార్టీ (బ్రిటీషు అనుచరపార్టీ) ప్రభుత్వం ఆ రాజకీయ స్కూలు పూర్తి కాకుండా నిషేధించింది. బ్రిటీషు రాజ్యాంగ సంస్కరణలకింద కాంగ్రెసు, ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఎన్నికల్లో మెజారిటీ పొందినప్పటికి, మంత్రివర్గాలు స్వీకరించడానికి హామీలు కోరినమీదట బ్రిటీషు గవర్నరు అప్పటి కాంగ్రెసు ప్రతిపక్షపార్టీ జస్టిసుపార్టీని యితరులతో కలపి మంత్రివర్గాన్ని నియమించుకొన్నాడు. ఈ దశ సందర్భ దశ. అతివాద కాంగ్రెసు కార్యకర్తలు, కాంగ్రెసు సోషలిస్టు యువకులు కొత్తపట్నాంలో వేసవి రాజకీయ స్కూలు ద్వారా ప్రథమ రాజకీయ పఠన కార్యక్రమానికి సిద్ధపడ్డారు.

ఇక నేను మద్రాసు చేరేటప్పటికి కాంగ్రెసు మంత్రి వర్గం అధికారంలోకి వచ్చింది. హరిపుర కాంగ్రెసుతర్వాత మంతెనవారిపాలెం స్కూలు నిర్వహణకు కాంగ్రెసుప్రభుత్వం ఆటంకం పెట్టలేదు అనాలి కాని అధికారంలో వుండబట్టి నిఘా మాత్రం వేసింది. అది రాజాజీ ప్రభుత్వం.

మంతెనవారిపాలెం స్కూలులో 1938 లో రాజకీయ సిద్ధాంత పాఠాలు తెలుగు యువకులకు నేను నేర్పడం, లండనులో 1936 లో నేను నిర్వహించిన సోషలిస్టు స్టడీ సర్కిలుతర్వాత యిది రెండవ రాజకీయ పాఠశాల. లండనులో నేను నిర్వహించిన స్టడీ సర్కిల్ స్థాయి హెచ్చుఅనాలి లండనులో విద్యార్థులు పొంది అంతకుముందే శాస్త్రీయ కమ్యూనిజం గురించి ప్రాశ్చాత్య యువకులకు ఒక పఠన కేంద్రం అది. భారతీయ వామపక్ష భావాలుగల విద్యార్థులతో పరిచయం పెట్టుకొంటున్న బ్రిటీషు కమ్యూనిస్టు నాయకుడు బెన్ బ్రాడ్లే ఆ స్టడీ సర్కిలుకు పరిచయు మయ్యాడు.

ఆంధ్రలోని మంతెనవారిపాలెం రాజకీయ స్కూలు విద్యార్థులు, యువకులు రాజకీయాలయెడల కుతూహలం గలవారు వచ్చారు. కాంగ్రెసు అధికారంలోకి వచ్చిన మీదట మీరట కేసునుండి విడుదలచేయబడ్డ కమ్యూనిస్టు నాయకులుకూడా భారతదేశంలోని యీ ప్రథమ స్కూలుకు మంతెనవారిపాలెం వచ్చారు, నేను నడిపిన యింగ్లీషు

క్లాసులకు హాజరైన యువకులకు ఎక్కువ స్థాయి స్కూలు ఫైనలు యింగ్లీషు స్టాండర్డు గలవారు. కొద్దిమందికి యింటర్ మీడియేటు స్థాయి వుంటుంది అయితే ఆక్టివ్ రాజకీయాల్లో యువకులుగా పాల్గొన్నవారున్నారు. అందరూ మధ్యతరగతి యువకులు నాకంటే వయస్సులో మూడు నాలుగు సంవత్సరాలనుండి 10 సంవత్సరాలలోపు వయస్సువరకు వున్నవారుంటారు, దరిమిలాను నా జ్ఞాపకం నుండి మిత్రులనుండి సేకరించిన ఆ స్కూలు వివరాలు మాత్రమే యివ్వగలుగుతున్నారు. ఎవరైనా వివరాలు వుంచారో లేదో తెలియదు కాని ఆ స్కూలులో నా విద్యార్థి తదుపరి స్వాతంత్ర్య సమరయోధుడు, పత్రికా సంపాదకుడు గోవాడ నిరీక్షణరావు యిచ్చిన వివరాలనుబట్టి ఆ వేసవి రాజకీయ పాఠశాలలో నా విద్యార్థులు, మాదల నారాయణస్వామి, పిడతల రంగారెడ్డి, ఎల్. బుల్లయ్య, డాక్టరు కృష్ణమూర్తి, రామకోటయ్య, మాధవ చారి మొదలగువారు. ఇంకా ఆ స్కూలులో చేరినవారి పేర్లన్నీ నావద్ద యిప్పుడు లేవు. కాని కొందరి నావిద్యార్థుల తదుపరి ప్రత్యేకతను యిక్కడ వివరిస్తాను. మాదల నారాయణస్వామి పార్లమెంటు సభ్యుడుగా మార్క్సిస్టు లెనినిస్టు నాయకుడుగా గుర్తింపు పొందాడు. పిడతల రంగారెడ్డి నాతోపాటు మద్రాసు రాష్ట్ర అసెంబ్లీ (1952) లో సభ్యుడయ్యాడు కాని మంతెనవారిపాలెంలో నా క్లాసులో తాను

విద్యార్థి అని అప్పుడు చెప్పలేదు. 1972 లో నేను హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యుడుగా వున్నప్పుడు తానుకూడా శాసన సభ్యుడై నమీదట అసెంబ్లీ స్పీకరు అభ్యర్థిగా తయారవుతున్న రోజుల్లో తాను నా మంచెనవారిపాలెం స్కూలులో విద్యార్థి అని చెబితే యీ విషయం యింతకాలము ఎందుకు దాచారు అని అడిగాను. తాను స్పీకరైతే గురువుపైన శాసన సభలో పెత్తనదారి అవుతాడని వుద్దేశ్యం. రంగారెడ్డి స్పీకరు అయ్యాడు తనుపరి కాంగ్రెసు ఆర్థికమంత్రి అయ్యాడు. శాసన సభలో నాతో తగవు పెట్టుకొన్నాడు. ఇక ఎల్. బుల్లియ్యా ఉద్యోగంలో ప్రవేశించి నేను ఆంధ్రప్రదేశ్‌లో శాసన సభ్యుడుగా వున్నప్పుడు విద్యాశాఖ డైరక్టరు అయ్యాడు తదుపరి ఆంధ్ర యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ అయి ప్రస్తుతం రిటైరయ్యాడు. అప్పటి నా రాజకీయ విద్యార్థుల గురించి కొంతమచ్చుకు మాత్రం దొరికాయి అనాలి.

నాతోపాటు యింగ్లీషు క్లాసులను నడిపిన రాజకీయ ఉపాధ్యాయులు లేటు పులుపుల శివయ్య, లేటు కంభంపాటి జానియరు జ్ఞాపకం. ఇక తెలుగు క్లాసులకు ఉపాధ్యాయులు లేటు చండ్రం, లేటు కంభంపాటి సత్యనారాయణ మొదలగు వారున్నారు. తెలుగు క్లాసులకు సహజంగా ఎక్కువమంది రాజకీయ విద్యార్థులున్నారు. ఈ రోజువారీ క్లాసుల నిర్వహణకాకుండా మంచెనవారిపాలెం గ్రామంలో నే

రాజకీయ బహిరంగ సభలుకూడా ఏర్పాటైనాయి. ఆ సభలలో రాజకీయ స్థితిగతులపై ముఖ్యులచే ఉపన్యాసాలే కాకుండా, శాస్త్రీయ వైజ్ఞానిక విషయాలపైన ఉపన్యాసాలు యివ్వబడ్డాయి. అందులో నేను ఒక సమావేశంలో తెలుగులో మానవుని పుట్టుక గురించి జీవరాశులలో మానవుని అభివృద్ధి గురించి ఒక సాయంత్రం ఉపన్యాసం యిచ్చాను. శాస్త్రరీత్యా ఆదిమ మానవుని పుట్టుకకు సంబంధించి డార్విన్, కార్లు మార్క్సు సిద్ధాంతాలను ఆధారం చేసుకొని యిచ్చాను వివిధ ప్రాంతాల నుండి వచ్చిన ఆంధ్రులకు మంతెనవారిపాలెం గ్రామస్తులకు ఆ ఉపన్యాసం ఉద్దేశింపబడింది.

మంతెనవారిపాలెం స్కూలు సాగుతున్న రోజుల్లో అక్కడి కార్యక్రమానికి భారత కమ్యూనిస్టు నాయకులు ఎస్ ఎ డాంగే, అధికారి, మిరాజ్‌కర్, ఘాటే, పి. సి. జోషీలు, బుకార్హీ, బి. టి. రణదేవ్, మొదలగువారు బొంబాయినుండి ఆహ్వానింపబడ్డారు. వారిని కలుసుకొని వారితో మాట్లాడాను. అయితే వారు మీరట్ కేసు శిక్షలనుండి కాంగ్రెసు ప్రభుత్వం వచ్చినతోడనే శిక్షాకాలము రద్దు చేయబడి విడుదలై వున్నారు. నాకంటే వయస్సులో పెద్దవారు. వీరిని చూడడానికి చుట్టుప్రక్కల గ్రామ ప్రజలకు పరిచయం చేయబడ్డారు. బహిరంగ సభలు కొన్ని ఏర్పాటు చేయబడ్డాయి. దాంట్లో ఉపన్యసించారు. బ్రిటీషు

పాలకులు 1934 లో బొల్ష్వి దశవులోన్న కమ్యూనిస్టు పార్టీని మీరట్ కేసు బ్రిటీషు ప్రభుత్వం తర్వాత నిషేధించింది. జాతీయ కాంగ్రెసు ఆధిపత్యంలోకి వచ్చిన రాష్ట్రాల్లో నిషేధాన్ని 1938 లోనే తొలగించమని ఆందోళన సాగించబడింది. కాని నిషేధాన్ని యింకా నాలుగు సంవత్సరాలు 1942 వరకు సాగింది. రెండవ ప్రపంచయుద్ధం బయులుదేరి హిట్లరు ఫాసిజం, బ్రిటీషు సామ్రాజ్యవాద మారణయుద్ధకాండలో యిరుక్కొని, సోవియట్ రష్యాపై హిట్లరు యుద్ధాన్ని ప్రకటించడముతో, భారతదేశంలో యుద్ధ కార్యకలాపాలకు కమ్యూనిస్టుల సహాకారము బ్రిటీషు పాలకులకు లభించడంతో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగింపబడ్డది ఈ ఘటనలు ముందుముందు వివరిస్తాను.

మంతెనవారిపాలెం స్కూలుకు హాజరై అక్కడి కార్యక్రమంలో పాల్గొన్న ఆంధ్రలోని అప్పటి కమ్యూనిస్టు యువకులు (కాంగ్రెసు సోషలిస్టులుగా వ్యవహారింపబడేవారు) యింతకుముందు వివరించిన వారుకాక పుచ్చలపల్లి సుందరయ్య, మద్దూరి అన్నపూర్ణయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, గరపాటి సత్యనారాయణ, దుర్భా కృష్ణమూర్తి, అల్లూరి సత్యనారాయణ, మహీధర జగన్మోహనరావు, బసవారెడ్డి శంకరయ్య, కొరపాటి పట్టాభిరామయ్య, తుమ్మల వెంకట్రామయ్య, చండ్రసాని వాసుదేవరావు, చండ్ర రాజేశ్వరరావు మొదలగువారు. మంతెనవారిపాలెంలో

ప్రథమంగా సహచరులమైనాము, యిందులో కొందరు యిది ప్రాసేకాలానికి (1986) లో దివంగతులైనారు. ఆంధ్రగడ్డపై శ్రామిక వర్గాన్ని సమైక్యపర్చడానికి కమ్యూనిస్టు సిద్ధాంత ప్రచారానికి మేము సహచరులమైనాము పాలకుల చేతుల్లో నిర్బంధాలకు గురైనాము. శ్రామిక, కర్షక, ప్రజా హక్కుల రక్షణకై ఉద్యమాలలో పాల్గొన్నాము. మాతవ తరమూ బయలుదేరింది. భారతదేశం, ప్రపంచమూ యింకా మారవలసిన గడువు వున్నది. ప్రపంచములో ఎక్కువ భాగంలో సామ్రాజ్యవాదమూ యీ అర్ధశతాబ్దంలో శిథిలమైనప్పటికి పెట్టుబడిదారీ వ్యవస్థ వలన విధానపు అవశేషాలు యింకా సాగుతూనే వున్నాయి. మంతెనవారి పాలెం స్కూలు తదుపరి అర్ధశతాబ్దపు చరిత్ర పాఠాలు యింకా బోధించడానికి నాకు కావలసిన శక్తిసామర్థ్యాలు వున్నాయనే భావిస్తున్నాను. అయితే నా జీవితం వృథా కాలేదని గర్విస్తే తప్పుకాదని భావిస్తున్నా.

గుంటూరులో మంతెనవారిపాలెం రాజకీయస్కూలుకు హాజరైన తూర్పు గోదావరి జిల్లాకు చెందిన కొరసా పట్టాభిరామయ్యా నన్ను ప్రథమంగా మంతెనవారిపాలెంలో 1938 లో కలుసుకోడం జరిగింది. రాజమండ్రిలో కూడా ఆర్థిక రాజకీయ పాఠశాల జిల్లా కార్యకర్తల తర్ఫీదుకు నిర్వహించడము గురించి చర్చించుకొన్నాము. అందుకు కార్యక్రమం వేసాము. 1939 ఆరంభములో ఆ స్కూలుకు కార్యకర్తలను

సమ్మర్‌స్కూల్ రాజమండ్రిలో ఒక నెల నిర్వహించాము ఆ నెలరోజులలో ఆర్థికశాస్త్రము, తత్వశాస్త్రము, చరిత్ర, భౌతిక, జీవ శాస్త్రాలు నా ఆధ్వర్యంలోనే తెలుగులో నిర్వహింపబడ్డాయి. విద్యార్థులకు వసతి భోజన సదుపాయాలన్నీ కొరవాటి మిగతా కార్యకర్తలు, చందాలు వసూలు చేసి ఒక ఖాళీగావున్న దానవాయిపేటలోని గృహము సేకరించి రాజకీయ పాఠశాలకు ఏర్పాటు చేసారు. ప్రతిరోజు పాఠాలు చర్చలు జరిగిన తర్వాత, సాయంత్రం రాజమండ్రి శ్రద్ధానంద పార్కులో బహిరంగసభలు ఏర్పాటుచేసాము

కార్యకర్తలకు రాజకీయ పరిజ్ఞానాన్ని కలుగచేయుడంలో అనుభవం నాకు ఎంతగానో వుపయోగపడింది. ప్రపంచమును గురించి తెలుసుకొన్నంత మాత్రమున సరిపోదు. దానిని మార్చాలి. పరిజ్ఞానము పొందినంతమాత్రాన్ని సరిపోదు, అది ఆచరణలోకి రావాలి. నూతన సామాజిక నిర్మాణానికి శ్రామికవర్గంపైన విప్లవ నిర్వహణా బాధ్యత వున్నదని శ్రామికవర్గ నాయకుడు మార్క్స్ నిర్వచించిన యీ మూలమంత్రాన్ని నా విద్యార్థులకు నొక్కి చెప్పాను. మానవచరిత్ర నిర్మాణము ఏదో ఉన్నతవర్గము వ్యక్తుల యొక్క ఊహాలనుండి, గొప్పలనుండి ఉద్భవించిందికాదు. మనుష్యులు తమ అవసరాలు తీర్చుకోడానికి సరుకులు ఉత్పత్తి చేసుకోడములో ఉత్పత్తి విధానము అభివృద్ధి కావడము, ఒక ఉత్పత్తివిధానము మారి యింకొకటి ఉద్భ

వించేటప్పటికి వైరుధ్యము బయలుదేరడము వర్గ సంఘర్షణ తప్పదు. ఫ్యూడలు వ్యవస్థలోని సంఘర్షణ మూలంగా పెట్టుబడిదారీ వ్యవస్థ బయలుదేరడము, పెట్టుబడిదారీ వ్యవస్థలోని సంఘర్షణ కమ్యూనిస్టు వ్యవస్థకు దారి తీస్తుందని మార్క్సు యొక్క అర్థిక రాజకీయ పరిశోధన రుజువు చేస్తుంది. మనం జీవిస్తున్న సమాజంలోని పెట్టుబడిదారీ వ్యవస్థ శిథిలంకాక తప్పదని, దాని స్థానంలో కమ్యూనిస్టు వ్యవస్థ తప్పదని మార్క్సు ప్రబోధన ఐదు దశాబ్దాలక్రితం నావిద్యార్థులకుచేసిన బోధ యింకా సాగుతూంది. ఉత్పత్తి విధానం వ్యక్తుల స్వప్రయోజానికి కాకుండా సాంఘిక అభ్యున్నతికి వినియోగానికే వర్గవైరుధ్యం పోరాటం సాగుతూంది. మార్క్సు గురించే వైరుధ్యం. మార్క్సు లేకపోతే నిస్తబ్దత క్షీణదశ అవుతూంది. సామాజిక అభ్యున్నతి ఆశించే చైతన్యవంతుడు యీ సూత్రాన్ని గుర్తించాలని నా పాఠాల్లో కార్యకర్తలకు బోధించాను.

రాజకీయ పరిజ్ఞానంయెడల కుతూహలం కలిగి, ప్రజల మధ్య పనిచేయు ఆసక్తిపొంది దేశస్వాతంత్ర్య సమరానికై కమ్యూనిస్టు సిద్ధాంత ఆచరణకై ముందుకువచ్చిన కొందరి కార్యకర్తలకు 30 దశకంలో మార్క్సిస్టు పరిజ్ఞానాన్ని కలుగచేయుడానికి ఉద్యుక్తుడను కావడం బ్రిటీషు కాంగ్రెసు పాలకులు నన్ను జైలు నిర్బంధంలో పెట్టినప్పుడు కూడా యీ కార్యక్రమం కొనసాగించాను. 40 దశకంలో కూడా

రాజకీయ పరిజ్ఞానాన్ని బోధించే అవకాశము సహచర రాజకీయ నిర్బంధితులకు, రాజమండ్రి, వెల్లూరు, ఆలి పూరు, బళ్ళారి, కడలూరు జైళ్ళలో కూడా కొనసాగింది. 50 దశకంలో కూడా కొంత కాలము సాగింది. 60 దశకంలో కొద్ది సహచరులతో విశాఖపట్నం జైలులో జరిగింది. ఇదికాక అజ్ఞాతవాసంలో వున్న దశలో 50 వ దశకంలో కూడా రాజకీయ పాఠాలు బోధించడం సాగింది. అయితే అజ్ఞాతవాసకాలంలో పరిమితమయిన వర్కర్లకు మాత్రం జరిగిందని చెప్పాలి. అజ్ఞాతకాల దశలో అందరినీ చేర్చ డానికి వీలులేదు, నమ్మకమయి దీక్ష కలిగినవారిని మాత్రమే ఎంపికచేసి బోధన చేయడం జరిగింది.

అయితే నాఅనుభవంలో ఆంధ్రలోని కార్యకర్తలకు వారి ముఖ్యులకు మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానంయెడల లోటు తక్కువ. సిద్ధాంతం ఆచరణ పడికట్టురాళ్లుగానే చూచారు కాని అవి హృదయంలో నాటుకోవాలని, కమ్యూనిస్టు తన జీవితంలో పరిపక్వతకై అభివృద్ధికావాలనే నమ్రత కూడా తక్కువ. కార్లు మార్క్సు సహితం ఒక సారి చెబుతూ తానే పూర్తిగా "మార్క్సిస్టు" కాలేదని చెప్పిన మహత్తర తాత్విక ప్రవచనలు కొందరు కమ్యూ నిస్టులకు అర్థం కాలేదు. మధ్యతరగతి గ్రామీణ యువ కులనుండి వచ్చిన కార్యకర్తలు మూలంగా, సామాజిక వ్యవస్త వెనుకబడిన వ్యవసాయక విధానమూ ప్యూడలు

తత్వాలు కలిగి వుండటవలన ఆంధ్రలోని కమ్యూనిస్టులకు అవరోధాలున్నాయి. ఆ పాత తరం యిప్పుడు అయిపోయింది, లేక వృద్ధాప్యంలో పడిపోయింది. అయితే సామాజిక మార్పు ఆగేదికాదు. భారతదేశం ఒక విప్లవ దశ దాటింది. జాతీయ విమోచనా విప్లవం జరిగింది యిక సోషలిస్టు విప్లవంవైపు సామాజిక వ్యవస్థ పురోగమించాలి. ఇది కొద్దిమందిపైన ఆధారపడ్డది కాదు, బహుళ శ్రామిక శక్తిపైన ఆధారపడ్డది.

కమ్యూనిస్టు సిద్ధాంత పరిజ్ఞానంతో పాటు శ్రామిక వర్గాన్ని సమీకరించే శక్తి కలగాలి. కమ్యూనిస్టుల కదలిక లేకపోతే మార్పు అసంభవం. వర్గభూయిష్టమయిన సామాజిక వ్యవస్థలో వర్గ వైరుధ్యతనుండి చైతన్యం సాంఘిక పరిణామానికి మూలం అవాలి. నా రాజకీయ విద్యార్థులకు పారిశ్రామిక, పట్టణ, గ్రామీణ కార్మికుల ఉద్యమ నిర్మాణాన్ని సాగించాలని బోధించాను. 1939 లో ప్రథమ భాగంలో రెండవ యుద్ధం మూలను భారతదేశంలో కార్మిక వర్గ సమ్మె పోరాటాలు ఎక్కువగానే సాగాయి. ఒకమూల జాతీయ ఉద్యమం నిర్బంధం నుండి బయటపడి రాజ్యాంగ సంస్కరణలో పాల్గొనడం, వేరొకమూల సామాన్య ప్రజల కష్టించే వర్గంయొక్క ఆర్థిక జీవనం అధ్వాన్నం కావడం కార్మిక ఉద్యమ నిర్మాణానికి కార్మిక హక్కులకై పోరాటాలకు ప్రోద్బలం కలిగించడ అవాలి.

రాజమండ్రి మ్యూలు సమాప్తం రోజున శ్రామికుల సమ్మె పోరాటం గురించి ఒక నాటికను విద్యార్థులచే ప్రదర్శింపచేసాము. ఆ నాటిక యింగ్లీషులోనిది దానిపేరు (Waiting for Lefty) "వామపక్షీయుని రాక" ఇంగ్లాండు నుండి బయలుదేరేముందు లండనులో అచ్చైన యీ యింగ్లీషు నాటిక అచ్చు పుస్తకం నాతో యితర పుస్తకాలతో తీసుకు వచ్చాను. దాని కథాసారాంశము శ్రామికుల సమ్మె పోరాటాన్ని విజయవంతం చేయడానికి వామపక్ష రాజకీయ చైతన్యం కలిగిన నాయకత్వం అవసరం లేకపోతే ఆ పోరాటం నీరసపడి పోతుంది. పెట్టుబడిదారీ వర్గానికి కార్మికులు దాసులు చేయబడతారు.

సమ్మె ఎత్తుగడ పోరాటం, నాయకత్వం దాని రాజకీయ పాఠం ఆ చిన్న నాటికలోని గుణపాఠం. ఆంధ్రలోని యువక కమ్యూనిస్టుల కుపయోగించిన పాఠ మనాలి.

1937 లోనే కాకినాడలో స్థానిక సోషలిస్టు కమ్యూనిస్టు కార్యకర్తలకు చరిత్ర, సామ్యవాద సిద్ధాంత ప్రబోధంతో పాటు కార్మికుల మధ్యకు వెళ్ళి వాళ్ళ జీవితవిషయాలు తెలుసుకోడానికి వారి సమస్యల గురించి పనిచేయడం, నేర్పడం మొదలుపెట్టాను. ప్రతిరోజు సాయంత్రం ఒక గంట చైతన్యవంతులైన మధ్యతరగతి యువకులకు, ఒకొక్కసారి స్త్రీలకు రాజకీయ పాఠాలు ప్రబోధించాను. అయితే తరువాత ఏదైన కాలంలో పట్టణంలోని పేదప్రజల

కార్మికులమధ్యకు వెళ్ళి వారి జీవిత పరిస్థితులు తెలుసుకొని తాము తెలుసుకొన్న అంశాలు ఒకచిన్న జేబుపుస్తకంలో డైరీగా వ్రాయుడం నేర్పాను. సాయంత్రం గంట రాజకీయ పాఠాల బోధన చర్చలతో పాటు ప్రజల స్థితిగతులు చర్చించేవారము. నా కార్యమేధస్సుకు యీ ప్రయోగం అనుభవాన్ని కలుగ చేసింది.

ఈ పాఠాలు నేర్పడం ఒక్కొక్కసారి స్థానిక సోషలిస్టు నాయకుడు బహు నమ్రత కలిగినవ్యక్తి డాక్టరు M. వీరయ్య నివాసమున్న గాంధీనగరంలో సమావేశమయ్యేవారము. డాక్టరు వీరయ్య తన వైద్యవృత్తికి, నివాసానికి కాకినాడ గాంధీనగరంలో ఒక చిన్న బంగాళాను అద్దెకు తీసుకొని తన వైద్యవృత్తిని సాగిస్తూ ఎక్కువభాగం సోషలిస్టు సిద్ధాంత ప్రచారానికి పూనుకొన్న వ్యక్తి. ఆయన అసలు పర్లాకిమిడి నివాసి. అక్కడే యువకదశలో జాతీయ కాంగ్రెసు ఉద్యమంలో కృషి సాగించి దేశభక్తి కలిగి దేశ స్వాతంత్ర్య దీక్షకలిగిన వ్యక్తి. తదుపరి తాను కాంగ్రెసు సోషలిస్టుగాను, కమ్యూనిస్టుగాను ప్రజల్లో ప్రచారం పూనుకొన్నారు. తన ఏకైక కూతురును కాకినాడలో పెండ్లిచేసి కాకినాడలో స్థిరపడి రాజకీయ కార్యకలాపాలకు పూనుకొన్నాడు. 1937 లో నేను కాకినాడ వచ్చినతోడనే నాకు రాజకీయ మిత్రుడై, స్థానిక రాజకీయ వ్యక్తులకు పాఠాలు నేర్పడం శ్రామికులమధ్య పనిచేయడంలో

నాతో సహకరిస్తు, 1938–39 లో రాజమండ్రిలో నేను నిర్వహించిన రాజకీయ పాఠశాలలో విద్యార్థిగాను, స్కూలు నిర్వహణకు సహాయకుడుగాను పనిచేసాడు. ఆయన కుమార్తెను, చిన్న మనుమరాలును కూడా పేదప్రజల మధ్య పనిచేయడానికి ప్రోత్సహించాడు. తాను తన కుమార్తె జగదాంబ, యుద్ధకాలం 1939–40 లో బ్రిటీషు పాలకుల చేతుల్లో జైళ్ళలో నిర్బంధితులైనారు. తరువాత కాంగ్రెసు పాలనలో 1948–50 వరకు అజ్ఞాతవాసంలో ఒరిస్సా ప్రాంతంలో రాయఘడ, గోపాలపురంలో పోలీసుల చేతుల్లో పడకుండా సహచర రాజకీయ కార్యకర్తలకు తన వైద్యవృత్తిద్వారా ఆర్జనచేసి ఆర్థిక సహాయం చేసారు, కాని 1951 లో గోపాలపురంలో (ఒరిస్సా) అనారోగులై అజ్ఞాతవాసంలో వుండగానే ఉవంగతులైనారు.

డాక్టరు వీరయ్య నిస్వార్థ శ్రామికవర్గ మిత్రుడు, కమ్యూనిస్టు, బహు నమ్రతకలిగి, త్యాగశీలుడై నిరంతర ప్రజాసేవలో నిమగ్నమైనాడు డాక్టరు వీరయ్యవంటి వ్యక్తులు అరుదుగా వుండేవారు. ఆయన నాకంటే పది సంవత్సరాలు పెద్దవాడు. వీరయ్య ప్రజలమధ్య పనిచేయడంలో విశ్రాంతి కోరని, నిష్కల్మషమైన వ్యక్తి. చిక్కైన రాజకీయ సమస్యలు తెలుసుకోడంలో బహుశ్రద్ధ ఓర్మి చూపేవాడు, బహు విశ్వాసంతో ఆ సూత్రాలను అమలు చేసేవాడు, కాంగ్రెసు పాలకుల ప్రథమ ఆధిపత్యపు (1937–38)

రోజుల్లో, శ్రామిక సమ్మెపోరాట నిర్వహణలో (1938_39) జైలు నిర్బంధపు రోజుల్లో (1939_40) రహస్య జీవిత కాలంలో (1948_50) నాకు బహు సన్నిహితమయిన రాజకీయ మిత్రుడుగా వున్నాడు.

డాక్టరు వీరయ్యవంటి కార్యకర్తలు జీవించిన 1937_51 కాలము భారత శ్రామిక ఉద్యమచరిత్రలో కమ్యూనిస్టులు త్యాగదీక్షతో కృషిచేసిన కాలమూ, అయితే ఆ కాలంలో కమ్యూనిస్టు ఉద్యమంలో అవకాశవాద పోకళ్లు అరాచక ధోరణి బయలుదేరినప్పటికి ఆ పోకళ్లు నేటికాలంలోవలె కరుడుగట్టలేదు. సిద్ధాంత పరిపక్వత లేకపోయినప్పటికి వీరయ్య వంటి కార్యకర్తలు నిజాయితీ, నిష్కల్మషంకలిగి శ్రామికవర్గ నిర్మాణంలో సేవచేస్తూ ఒక మెప్పుకు, ఒక స్వార్థానికి లొంగలేదు. కొన్ని జీవితాలు అలా అంకితమైనాయి.

పెట్టుబడిదారీ సమాజంలో ఒకవర్గం యింకోవర్గాన్ని దోపిడీ చేయడం, ప్రజల అవసరాలకు నిర్మితమైన ఉత్పత్తి సాధనాలు, పెట్టుబడిదారీ వర్గాల చేతుల్లో కేంద్రీకృతం కావడం, కష్టించే శ్రామికవర్గాల కష్టార్జితం పూర్తిగా శ్రామికవర్గానికి దక్కకుండా కేపిటలిస్టు ఆధిపత్యం లాభాలను ఆర్జించడం జరుగుతూంది. ఈ వ్యవస్థలోని కుత్రిమ విధానం పోవడానికి వర్గసంఘర్షణ బయలుదేరుతుందనీ దానినుండి విప్లవాత్మక మార్పులో సోషలిజం ఉద్భవిస్తుందని కార్లుమార్క్సు పరిశోధన నారాజకీయ విద్యార్థ

లకు ప్రబోధించినమీదట సహజంగా ఆ కష్టించే వర్గాన్ని సమీకరించడము తద్వారా వారిని చైతన్యపర్చడం మా ప్రాథమిక బాధ్యత అయింది.

1938 ఆఖరు భాగంనుండి 1939 ప్రపంచయుద్ధ ప్రారంభం వరకు కాకినాడలో సుమారు ఒక సంవత్సరం వరుసగా వివిధ కార్మికుల హక్కులకై సమ్మెపోరాటాలు సాగాయి. శ్రామికుల మధ్య పనిచేయడంలో శ్రామికుల ఐక్యత, నిర్మాణం, చైతన్యం, పోరాటం దానినుండి హక్కుల సాధన బయలుదేరాయి సిద్ధాంత జ్ఞానంనుండి, ఆచరణ నుండి అనుభవం పొందగలిగాము కాని ముందే వేసిన ప్లాను కాదు, వ్యూహ కాదు, సమాజంలోని రెండువర్గాల మధ్యనున్న వైరుద్యంలో భాగమైనాము.

కాకినాడలో మొదట కార్మిక నిర్మాణం వారి సమ్మె పోరాటం స్టీవిడోరు వర్కర్లతో ప్రారంభమైంది. కాకినాడ సముద్ర వ్యాపార కేంద్రము. ఇంగ్లీషు కంపెనీలు స్థానిక వ్యాపార కంపెనీలు సరుకులు ఎగుమతి దిగుమతి వ్యాపారం కాకినాడ రేవులో సముద్రంలో స్టీమరులోకి కార్మికులను తీసుకువెళ్ళి పనులు చేయించడము, సరకులు దిగుమతి లేక ఎగుమతి పూర్తయ్యేవరకు సముద్రంపైనే వుండడము జరుగు తూంది సరుకుల స్టీమర్లు సముద్రంలోకి వచ్చినతోడనే పడవలలో కార్మికులను ఎక్కించి స్టీమరువద్ద పనిచేయిస్తారు. ఒక గ్రూపు స్టీవడోరు కార్మికునికి ఒక తండేలు, మేస్త్రీ

వుంటాడు. స్టీవడోరు కంపెనీ కొందరు తండేలులను జీతంపై నియమించుకొంటుంది. స్టీమరుపని అనుభవమున్న కార్మికులే అయినా, స్టీవిడోరు కార్మికులు తాత్కాలిక పనివారలుగా మేనేజిమెంటు చూస్తుంది. వర్కర్లకు మేనేజిమెంటు కూలి సక్రమంగా యివ్వక, తండేలులచే వారిని పీడిస్తుంది. వారి సంపాదనలో భాగము మేనేజిమెంటు గుంజి లాభాలు సంపాదించడమే కాకుండా, తండేలులు కూడా మిగిలిన దానిలో పాలు పంచుకొని మాత్రమే పని కల్పిస్తారు. ఈ కార్మికులందరూ హరిజన కుటుంబానికి చెందినవారు.

1938_1939 లో స్టీవిడోరు కార్మికులను సంఘటిత పర్చడంలోనూ, వారి సమస్యలను అర్థం చేసుకోడంలోనూ, వారిని చైతన్యపర్చడానికి కాకినాడలో వారివారి పేటలగు బ్యాంకుపేట, రేచర్ల పేట ప్రాంతాలలో వారి కుటుంబాల మధ్య ప్రచారం సాగించడములో నేను నా శిష్య బృంద ముతో అనుభవాన్ని సంపాదించాము. వారి హక్కులకై ఆందోళన చేయడంలో వారివారి మానసిక ఉత్సాహాన్ని చవి చూచాము. మార్క్సు శాస్త్రాన్ని నా శిష్యులకు అను భవరీత్యా ప్రాథమికంగా శ్రామికవర్గ ఐక్యత, ఆవశ్యకత నేర్పగలిగాను. నాతో డాక్టరు M. V. వీరయ్య, కొర పాటి పట్టాభిరామయ్య, బ్యాంకిపేట వీరన్న, రేచర్ల పేట, సముద్రాలు, విద్యార్థులు వెంకటేశ్వరరావు, శర్మలు మొదలగు వారు ప్రథమంగా కాకినాడ కార్మికులమధ్య పనిచేయడంలో

పేటల్లో కృషిచేసారు. ఈ కార్మికుల సమస్యలు ప్రచారం చేయడానికి వర్కర్ల ఊరేగింపులు, బహిరంగసభలు సాగించాము. వీరి కోర్కెల పట్టిక, తిండి విషయం, పనిగంటల గురించి, రోజు వేతనం పెంపుదల, రాత్రులపనికి అదనపు వేతనం గురించి ఆందోళన సాగిస్తే పట్టణంలో ప్రథమంగా శ్రామికులమధ్య ఉత్సాహం బయలుదేరింది

స్టీవిడోరు కంపెనీ యాజమాన్యాలకు ప్రథమంగా ఒక పరీక్ష. ఇవి సుమారు ఒక అరడజను వున్నాయి. కార్మికులపై పెత్తందారులగు తండేలులను వాళ్ళు సమీకరించి వర్కర్ల కోర్కెలను నిరాకరిస్తూ బెదిరింపులు ప్రారంభించారు. వర్కర్ల ఊరేగింపులు, నినాదాలుసాగి, చివరకు సమ్మె పోరాటానికి వర్కర్లు సమీకరింపబడ్డారు. ప్రథమంగా సమ్మె పోరాటాన్ని 15 రోజులు నడిపాము. యాజమాన్యం దొంగ కూలీలను తీసుకురావడం, వారిని దాచివేసి తిండిపెట్టి, సారాయి పంచి, రాత్రులు స్టీమరులోకి పంపి పని చేయించడానికి సర్వప్రయత్నాలు సాగించారు. నా సహచరులు డాక్టరు M. V. వీరయ్య కొరపాటి పట్టాభిరామయ్య యితర సమ్మె పోరాట కార్మికులను రాత్రులు పగలు కాపలాలు కాసి దొంగకూలీలను పనికి తయారు కాకుండా ప్రత్యేక కృషి సాగించారు. సమ్మె విజయవంతం కావడానికి వర్కర్లను చైతన్యపర్చడం సమ్మె నిర్వహణ ఎత్తుగడలన్నీ నేను నిర్వహించేవాడను. సమ్మె ఉధృతం

పెరిగింది. అన్ని తరగతుల ప్రజలలో దీని ప్రభావం బయలు దేరింది. జాతీయ కాంగ్రెసు బ్రిటీషు గవర్నర్ల క్రింద అధికారంలో వున్న రోజులవి. జిల్లా అధికారులకు ఆరోజుల్లో ఏ సమ్మె అనుభవం లేదు. మేము రాజకీయంగా ఆ రోజుల్లో 1938_39 రహస్యంగా వున్న కమ్యూనిస్టులుగా బహిరంగంగా కాంగ్రెసు - సోషలిస్టుపార్టీకి చెందినవారము, స్థానికంగా కాంగ్రెసు సంస్థలో వార్డు యూనిట్లకు అధ్యక్షులము కూడా అయితే ఆ రోజుల్లో కాంగ్రెసులో వామపక్ష రాజకీయవాదులు జాతీయ విముక్తి పోరాటంలో భాగంగా దానిలో భాగస్వాములము కాని దాని నాయకత్వపు రాజీ విధానానికి అనుకూలురము కాము. కార్మిక సమ్మె పోరాటాన్ని జాతీయ కాంగ్రెసు నాయకులను బలపర్చమని వత్తిడి చేసాము

అప్పటి స్థానిక కాంగ్రెసు నాయకుడు మల్లిపూడి పళ్లంరాజు జిల్లాబోర్డు అధ్యక్షుడు. స్టీవిడోరు సమ్మె 15 రోజులు ఉధృతంగా సాగినతర్వాత, వర్కర్ల హక్కుల పరిష్కరించడానికి పూనుకొన్నాడు, పళ్లంరాజుకు వర్కర్ల ఉద్యమంతో అనుభవంలేకపోయినా జిల్లాబోర్డు అధ్యక్షుడుగా జాతీయవాదిగాను స్టీవిడోరు మేనేజిమెంటు, కార్మికుల మధ్య జీత బత్తాలు యితర పని సదుపాయాలు గురించి పరిష్కరించడానికి యాజమాన్యంతో సంప్రదింపులకు తాను మధ్యవర్తిత్వానికి సిద్ధపడ్డారు, అందుకు అంగీకరించాము,

మా సమ్మె ఆందోళన పటుత్వం తగ్గించకుండా సంప్రదింపులు కొనసాగించాము. ప్రథమంగా కాకినాడ కార్మికుల కోర్కెలు సాధించాము.

ఒక వర్గ కార్మికులలో నిర్మాణం విజయం సాధించిన మీదట, ఇతర తరగతి కార్మికులగు బండ్లు కార్మికులు, పీచు పరిశ్రమ కార్మికులు, ఉప్పుమాలీ కార్మికులు, ప్రెస్ కార్మికులు, బోటు కార్మికులు, పెట్రోలియం కార్మికులు, పోర్టు కార్మికులు, మున్సిపలు కార్మికులు మొదలగు వివిధ తరహా కార్మికుల కోర్కెలకై ఆందోళన సాగించాము.

ఈ పోరాటా లన్నిటిలో విజయాలు సాధించినా, దానిలోని నిర్మాణంలోను, ఎత్తుగడలలోను, సిద్ధాంత చర్చలలోను జాతీయ కాంగ్రెసు ప్రభుత్వ నిర్బంధాన్ని చవి చూడడములో నాకు అద్భుతమయిన అనుభవాలు కలిగా యని చెప్పక తప్పదు.

సీ విడోరు కార్మికుల సమ్మె పోరాటం, నిర్మాణం తోనూ, ఆందోళనతోనూ విజయవంతమయింది. యాజమాన్యం దొంగ కూలీలతోనూ, సారా బట్టీలతోనూ, డబ్బు లంచంతోనూ సమ్మెను విచ్ఛిన్నం చేయడం సాధ్యం కాలేదు. స్త్రీ విడోరు కార్మికుల సమ్మె ప్రథమమైనప్పటికీ, వారి కోర్కెలు వాళ్ళను ఐక్యపర్చాయి. రోజూ ప్రచారం ఆందోళన చొరవను కలుగచేసింది. స్త్రీ విడోరు యాజమాన్యం వారి హక్కులను చివరకు రాజీకి దిగక తప్పలేదు.

1939 సంవత్సర ప్రథమ భాగంలో స్టీవిడోరు కార్మికులసమ్మె నెలరోజులు ఉధృతంగా నిర్వహింపబడి విజయం సాధించడము నాకు, నా సహచరులకు, కార్మికులకు అత్యద్భుతమయిన ప్రోత్సాహాన్ని కలుగచేసింది. సంవత్సరాల శ్రామిక ఉద్యమ పోరాటంలో పొందవలసిన అనుభవాలు ఒక సంవత్సరంలో పొందడం జరిగిందనాలి. శ్రామికులను సమైక్యపర్చి వారి హక్కుల రక్షణకు ఆందోళన సాగిస్తూ, సామ్యవాద సిద్ధాంతాన్ని ప్రచారంచేస్తు కార్మికుల సమ్మె పోరాటాన్ని నిర్వహించాము. ఈ స్టీవిడోరు కార్మికుల సమ్మె పోరాటంలో ముఖ్యమయిన నా సహచరులు యం, వి. వీరయ్య అనుకొన్న కార్యక్రమాన్ని అమలుచేయడం, కోరపాటి పట్టాభిరామయ్య అతిచురుకుగా కార్మికులను ప్రోత్సహించడము జరిగింది.

స్టీవిడోరు కార్మికుల హక్కుల విజయంతో పీచు (కొబ్బరినార) పరిశ్రమ కార్మికుల సమ్మెపోరాటాన్ని ప్రారంభించాము. కాకినాడలో యిది పురాతన పరిశ్రమ. దానిలో ఎక్కువగా హరిజన కుటుంబాలు పనిచేస్తారు. ఈ పనికి రోజు వారీ జీతంకాదు, శెలవులు ఏమీలేవు, యిది తయారుచేసిన సరకుకు రేటు చెల్లిస్తారు. పీచు పరిశ్రమ వర్కర్లు విశేషంగా కాకినాడకు చెందిన జగన్నాధపుర ప్రాంత నివాసితులు. ఈ కొబ్బరినార సరకును యజమానివద్ద తీసుకొని దానిని తడిపి, ఎండబెట్టి, శుభ్రపర్చి, సైజుకు కత్తిరించి, వివిధ సైజులలో

కవిలెకట్టి దాని బరువుకట్టి యజమానికి అప్పచెప్పి వేతనం పొందుతారు. ఈ పని భార్య భర్త కుండా చేస్తారు అయినా వచ్చే ఆదాయం తక్కువ. ఎంత కష్టపడినా కుటుంబాలతో యీ కార్మికతరగతికి ఆర్థిక బాధలు ఎక్కువ. ఈ పనికి పీసురేటు పెంచాలని పనికి డబ్బు త్వరితంగా యివ్వాలని, అడ్వాన్సుకు వడ్డీ వేయకూడదని ఎక్కువ సరకు యిచ్చి పని పూర్తి చేసినట్లు దనే తక్కువ సరకుకు రేటు కట్టడం సరికాదని తక్కెలు సక్రమంగా వేయాలని మొదలగు కోర్కెలతో హక్కుల సాధనకై సమ్మె సాగింది.

స్పిడోరు కార్మికుల సమ్మె పోరాటం ఒకనెలరోజులు ఉధృతంగా సాగి పరిష్కారమయితే, కాటినార పరిశ్రమ కార్మికుల సమ్మె పోరాటం ౩ నెలలు ఉధృతంగా సాగింది పరిశ్రమ యజమానులు కార్మిక ఉద్యమాన్ని లొంగదీయడమే దీక్ష చేసుకొన్నారు. కార్మిక ఉద్యమాన్ని విజయవంతం చేయడానికి, నూతన ఎత్తుగడలతో వర్కర్ల వేతనం పెంపొందించడానికి సత్యాగ్రహం మొదలుపెట్టారు. యజమానివర్గం పోలీసు సహాయంతో కొద్ది మంది దొంగకూలీలను Black legs) తెచ్చి కార్ఖానాల్లో పెట్టి కొద్దిగా నైనా పనిచేయడం మొదలుపెట్టారు. కాకినాడలో కాటినార పరిశ్రమ కార్ఖానాలు ఒక డజను పైగా అప్పుడున్నాయి. మా సత్యాగ్రహం కార్ఖానాలవద్ద పని జరగకుండా చేయడానికే, యజమానులు వర్కర్ల హక్కులు

అంగీకరించి సమ్మె పరిష్కారానికి పూనుకోవటానికి ఒక త్రిపక్ష కార్యక్రమము.

అయితే యిదేకాలములో ఉప్పుమడాల కూలీల జీత, బత్తాల పెంపుదలకై సమ్మె పోరాటాన్ని కూడా నిర్వహించాము, అక్కడ యజమానులు యింగ్లీషు కంపెనీ పేరు కోరమాండల్ కంపెనీ, దాని మేనేజరు యింగ్లీషు వ్యక్తి మూషర్ పర్డ్. ఉప్పుమడాల కూలీలు కాకినాడ చుట్టుప్రక్కల గ్రామాలనుండి వచ్చే వ్యవసాయ కూలీలు, కాకినాడను ఆనుకొనియున్న వందల ఎకరాల భూమిలో ఉప్పును పండించి యింగ్లీషు కంపెనీకి లాభాలు చేకూర్చేవారు. ఉప్పుమడాల కూలీల సమ్మె పోరాటం కాకినాడ చుట్టుప్రక్కల గ్రామీణ పేదప్రజలపైన ప్రభావం చూపింది, ఈ సమ్మెతో పట్టణ గ్రామీణ కార్మికుల సఖ్యత సమకూర్చాము

మొదటి స్టీవిడోరు యజమానులు ప్రాంతీయవాసులు బెంగాలీ కంపెనీలు అయితే, తాటినార పరిశ్రమ యజమానులు పూర్తిగా కాకినాడ ప్రాంతీయ పెట్టుబడిదారులు కాగా, కోరమాండల్ కంపెనీ ఉప్పుమడాల పరిశ్రమ యజమానులు యింగ్లీషు కంపెనీకి చెందినవారు. కనుక ఆంధ్ర ప్రాంతంలో 1939 లో మొదటి శ్రామికవర్గ పోరాటాన్ని నేను, డాక్టరు యం. వి. వీరయ్య, కొరపాటి పట్టాభి రామయ్య, యస్. వి.రత్నం, రావుజగ్గారావు, చిత్రాడ

చిన్న, రావు సత్యనారాయణ కాంగ్రెసు సోషలిస్టులు కమ్యూనిస్టులు, యువ విద్యార్థులు పి. యస్. శర్మ, పర్వతనేని వెంకటేశ్వరరావు, మేకా పట్టాభిరామయ్య, సురేంద్రనాథ్, యువ వర్కర్లనుండి లీడర్లు, సుబ్బయ్య, గద్దయ్య, కోనా సుబ్బన్న, నేరేళ్ళ, శ్రీమతి కొర్లమ్మ, కాకమ్మ, మహాలక్ష్మి, రాజాని చిన్న మొదలగువారు. స్త్రీపిడోరు శ్రమజీవులు తాటినార పరిశ్రమ కార్మికవర్గము, ఉప్పుడూలు వ్యవసాయ కూలీలు ఎదుర్కొన్న పెట్టుబడిదారీవర్గము బ్రిటీషు ప్రతినిధినుండి, భారత ప్రతినిధినుండి, ఆంధ్ర ప్రతినిధివరకు వుండడము ఒక ప్రత్యేకత. దేశంలో జాతీయ కాంగ్రెసు బ్రిటీషు పాలక రాజ్యాంగ సంస్కరణ కాలంలో పరిపాలన సాగించడము కూడా అప్పటి, కాలం తీరు. నేను నా మిత్రులు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ర్వాహకులుగా వుంటూ, జాతీయ కాంగ్రెసు ఉద్యమంలో భాగమై కమ్యూనిస్టు సిద్ధాంతీకులుగా వుండడము అప్పటి కాలపు పరిస్థితికి రాజకీయ వాతావరణ అనికూడా చెప్పాలి అయితే మేము శ్రామికవర్గంతో కలిసి తెలుగుగడ్డపై పోరాటం సాగిస్తున్న 1939 లోని యువకులము.

అప్పటి జాతీయ కాంగ్రెసు అధికారంలోకి వచ్చిన మొదటిరోజులు కనుక జిల్లా కలెక్టరు సుబ్రమణ్యం మేము సత్యాగ్రహం సాగిస్తున్న పరిశ్రమ కార్ఖానాల దగ్గరకువచ్చి, కార్మికుల యజమానుల రెండుపార్టీలను సంప్రదింపులకు

పిలుచుటకు ఆ రోజు సత్యాగ్రహం ఆపమని కోరిన మీదట అందుకు మేము సహకరించినా యజమానులు సహకరించక పోవుటచేత మరుచటిదినమునుండి మేము సత్యాగ్రహం మొదలు పెట్టేవారము.

1939 జాతీయ కాంగ్రెసు కొన్ని రాష్ట్రాలతో మద్రాసుతో సహా అధికారములో వున్నరోజులు. బ్రిటీషు సామ్రాజ్యవాదులు నిర్మించిన పాత పరిపాలన యంత్రాంగము యింకా మార్పు చెందలేదు. ఆ పాలనా యంత్రాంగము ఒక సందిగ్ధతలో వున్నదనాలి. స్టీవిడోరు కార్మికులు పీచు కార్మికులు ఉప్పుమడాలు కార్మికుల సమ్మెల నిర్వహణకు మాకు కావలసిన స్వేచ్ఛ దొరికింది. ప్రభుత్వ యంత్రాంగాన్ని జాతీయకాంగ్రెసు పాలక వర్గ దోరణిని తీసుకొనేటప్పుడు మా ఎత్తుగడలు కొన్ని ఫలితాలు యిచ్చాయి. సిద్ధాంతాన్ని ఎత్తుగడలను మేము సమన్వయం చేసుకున్నాము

పీచు కార్మికులసమ్మె కొనసాగుతుంటుంటె రాజాజీ ప్రభుత్వం దాని జిల్లా యంత్రాంగము పరిష్కారానికి పూనుకోక పోవడంచే మేము పీచుపరిశ్రమ ఫాక్టరీలవద్ద సమ్మె ఉధృతం చేసాము దానితో జిల్లా పోలీసు సూపరింటెండెంటు నన్ను కొరపాటి పట్టాభిరామయ్య, యం. వి. వీరయ్యలను కొందరి కార్మికులను అరెస్టుచేసి కాకినాడ నెం.1పోలీసుస్టేషనులో నిర్బంధితులను చేసారు వందల కొలది పురుషులు కార్మికులు

పోలీసు సేనను చుట్టూ చేసి స్త్రీలు ముఖ్యంగా దీనంగా తీసుకున్నా మమ్మల్ని విడుదల చేయమని ఆందోళన ప్రారంభించారు ఈ ఆందోళననుండి తప్పుకోడానికి మమ్మల్ని పోలీసులు కాకినాడ సబ్ జైలు లోపల పెట్టారు పట్టణమంతా బంద్ జరిగి కార్మికుల ఆందోళన తీవ్రమైతే మమ్మల్ని స్వంత పూచీకత్తులు తీసుకొని మెజిస్ట్రేటు ఆరోజే విడుదల చేసారు. పట్టణంలో 144 సెక్షను విధించి వర్కర్ల ఊరేగింపులపై జిల్లా అధికారులు నిషేధం విధించారు మేము బయటవుండి సమ్మె నిర్వహణకు పూనుకోవాలి కాబట్టి జామీనుపై స్వేచ్ఛను ఉపయోగించాము. ఇక 144 సెక్షను ధిక్కరించుటకు కొందరి మా కార్యకర్తలను ప్రోత్సహించుటచే పోలీసులచే నిర్బంధితులు కాబడ్డారు తద్వారా వర్కర్లతో త్యాగదీక్షరులై సమ్మెపోరాటం పదునైంది వర్కర్లతో రైతునాయకులగు కొత్తపల్లి రావు జగ్గారావు, చిట్టాడ చిన్న, రావు సత్యనారాయణలు ప్రభుత్వ నిషేధపు ఉత్తరువులు ధిక్కరించి జైలునిర్బంధితులైనారు.

ఇలా ప్రభుత్వంపై వత్తిడి కాకుండా అప్పటి జాతీయ కార్యకర్తలతో కూడిన జిల్లా కాంగ్రెసుపై వత్తిడిచేసి కార్మికులలో ఐక్యత ఆందోళన ఉధృతం చేయగలిగాము. దానితో మద్రాసులో|నాటి ప్రభుత్వం లేబరు కమీషనరు యస్. వి. రామమూర్తి I C S ను కాకినాడ పంపి కాకినాడ కార్మికుల సమ్మె పరిష్కరించమని కోరింది. నేను లండనులో

(1932_1937) వున్నప్పుడు యస్. వి. రామమూర్తి మద్రాసు రాష్ట్రంలో వ్యవసాయ డైరక్టరుగావుండి రష్యాలో వ్యవసాయ పరిస్థితి తెలుసుకొనుటకు లండనులో ఆగి ఆ దేశం వెడుతున్నప్పుడు నేను తెలుసుకోడం జరిగింది. కాని ఆయనను లండనులో కలుసుకోలేదు, 1939లో లేబరు కమీషనరుగా ఆయనను కాకినాడలో కలుసుకోడం జరిగింది,

యస్. వి. రామమూర్తి చాల అనుభవము, సమర్థవంతమైన అఫీసరు. కాకినాడ లేబరు సమ్మె పోరాటాన్ని సక్రమంగా అర్థంచేసుకొని మద్రాసు రాష్ట్రంలో టూటికొరిన్‌లో పీచు పనివారల జీత బత్తాలు ఎక్కువగా వుండడమూ వివరాలు ఆధారంచేసుకొని లేబరు కమీషనరు రామమూర్తి కాకినాడలోని పీచు పనివారికి అధిక వేతనాలు యివ్వాలని తీర్పుచెప్పారు ఇది మా శ్రామిక ఉద్యమ పోరాటానికి ఒక విజయం,

శ్రామికులకు ఆర్థిక సౌకర్యాలు సంపాదించడములోనే మా పోరాటం పూర్తికాదు. తద్వారా కార్మికులు వర్గ చైతన్యాన్ని పొందాలని సోషలిస్టు విప్లవధ్యేయం పొందాలని మా కృషి. సామ్రాజ్యవాదానికి కాపిటలిజానికి వ్యతిరేక ఉద్యమం మాది.

ఈ భాగంలో నా అనుభవాలు పునశ్చరణ చేయ

దంలో పాతకాలం జ్ఞాపకం గురించి యితరులకు ఉత్సాహం కలుగచేయడానికి మాత్రమే కాదు నా జీవితంలో ఆ కాలంయొక్క ప్రత్యేకత తరువాతి కాలాలకి దాని ప్రాభల్యం నా జీవిత పరిశోధన అవగాహనకు ఉపయుక్తమని కొంటున్నాను, ఇంగ్లాండునుండి స్వదేశానికి వచ్చిన తోడనే హరిపురా కాంగ్రెసు మహాసభకు నేను హాజరు కావటం తరువాత మంతెనవారిపాలెం, రాజమండ్రి ప్రాంతాలలో నా వయస్సు కంటె తక్కువ వయస్సున్న యువకులకు చరిత్ర, సోషలిజం, కమ్యూనిస్టు సిద్ధాంతము బోధించటం తరువాత వివిధ తరహా శ్రామికులకు ఉద్యమ నిర్మాణం, తద్వారా తమ హక్కులకై పోరాటం, దాని నుండి వర్గ చైతన్యము కమ్యూనిస్టు చైతన్యము పెంపొందించటము ఆకాలంలో సాగింది,

1939 ముందు 1932_1937 వరకు ఇంగ్లాండులో చరిత్ర, శాస్త్రము, మార్క్సిజము చదవటము, లండనులో బ్రిటిష్ రాజకీయపార్టీ లేబరు వామపక్ష ఉద్యమాల పోకళ్లు పరిశీలన సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాల పరిచయము నాకు కొంత పరిజ్ఞానాన్ని కలుగచేసాయి. నా దేశంలో నా ప్రజల స్వాతంత్ర్యానికిపోరాటంలో అనుభవానికి కొంతతోడ్పడ్డాయి అదీకాక 1937__39 జాతీయ కాంగ్రెసు భారత దేశంలో కొన్ని రాష్ట్రాలలో బ్రిటీషు గవర్నర్ల కింద, మంత్రి మండలాలు ఏర్పర్చుకొని అధికారములో వున్నాయి. ప్రపంచ

ముఖ్యంగా ఫాసిజం సామ్రాజ్యవాదము రెండవ ప్రపంచ యుద్ధానికి సన్నిద్ధమవుతున్న కాలము కూడాను నాకు 25_27 సంవత్సరాలమధ్య ఈ చారిత్రిక సంఘటనలలో నా పూర్తి రాజకీయకార్యక్రమం కొనసాగింది.

అదే కాలంలో జాతీయ కాంగ్రెస్‌లో చీలిక ప్రారంభమైంది 1938 లో జాతీయ కాంగ్రెసు నాయకత్వంపు రాజీ విధానానికి వ్యతిరేకంగా సుభాష్‌చంద్రబోసు కాంగ్రెసులోని అతి వాదులను కూడగట్టుకొని అధ్యక్షత పదవిని పొందడములో మితవాదశక్తులు ఆయన్ని తిరస్కరించడము జరిగింది. సుభాష్‌చంద్రబోసు కాంగ్రెసునుండి బయటకువచ్చి కాంగ్రెసు వామపక్ష ఫార్వర్డుబ్లాక్ స్థాపించడము జరిగింది.

కాకినాడలో సమ్మేళనం పూర్తయిన 1939 లో సుభాష్‌చంద్రబోసు విద్యార్థుల మహాసభకు మేము సెప్టెంబరు 1939 లో ఆహ్వానించిన రోజున ఆ సాయంత్రము వార్తలు రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభమైందని తెలుసుకొన్నాము.

బ్రిటీష్‌పాలకులు భారతదేశాన్ని యుద్ధంలోకి దించడాన్ని విభేదించి భారత భవిష్యత్తును [illegible] [illegible]ంచడానికి నిరసనగా రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రి వర్గాలు రాజీనామాచేసాయి. అక్టోబరు 1939 లో మద్రాసు రాష్ట్రములోని రాజగోపాలాచారి మంత్రివర్గము కూడా రాజీనామా చేసింది. రాజాజీ గవర్నమెంటు అధికారములో

తున్నప్పుడు కార్మిక ఉద్యమాన్ని నిర్వహిస్తూ సమ్మె పోరాటాలు సాగించినప్పుడు కాంగ్రెసు ప్రభుత్వం నన్ను జైలులో నిర్బంధించింది. అయితే ప్రజల ఆందోళన మూలంగా విడుదలచేసింది.

అయితే యుద్ధం ప్రారంభమైనతోడనే సామ్రాజ్యవాద యుద్ధాన్ని వ్యతిరేకించాము. కాంగ్రెసు మంత్రివర్గము అక్టోబరులో రాజీనామా చేయడంలో మద్రాసు గవర్నరు పరిపాలనలో కాకినాడలో 29_11_1939నన్ను డాక్టరు వీరయ్యను యస్. వి. శర్మాన్ని, పి. యస్. శర్మను ప్రభుత్వం అరెస్టు చేసి ఒకవత్సరం శిక్షవిధించి రాజమండ్రి జైలుకు పంపింది.

కాకినాడ కోర్టులో కేసు విచారణచేసి శిక్ష విధించిన వెంటనే ఎటువంటి గడువు లేకుండా కోర్టునుండే రాజమండ్రి జైలుకు పోలీసులు తీసుకువెళ్ళారు. మద్రాసు రాష్ట్రంలో మేమే రెండవ ప్రపంచ యుద్ధకాలం ప్రథమ రాజకీయ ఖైదీలము.



నా భార్య టైపాడు జ్వరంతో మంచముమీదవున్నది. ఆమెను పలకరించడానికి కూడ నాకు వీలులేదు. నా మొదటి బిడ్డడు కుసుమేశ్వరరావు పుట్టి సంవత్సరమైంది. అతన్ని చూడటానికి కూడా వీలులేదు. అతన్ని నా భార్యతోడు గాయిచ్చి నాకు జైలు నిర్బంధం ప్రారంభమైంది.

ప్రథమభాగం సమాప్తం